

# పూర్ణిమ

గ్రంథకర్త:
కీర్తిశేషులైన
పానుగంటి లక్ష్మీనరసింహారావుగారు



పబ్లిషర్సు:
కురుకూరి సుబ్బారావు అండ్ సన్,
ప్రొప్రయిటర్సు:
సరస్వతీ బుక్ డిపో, బెజవాడ.

# సరస్వతీ బుక్ డిపోవారి స్టేజీ నాటకములు

బళ్ళారి ధర్మవరం రామకృష్ణమాచార్యులు గారివి.

చిత్రనళీయము రు 1-8
విషాద సారంగధర 1-8
పాదుకా పట్టాభిషేకము 1-6
ప్రమీలార్జునీయము 1-2
ప్రహ్లాద 1-2
చంద్రహాస 1-2
బృహన్నల 1-2
మోహినీ రుక్మాంగద 1-2
పాంచాలీ స్వయంవరము 1-2
ముక్తావళి 1-2
చిరకారి 1-2
సావిత్రి చిత్రాశ్వము 1-2

బళ్ళారి డి. గోపాలాచార్యులు గారివి,

రామదాసు రు 1-4
రామకబీర్ 1-4
సుభద్రార్జునీయం 1-2
ప్రేమచంద్ర యోగి అను
అస్పృశ్య విజయం 1-2

బళ్ళారి పండిత కె. సుబ్రహ్మణ్య శాస్త్రి గారిచే రచియింపబడినవి.

సంపూర్ణ మహాభారతము 1-4
కృష్ణ 1-4
లవకుశ 1-4
మేవాడ శౌర్యాగ్ని 1-4

బలిజేపల్లి లక్ష్మీకాంతకవిగారివి

సత్యహరిశ్చంద్రీయము రు 1-4
సాత్రాజితీయము 1-0
బుద్ధిమతీవిలాసము (శ్రీయాళ) 1-4
ఉత్తర రాఘవము 1-2

ఆకెళ్ళ సత్యనారాయణ కవిగారివి

జయంతజయపాలము రు 0-12
తెనాలిరామకృష్ణ (చిం॥సో) 0-8

కాళ్ళకూరి నారాయణరావు గారివి

చింతామణి రు 1-4
మధుసేవ 1-2
పద్మవ్యూహం 1-2
చిత్రాభ్యుదయం (సారంగధర) 1-0

ముత్తరాజు సుబ్బారావు గారివి

శ్రీకృష్ణతులాభారము రు 1-4
కచదేవయాని 0-12
రణవిక్రమ 0-12
భక్తమార్కండేయ 0-12

పానుగంటి లక్ష్మీనరసింహరావుగారివి

కల్యాణ రాఘవము రు 1-2
వనవాస రాఘవము 1-4
విజయరాఘవము 1-4
పాదుకా పట్టాభిషేకము 1-4
విప్రనారాయణ 1-4
రాధాకృష్ణ 0-12

వలయువారు:— కురుమూరి సుబ్బారావు అండ్ సన్సు,
ప్రొప్రయిటర్సు: సరస్వతీ బుక్ డిపో, బెజవాడ.

శ్రీ

# పూర్ణిమ

( ఏడంకముల నాటకము )


గ్రంథకర్త,

కీర్తిశేషులైన పానుగంటి లక్ష్మీనరసింహారావుగారు



ప్రకాశకులు:

కురుకూరి సుబ్బారావు అండ్ సన్స్,

ప్రొప్రయిటర్సు: సరస్వతీ బుక్ డిపో, బెజవాడ

[illegible]

[illegible]

1943




[వెల 1—4—0

# ఈ నాటకమునందు వచ్చు పాత్రలు

## పురుషులు

| | | |
|---|---|---|
| విజయరావు | — | భట్టిరాజ్యపురాజు |
| దేవరాజు | — | ఇతని కొమారుడు కథానాయకుడు |
| సోమనాధదేవుడు | — | వరాహపుర రాజు |
| శ్రీకంఠదాసుడు, కుమారసింగు | — | సేనానాయకులు |
| చంద్రశేఖరుడు | — | పురోహితుడు. |
| భైరవుడు, భీముడు, శత్రుంజయుడు, కేశవుడు | — | 4 గురు దొంగలు |
| వీరసేనుడు, భవానీదాసుడు | — | వరాహపురపు భటులు |
| భ్రమరసింగు, సుబ్బారెడ్డి | — | దేవరాజు భటులు |

## స్త్రీలు

| | | |
|---|---|---|
| శారద | — | విజయరావు భార్య |
| సర్వమంగళ | — | సోమనాధుని కుమార్తె, దేవరాజుభార్య |
| కాత్యాయని | — | పురోహితుని భార్య |
| పద్మిని | — | సర్వమంగళ దాసి. |



శ్రీ రా మా.

# పూర్ణిమ.

---

నాంది.

మ. పగలన్మోసములన్మహాహవముల ♦ న్బాపార్తులన్నిండు నీ
జగతిన్ద్రోఁచెడు మున్మరీచికలఁ దృ ♦ ష్ణల్వోవ్రునంచేగి, పె
న్దగతాపంబునఁజిక్కి డీలుపడు న ♦ జ్ఞశ్రేణి రక్షించుతన్
భగవద్రాఘవవారివాహము సుధీ ♦ ప్రావృట్పయోధారలన్.

(నాంద్యంతమున)

సూత్రధారుఁడు—నటీ-ఇట నటప్రసక్తియే యున్నది! పారిపార్శ్వకా!

పారి—(ప్రవేశించి) బావగారు నటిని మాని నన్నుఁ బిలిచినా రెందుచేతనో!

సూత్ర—బావా!

గీ. వీర్యవంతులు పురుషులు ♦ వినిన నోడలు
జల్లుమనునట్టి బీభత్స ♦ చండకృత్య
ములను, శోకావహపు గృత్య ♦ ములనునిండు
నాటకంబిది, నటిఁబిల్వ ♦ నాకుఁ దగదు.

పారి—అట్టినాటకము రచించినవా రెవ్వరు?

సూత్ర—బహురసరసనాటకరచనాపటిష్ఠులగు పానుగంటి లక్ష్మీనరసింహరావు పంతులుగారు.

పారి—గీ. తెఱచినదిమొద ల్మూసెడు ♦ వఱకుఁ గడుపు
చెకలుగ నవ్వు పుట్టించు ♦ చిత్రనాట
కములు చేసిన యతఁడు దుః ♦ ఖభయజనక
నాటకం బెట్లు రచియించి ♦ నాఁడో చెపుమ!

సూత్ర—ఆయనగ్రంథకలాపములోఁ బ్రధానరసము హాస్యరసమన్నమాట నిజమే కాని, తదితరరసములు లేవా? ప్రమద్రామానుజ నాటకములలో శాంతకరుణరసములు లేవా? ప్రచండచాణక్యములో భయానకరౌద్రములులేవా? రాధాకృష్ణ నాటకమున భక్తిరసము వెల్లివిరియుటలేదా?

పారి—ఉన్నవి. ఇప్పుడాయన కేబదినాల్గుకాదా?

సూత్ర—ఏబదినాల్గునకు నీనాటకమునకు సంబంధమేమి?

పారి—గీ. కాంచుటకు రెండు ♦ కన్నులే కలిగినట్టి
పూర్వవయసునఁ గాన్పించు ♦ పోలికఁ బ్రకృతి
కానిపింపదు నాలుగు ♦ కనులతోడ,
వర్తనము సేయు నుత్తర ♦ వయసునందు.

సూత్ర— జగత్తు దుఃఖభూయిష్ఠమని యుత్తరవయసులో స్పష్టమగుననియా నీయభిప్రాయము? కావచ్చును. కాని, కవులసును జ్ఞానులను నది తత్పూర్వమే గోచరించును. ప్రకృతి యథార్థరూపమే అది.

పారి—కనుక నీనాటకము కష్టశ్లిష్ట ప్రపంచనాటకముయొక్క ప్రతిబింబమా?

సూత్ర—ఆ! అట్లే—కాని,

ఆ. పాత్రపాళి దివ్య ♦ పాత్రంబుగల దొండు,
పాత్రచరితలందుఁ ♦ బరమపావ,
నంబు నద్భుతంబు ♦ నారీసుశీల ప్ర
కాండమైన చరిత ♦ గలదు బావ!

పారి—దర్శనిశాంధకారములోని తారాదీప్తివలె నదియేది?

సూత్ర—శారదా సహగమనము.

పారి—అయ్యయ్యో! కృతయుగపుమాటలు వినఁబడుచున్నవే! ఆత్మహత్య సుకుమార శరీరల యాత్మహత్య- అతిఘోరమును, దుర్భర దుఃఖాపాదకమును గాని, చూచువారికి సుఖప్రదమెట్లగును?

సూత్ర—మహానుభావులు సుగుణసంపద వారికష్టముల మూలముననే మనకు బయలుపడును. చూడు?

గీ. నలిగి పత్రములు, సువాస ♦ నలను జిమ్ముఁ
బగిలి యుత్తరుపాత్రంబు ♦ వలపు గుప్పు
శుక్తి విచ్చి మౌక్తికమును ♦ జూపునట్లె
మృతిఁ బతివ్రతామహిమను ♦ సతివెలార్చు.

పారి—సరేకాని, పేరుచెప్పకుండగనే పెద్దనాటక మాడుచున్నావే!

సూత్ర—నాటకనామమా? పూర్ణిమ.

పారి—శోకవిషయసంకుల మైన నాటకమున కాహ్లాదసూచకమగు నామమిచ్చినావేమి? వ్యతిరేక లక్షణ చేతనా?

సూత్ర—నాటకనామకగణములు చెప్పెదను విను.

సీ. కవిరచించినరూప ♦ కములలో నియ్యది
యెంచిచూచినc బదు ♦ నేనవయది
పదునేనుమాసముల్ ♦ బ్రదికిరి పెండ్లిపి
మ్మటc బతియును సర్వ ♦ మంగళయును,
పెండ్లికిరండని ♦ పిల్చి వియ్యంకుని
బోరిగొన్నదిన మది ♦ పూర్ణిమాసి,
నారీశిరోమణి ♦ శారద సహాగమ
నంబును బున్నమ ♦ నాcడు జరిగెc,

గీ. పౌర్ణమని శత్రురక్తత ♦ ర్పణమునయ్యె
దేశికుండు కాత్యాయని ♦ దేవరాజు
సర్వమంగళ తత్పిత ♦ సర్వసైన్య
మును గతించిన దినమును ♦ బూర్ణిమాసి.

శారి—ఆహా ! ఏమిచిత్రమరణములు !

(తెరలో)

ఆహా ! ఏమి చిత్రమరణములు! భవానీదాసుcడా ! నీ ద్వారమునొద్ద నందరును గడతేరినారా ?

సూత్ర—అదిగో! మనవారందఱు నాటకప్రదర్శనోన్ముఖులై నట్లున్నారు. ఇcక మనము పోదము రా. (ఇద్దఱు నిష్క్రమింతురు)

కూచి నరసింహము.

శ్రీ

# పూర్ణిమ.

## ప్రథమాంకము.

ప్రదేశము—వరాహపురము.

ప్రవేశము—ఇద్దఱుభటులు—వీరసేనుఁడు, భవానిదాసుఁడు చేరియొక ద్వారమునఁ గత్తులతోఁ గాపుగాయుచుందురు.

వీర—భవానీదాసుఁడా! ఏమిచిత్ర మరణములు! నీద్వారమునొద్ద నందఱును గడతేరిరా?

భవా—నేను దప్ప నీద్వారము నొద్దనో ?

వీర—(లోనికిఁ జూచుట నభినయించి) ఓ—గొడళులతో నఱుకుచున్నారు. గునపములతోఁ బొడుచుచున్నారు. నోళ్ళలోఁ దుపాకులు పేల్చి చంపుచున్నారు. చంపదగినవారందర చచ్చినట్లున్నారు. ఇదివఱకుకంటెఁ గలకలము కొంత శాంతించినట్లు కనఁబడుచున్నది. కాని యెవ్వఁడో యొకడు కళేబరములక్రింద నిదివఱకు దాగియున్నవాఁడు కాఁబోలు నిప్పుడు పైకిలేచినాఁడు !
ఏద్వారమున వచ్చునో భద్రముగ నుండుము.

భవా—ఏద్వారముననున్నది? మృత్యుద్వారముననే వచ్చును. రాని.

(నేపథ్యమున)

గీ. విజయరాయఁడు మనరాజు ♦ వీరకాఁడు
సంఘమరణంపుఁ బెండిలి ♦ సంబరమున
నస్రపువసంతములఁ జల్లు ♦ లాడుకొనుచు
మిడుకుచున్నాఁడు చంపుఁడీ ♦ మొదలకుండ.

వీర—భవానీదాసా ! మనరాజుగారి భటుఁడెవఁడో హెచ్చరించుచున్నాఁడు. ఇతఁడే యీ శ్రాద్ధపుఁ బెండ్లికొడుకు తండ్రి. పెండ్లికొడుకును జంపుటకంటె వియ్యంకునిఁ జంపుటలో నెక్కువ ఘనత యున్నది సుమా.

భవా—ఎందుచేత ?

వీర—తిరుగ నిట్టి నిర్భాగ్యపుఁ బెండ్లికొడుకులఁ గనకుండఁ జేసినవాఁడు లోకోపకారి కాఁడా!

(నేపథ్యమున)

నాయనా ! దేవరాజా ! ఎచ్చటనున్నావు ?

భవా—(విచారముతో) తండ్రీ ! ఇక్కడ. ఇక్కడ.

వీర—ఓరి సిగ్గొంతుకొయ్యా. రానియేడుపు నిట్టె తెచ్చుకొంటివి. నీవు రాజుగారి నటకసమాజములో బూడిదఁబూసికొనఁదగిన వాఁడవురా!

(నేపథ్యమున) ఎక్కడ? ఎక్కడ? ఇదిగో వచ్చుచున్నాను.

(విజయరావు రక్తవస్త్రధరుఁడై ప్రవేశించును.)

భవా—చంపు. చంపు. (విజయరావు మీదఁబడి నఱుకఁ బోవును.)

విజయ—(భవానీదాసుని చేతిలోని కత్తిని దీసికొని) చంపుమని నాకు హెచ్చరింపనేల? అభ్యంతరమేమి! ఇదిగో—(కత్తివిసరును.)

భవా—హా! చచ్చితిని. (నేలఁ గ్రాలును)

వీర—(తనద్వారమును వదలివచ్చి) భట్టికుల రాజవధమునకు వీరసేనుఁ డర్హుఁడు. కాచికో (విజయరావును నఱుకఁబోవును.)

(దేవరాజు వీరసేను ద్వారమునఁ బ్రవేశించును.)

దేవ—భట్టికుల రాజవధమా? అందులకు నీ వర్హుఁడవా? తిరుగు పశువా! తిరుగు. (అని నఱుకును.)

వీర—హా! చచ్చితిని. (నేలఁ గ్రాలును.)

విజ—నాయనా! దేవరాజా! నీవేనా? బ్రతికియుంటివా? తండ్రీ! నా ప్రాణములు పోకముం దొక్కసారి నన్ను బిగఁ గౌఁగిలించుకొనుము.

దేవ—(కౌఁగిలించుకొని) తండ్రీ! మనయందలి చిరకాలక్రోధముచే నీవరాహపురరా జెట్లుజేసెనో! తనకూఁతును నాకిచ్చి పెండ్లిచేసెదనని మనల నందఱ నిటకుఁ బిలిపించి, హా! ఎంతపనిచేసినాఁడు! మూఢులమై నమ్మి వచ్చితిమికదా! మనతో వచ్చిన యెనిమిది వందలజనము మృతినొందినట్లున్నది. మనమిద్దఱ మిప్పటికి జీవించియున్నాము.

విజ—నాయనా! నేనుగూడ మృతినొందినట్లే యెంచుము.

దేవ—(తొందరగతో) తండ్రీ! ఎందువలన?

విజ—గుండెలలోఁ బల్లెపుఁబోటు తగిలినది. ఇఁక నొకటి రెండు గడియల కంటె నెక్కువకాలము జీవింపను. కాని, నాయనా! నీమాటయేమి?

దేవ—నేనుగూడ నీసన్నిధానమునఁ బ్రాణములు విడుతును.

విజ—నాయనా! అందువలనఁ బ్రయోజనమేమి?

దేవ—పితృవిశ్లేషదుఃఖము లేకుండుట గొప్ప ప్రయోజనము కాదా!

విజ—నాయనా! మనమిచ్చట విశేషించి మాటలాడుట కవకాశము లేదు. నే నింక బ్రదుకను. నీవు మరణసాహసికుఁడవై యుండఁ దగదు.

గీ. తనయుమృతిఁ జూడకుండఁగఁ ♦ దరలిపోవు
తండ్రికంటెను భాగ్యవం ♦ తుఁడు లేఁడు
నాకు నీవొక్కఁడవె వంశ ♦ నాశనంబు
నాకొఱకు నీవు చేసికో ♦ న్యాయమగునె!

దేవ—అట్లైన నన్నేమి చేయుమందువు?

విజ—ఇదియే సమయము. శీఘ్రమున నెట్టకైనఁ బాఱిపోయి ప్రాణములఁ గాచికొనుము.

దేవ—ఉత్తమ క్షత్రియోచితమైన వృత్తిని మీరవలంబించి, సామాన్య బ్రాహ్మణోచితమైన పనిని నన్నుఁ జేయుమందురా?

విజ—ఆవశ్యకమైనప్పుడు చేయనే చేయవలెను. దానివలనఁ దప్పులేదు.

గీ. కాలి దిగఁగూలనున్నట్టి ♦ యాలయమును
వెలుపునను వీడిపోవఁ గా ♦ తరత కాదు
దానిలోపలనే నిల్చి ♦ దగ్ధమగుట
పరమనిశ్చలధైర్యవి ♦ స్ఫురణ కాదు.

గీ. కాళ్లు బొండలోపలదూర్చి ♦ గంతులిడుట
జుట్టొకని చేతిలోఁ బెట్టి ♦ మిట్టిపడుట
శూరచిహ్నముగా దెట్టి ♦ దారి నైన
వెలిఁబడుటయే మహాధైర్య ♦ కలన తండ్రి!

గీ. వాలు తరవారి విరిగెను ♦ బడితెయైనఁ
గరమునను లేదు, వైరివ ♦ ర్గమును నీవు
కొటికి చంపంగఁదలఁచితో ♦ బటికిచంపఁ
దలచితివో మంత్రములఁ జంపఁ ♦ దలఁచినావొ!

గీ. మేఘములు గాఢగర్జతో ♦ మీఁదఁబడఁగ
సూర్యుఁడంతటివాఁడు మ ♦ సుంగువడఁడె
యదనుదప్పిన సాగరుఁ ♦ డంతవాఁడు
కికుకురనకుండ వెనుకకుఁ ♦ జికబోఁడె!

గీ. వ్యర్థబాధనుఁ దలయొగ్గి ♦ పడెడివాఁడు
కాతరుఁడె, కాని పోటుమ ♦ గండు గాఁడు
చచ్చుటయె ధైర్యనిశ్చయ ♦ సంజ్ఞయైన
గోఁతఁగూలిన పడతియే ♦ గొప్పగాదె!

గీ. సమయవిజ్ఞతయే ధైర్య ♦ సారమునకు
సారమైయుండు, నింతని ♦ శ్చయముసుమ్ము
చాయకత్తిని మెదటిపై ♦ సానబట్టు
వాఁడు వీరాధివీరుఁడై ♦ ప్రబలువాఁడు.

దేవ—తండ్రీ! మీరు సెలవిచ్చిన యంశములన్నియు బోధములైనవి.

విజ—బోధమైనప్పుడిక మాటలాడక పొమ్ము. హా!

గీ. పూలపాటులు బల్లెంపుఁ ♦ బోటులయ్యె!
గాఢపరిరంభములు కత్తి ♦ కసికులయ్యెఁ
బరిణయపుశాలయయ్యెను ♦ మరణశయ్య
మంగళపుటారతులు కాటి ♦ మంటలగును.

నాయనా! మన కిప్పుడు దినములు బాగుగనున్నవి కావు. మంచిదినములు వచ్చుదనుకఁ, బ్రచ్ఛన్నుఁడవై వేఁచియుండవలయును. అట్లుండుట పిఱికితనము కాదు. అట్లు సేయుట సర్వజీవ సామాన్యము.

గీ. ఆకురాలున మోడైన ♦ యవనిజంబు
సమయమును వేఁచి యుండదే ♦ చచ్చినట్టు
లదనుకై పొంచి మడఁగియు ♦ నడఁగియుండి
పెద్దపులి గంతువేయదే ♦ యెద్దుపైకి?

గీ. కాలిక్రిందను బడియుండు ♦ గడ్డిమొదలు,
ధగధగని మింట వెలిఁగెడు ♦ తారవఱకుఁ
బద్మభవసృష్టివాస్తవ్య ♦ వస్తువితతి
మంచిసమయముకై నిరీ ♦ క్షించుఁగాదె.

నాయనా! మొగమట్లు చిట్లింపకుము. పొమ్ము. వేగఁ బొమ్ము. తండ్రి! చెప్పిన మాట విను.

గీ. తండ్రిమాటలు సుతునకుఁ ♦ దప్పకుండ
వినఁదగినవంచుఁ బండితు ♦ లనుచునుండఁ
దండ్రి యవసాన వాక్యాళి ♦ తనయునకు స
వశ్యకర్తవ్యమని చెప్ప ♦ వలెనె వత్స!

విజ—నీయందలి యనురాగముచేతనే నిన్నుఁ బొమ్మని చెప్పుచుంటలేదు. నీవు బ్రతికియున్న యెడల, నీదుర్మార్గుని—నీచండాలుని — నీ పరాహంప్రియ రాజాధముని — బగఁదీర్చుకొనఁ గలుగుదువనియెంచి, నిన్నుఁ బొమ్మనుచుంటిని. తెలిసినదా?

గీ. గయను, నీవిచ్చుతర్పణ ♦ కమలధార
నాకు ముట్టదంచును నీవు ♦ నమ్మవలయు
నితనిహృద్రక్తతర్పణ ♦ మిచ్చినపుడె
సుతుఁడ! నీవని నాయాత్మ ♦ కుతుకమందు.

దేవ—ఈకటికవానిపైఁ బగఁదీర్చుకొనుటకే నేను బ్రతికియుండుట కొప్పుకొంటిని. ఆపగఁ దీర్చుకొనికాని, నాప్రాణముల విడువను. వీరాగ్రేసరులగు తండ్రిగారి పాదములతోడు భవాని పాదపద్మములతోడు.

(నేపథ్యమున) భవానీదాసుఁడా!

విజ—ఆఁ! ఎందులకు ?

(నేపథ్యమున) విజయరావు కడతేరినాఁడా ?

విజ—కడతేఱుటకు సిద్ధముగా నున్నాఁడు.

(నేపథ్యమున మఱియొక కంఠరవముతో)

సీ. పచ్చని పట్టుదోవతి ♦ కచ్చబిగియింపు
పైకోఁత మగఱాల ♦ పటకవాఁడు
ఉసిరికపండ్లంత ♦ పసిమి మేల్పూసల
రవణింపు కం ♦ ఠాణివాఁడు
మామిడాకునఁ జుట్టి ♦ మణిబంధమునఁగట్ట
రహిమించు పసపుతో ♦ రంబువాఁడు
తాండ్రబెత్తంత పె ♦ ద్దదియైనబలుపచ్చ
సిర్పేషుక్రిందబా ♦ సికమువాఁడు
గీ. పీన్గుపెంటలసిబ్బంది ♦ పెండ్లికొడుకు
దేవరాజేఁడి ? ఏఁడి ? యీ ♦ దేవరాజు
వెదకుఁడీ కంచుదివిటీల ♦ వెలుఁగుతోడ
తోడనే బలిపెట్టుఁడీ ♦ దుర్గగుడికి.

విజ—అతఁడు వరాహపురసేనాధిపతివలె నున్నాఁడు. నీవిచ్చట నుండఁదగదు. నీ పెండ్లికొడుకు దుస్తుల నాకిమ్ము. మరణదేవతా పరీరంభ సంరంభముననుండునాకా వేసము తగియుండును. ఇమ్ము.

(దేవరాజుదుస్తుల తాను తొడిగికొనెను.)

నీవు భవానీదాసుని వస్త్రములు దొడిగికొని కత్తి చేతఁబట్టుకొని వెలుపలికిఁబొమ్ము. నిన్నట్టివేసమున నీపూర్ణచంద్రకాంతిలోనైన నెవ్వరడ్డు పెట్టరు.

దేవ—(భవానీదాసుని వస్త్రములఁ దొడిగికొని) తండ్రీ! నేనింకఁ బోవలసినదేనా?

విజ—నాయనా ! (నమస్కరించును.)

గీ. దర్భశయ్యనుఁ బెండ్లిము ♦ స్తాబు నాకు
ప్రభుసుతుండవు భటుని డ ♦ వాలి నీకుఁ

గూర్చిన విధాతచర్యకై ♦ కుందనేల ?
ఈ ప్రపంచంపు ధోరణి ♦ యింతె తలఁచు.

గీ. వీరవరుకంఠమునఁదర ♦ వారికోఁత
భీరుగళమున సితపుష్ప ♦ విజయమాల
శేముషీమంతుపెట్టెలోఁ జెదలపుట్ట
వాలుతలవాని సొలను బ ♦ ద్రాలకట్ట.

గీ. పరమదాతకు నుభయ ♦ పార్శ్వముల దిట్టు
లెపుడయిన నిచ్చిన నినుతుల్ ♦ కృపణునకును
భక్తునింటను శ్రాద్ధాల ♦ బహుళతయును
నాస్తికునియింట నిత్య ♦ కల్యాణకలన.

గీ. సత్యశీలాఢ్యునకుఁ జెఱ ♦ సాలత్రోపు
అనృతవాదికిఁ దూఁటు ♦ యాలకైపు
మెత్తనగువానికంటికిఁ ♦ జిత్తవాన
మఱికసాయిమీసాలకు ♦ మల్లెనూనె.

గీ. ప్రేమను విషంబు విషములోఁ ♦ బ్రేమభరము
కలిమిలో లేమి లేమిలోఁ ♦ గలిమి బలిమి
ఉన్నదియొ లేదు లేనిదే ♦ యున్నదిట్లు
లోడితెమనఁ దోసులెన్నియో, ♦ నుడువఁదరమె.

దీనికేమి నాయనా! ఒక్కమాట.

గీ. తండ్రియున్నప్పుడే కన్న ♦ తల్లి తండ్రి
కంటె గౌరవపూజ్యతా ♦ కలితయనఁగఁ
దండ్రిమరణించు తరువాతఁ ♦ దల్లినెంత
భక్తిఁబూజింపవలయునో ♦ పలుకనేల ?

నాయనా! ఇఁక నీవు పొమ్ము.

దేవ—తండ్రీ ! నన్నొకసారిఁ గౌఁగిలించుకొనరా?

విజ—ఇఁక వెఱ్ఱిపడకుము. ముద్దులువలదు. కౌఁగిలింతలువలదు. నమస్కృతులు వలదు.

విజ—గీ. అరినిగ్రుద్ధినగ్రుద్దు నా ♦ కగునుముద్దు
కత్తితో శత్రుకోఁత నా ♦ కౌఁగిలింత

యహితు నెత్తిపై ద్రొక్కు నా ♦ కగును మ్రొక్కు
కొడుక! మా యాత్మ కిదె ప్రీతిఁ ♦ గూర్చునయ్య.

(నేపథ్యమున) అదిగో తుమురుల రాయఁడు పెండ్లికొడుకు. పోదు. పోదు.

విజ—నాయనా! నన్నుఁ జూచి నీవనుకొనుచున్నాఁడు. నీవింకఁ బో.

(దేవరాజును త్రోసివేయును. దేవరాజు నిష్క్రమించును.)

పోదుపోదుమన్నవాఁడేకాని పోవుచువాఁడెవ్వఁడగపడఁడేమి? ఓ రాజాధమాధమా! ఎంతపని చేసితివిరా! ఏ కూఁతుకై తెచ్చిన యుశిక్కిమగఁడు నీవును నీ రాజ్యమునకును నిజమైన మగఁడైయుండును. కాచికో.

గీ. మగతనంబున, రణమున ♦ మారొకానంగ
నంగదార్ఢ్యము చాలక, ♦ యాఁడుబిడ్డ
మిసమిసగు క్రొత్తప్రాయంపు ♦ మెఱుఁగుటంగ
కముల పొంగునుజూపి యా ♦ కర్షణంబు
చేసితివి, తొర్పుకాఁడ! ఛీ! ఛీ! దురాత్మ!
బుగ్గమీసలపోడిమి ♦ బుగ్గిచేసి
నగరుమగువల మానంబు ♦ దగులఁబెట్టి
రాచపాడిసానుల గాగ ♦ రానుగప్పి
బ్రతికియుంటివి, చెనఁటి! నీ ♦ బ్రదుకుమండ
కత్తిధారఁ దురాన్నైన ♦ గదుపలేక
కాంతవేసున నుముఁ జంప ♦ గల్గినావు
మాకుఁ బ్రాణము మఱి నీకు ♦ మాన మంత
తొలఁగిపోయెను బ్రదుకేల? ♦ తులువ! పంద
సాలెపురుగైన నీకన్న ♦ మేలుకాదె
అపజయముగొప్ప, మాయాజ ♦ యంబుకంటె
జయముకంటెను న్యాయమా ♦ చావె ఘనము
ఇంతలోఁ దీఱెనని యెంతు ♦ వేమొ చక్ర
వృద్ధితోఁ బగదీఱెడు ♦ వేళవచ్చుఁ
గాలికిందనె యాగ్నేయ ♦ గోళ మిట్టె
పగులనున్నది కాచికో ♦ పాపి! నీచ!

హా! ఎట్లు ప్రేలుచున్నాను. పగదీర్చుకొనుటఁగూర్చి ఎట్టిరజ్జులు పలుకుచున్నాను! సగము చచ్చిననాకది యెట్లు సిద్ధించును!

గీ. కృపణుని యనుగ్రహము పుంస్త్వ ♦ హీనువలపు
మొఱకుసోమరిచదువు కా ♦ తరునియాజ్ఞ
జరఠునాశయు కంపవ ♦ తస్కరుని గుఱియు
శక్తిహీనుని పగయు ని ♦ ష్ఫలములగును.

అయిననేమి? నాపుత్రునిలో నేను జీవించియుందును గాన నేనుఁ బగఁదీర్చుకొనినట్లే కావచ్చును.

గీ. అస్మదీయనాటికఁ దుది ♦ యంకమైన
దవనిపతినైన భరతవా ♦ క్యంబు లేదు.
నాదునౌరసపుత్రుని ♦ నాటకమున
కిదియె మొదటిదానంకమై ♦ యొసఁగుఁగాదె.

సేనాధిపతినైనఁ జంపి ప్రాణముల విడుతును నాకింక విచారమేల? నాకొడుకే బ్రాహ్మణులయింటనైనఁ దలదాచుకొని బ్రతుకఁగలఁడు. (నిష్క్రమించును.)

ఇది ప్రథమాంకము.

శ్రీ

# పూర్ణిమ.

## ద్వితీయాంకము.

ప్రదేశము—వరాహపురమునఁ బురోహితుని యిల్లు.

ప్రవేశము—చంద్రశేఖరుఁడు, కాత్యాయని.

---

కాత్యా—ఆకార్యకరణ మెందుచేత?

చంద్ర—ఎందుచేతనో చెప్పలేదా? ఆతఁ డెవఁడో తెలిసినదా?

కాత్యా—తరువాతఁ దెలియకేమి?

చంద్ర—ఎవరని తెలిసినది? స్పష్టముగాఁ జెప్పు.

కాత్యా—విజయరాజుకొడుకు—దేవరాజు—రాత్రి జరిగిన గొంతుకోత పెండ్లిలోని పెండ్లికొడుకు.

చంద్ర—అందుచే మనశత్రువు. ఇన్నియుఁ దెలిసియుండి యాతని మనయింటిలో నింక నేల యుంచితివి? వాని నిటుపిలువుము.

కాత్యా—నాథా! నన్ను క్షమింపుఁడు. ఇన్నియుఁ దెలియుటచేతనే యాతని నింక నుంచితిని. వాని నిప్పుడు పిలువ వలదు. మన మాలోచించుకొందము.

చంద్ర—ఆఁ! ఆఁ! తెలియుటచేతనే యింక నుంచితివా!

కాత్యా—ఔను నాథా! మనకొక్క కొడుకైన లేఁడుగదా.

చంద్ర—నే నడుగునదేమి? నీవు చెప్పునదేమి?

కాత్యా—నాథా! మొఱడులమై, మొండులమై, గతిమాలినబ్రదుకీశూన్యగృహమున బ్రదుకుచుంటిమిగదా, ఏమి వినియోగము! రాజపౌరోహిత్యమున మీకు గౌరవమున్ననేమి, రసవాదశాస్త్రసిద్ధిని ధనమున్ననేమి, యీగౌరవము నీధనమును లేని సామాన్యులకున్న సౌఖ్యములో, సంతుష్టిలో మనకు సహస్రాంశమైన నున్నదా?

చంద్ర—లేదు. లేకపోవుట యీనాఁటిది కాదు. ఆతని నింక నింటనుంచియేల పుట్టిముంచితివని నేననఁగ, పుట్టనికొడుకునుగూర్చి నీవు చెప్ప నేల?

కాత్యా—అమ్మా యని యాతఁడు నాకాళులపైఁ బడినాఁడు. అమ్మా యనిన పిలుపు నాచెవినిఁ బడఁగనే నాయొడ లుప్పొంగిపోయినది. నాయనా! ఏమికావలయునని యడిగితిని. దాహము—దాహము. అని యాతఁడనినాఁడు. ఇచ్చిన తీర్థమును ద్రావి ఆపన్నుని రక్షింపుమని యాతఁడు ప్రార్థించినాఁడు. నీప్రాణమునకు నాప్రాణమునడ్డు జేసెదనని మంగళసూత్రముతో బాసచేసితిని.

చంద్ర—తా నెవఁడో మొదట నీతోఁ జెప్పకుండ మోసముచే బాసచేయించుకొనినాఁడా!

కాత్యా—ఆతఁడు చెప్పుట కవకాశమేది? పరుగెత్తుకొనుచు, రొజుకొనుచు వచ్చినాఁడు. నేనడుగుటకు మాత్ర మవకాశమేది? అమ్మా! రక్షింపుమనఁగ నాగుండె కరఁగి పోయినది. ఒడలు నీరు విడచినవి.

చంద్ర—నడిరాత్రికదా, గదిలోనున్న నీకాళ్ళపై నాతఁ డెట్లుపడినాఁడు?

కాత్యా—నాకప్పటికింక నిద్రపట్టనేలేదు. కడుపునొప్పుచే బాధపడుచుండుటచే గదా కోటలోనికి రాలేకపోయితిని. ఏదో పెద్ద గోలవినఁబడినది. కొంపలు కాలుచున్న వేమో యని యులికిపడి లేచి వీథితలుపు తెఱచితిని. వెలుతురు లేదు. కాని పెద్ద యాక్రందనము వినబడుచుండెను. అది కోటవైపున నుండి వచ్చుచుండెను. నిశ్చేష్టురాలనై కొంతసేపు నిలువఁబడితిని. ఇంతలో నెవ్వరో పరుగెత్తుకొని వచ్చుచున్నట్టు లలికిడి యయ్యెను. మీకు కోటనుండి యంత తొందరతో నేల వచ్చుచున్నారో యని గుమ్మము ముందునకు వచ్చి నిలువఁడితిని. అంతట దివ్యమంళవిగ్రహముతో నొక బాలుఁడు అమ్మా! యని—

చంద్ర—అయ్యయ్యో !ఎంతతప్పుపనిఁ జేసితివి ?

కాత్యా—అతిధిపోషణము తప్పని సెలవిచ్చుట న్యాయమా?

చంద్ర—అతిథి ! ఆతఁడు మన కరియా ! అతిధియా?

కాత్యా—తపస్సంపన్నులగు మీకు శత్రువు లెవ్వరున్నారు ? ఆతఁడు మనకేమి యపకార మొనర్చినాఁడు ?

చంద్ర—మనకపకార మొనర్చినవాఁడేకాని, మనకు శత్రుఁడు కాఁడా ?

గీ. ధర్మసుతుసొత్తు మాయజూ ♦ దమున శకుని,
గెల్చనేకాని నాకొంపఁ ♦ గూల్చినాఁడె ?
రామచంద్రుని తమ్ముని ♦ రావణుండు,
కొట్టనేకాని సీతమ్మఁ ♦ గొట్టినాఁడె ?
గుజిసిమామూదుసాహేబు ♦ ఘూర్జరాజ్య
దేశసోమనాథేశ్వర ♦ దేవలింగ
భంగ మొనరించెఁగాని నా ♦ పాకలో వి
భూతిపండును భేదింపఁ ♦ బూనినాఁడె?
మనమహారాజవరులకు ♦ మతమునకును
బాధయొనరించు మనుజుఁడే ♦ వైరిమనకు,
మేలొనర్చెడు నాతఁడే ♦ మిత్రవరుఁడు
ప్రాక్తనాచారమిదియె యి ♦ ప్పటిది యదియె
ధరణిపతి సేవకులకు స్వా ♦ తంత్ర్యమిల్ల
వారి బాహ్యాంతరింద్రియ ♦ వారమెల్ల

ధరణిపతిగో నెసంచిలో ♦ దాఁగియుండు
తత్త్వగతి వర్ణకాలభే ♦ దములు లేక
ప్రభునియానతి యైనచో ♦ భటులనోటఁ
గుక్కకును గంగడోలును ♦ గొమ్ములుంచు,
రాసభపుటోండ్రపెట్టు క ♦ ర్ణాటగీతి
దుష్టగంధపుఁజుంచు క ♦ స్తూరిమృగము
శశశిశువు చండశార్దూల ♦ శాబకంబు
శుంఠలకు శుంఠసత్కళా ♦ సుగుణశాలి
ప్రభుఁడు సర్వథా మననుండి ♦ ప్రతిఫలించు
నతనిమిత్రులె మనమిత్రు ♦ లరులె యరులు.

కౌత్యా—నాథా ! ఇంతయేనా ? మన మవస్తులమేనా ?

చంద్ర—ఇంకను సందేహమా.! ఇది మహావీర్యవంతమైన రాజపుత్రాస్థానమను కొంటివా, మఱియొకటి యనుకొంటివా? ఈమహారాజుల క్రౌర్యమెంత ! కోపమెంత ! వారు ప్రజల యవిధేయతను సహింతురా ? కొంసంత వ్యతిరేకపుమాటనైన సహింతురా !

గీ. భూపవరునింటఁబుట్టిన ♦ మూషికంబు,
బ్రాహ్మణులు పెంచుపిల్లిని ♦ బట్టిచంపు
ననఁగ సేవక బ్రాహ్మణు ♦ లైనమనము
రాజుతో వైరమునుబూని ♦ బ్రతుకఁగలమె ?
రాజసేవను గలకష్ట ♦ రాజియెంతొ
ఎఱుఁగ కిట్టులుచేసితి ♦ వింతదనుక
నేల ! ఖానుకోడికి నెత్తి ♦ జూలుమిగులఁ
బలుచననిపల్క మనజుట్టు ♦ పిలుక యెగురు
ఇంతలోనుండు భటకోటి ♦ యంతబ్రతుకు
మంత్రిమొదలు నిషాగొట్టు ♦ మాలవఱకు
పృథ్విపతికంటుకొలుకుల ♦ నెత్తుగీఁత
భటులకంఠంబులను దర ♦ వారికోఁత.

ఇట్టి స్థితిలో మనకు మహాశత్రువైన దేవరాజును—కత్తివ్రేటున కందనున్న దేవరాజును—నీవింటిలో దాఁచినావు. ఇంతకంటె సాహసిక కృత్యమున్నదా? ఈసంగతిఁ గర్ణాకర్ణికగ విని రాజు మనయింటికి యుద్ధభటుల నంపఁడా? మన కొంపను నేలమట్ట

మును చేయింపఁడా? మనలను ముక్కలక్రిందఁగోసి మనరక్తముతో గోటశక్తికషేభిఁ క్షము చేయింపఁడా?

కాత్యా—మహారాజునకుఁ బురోహితునిఁ జంపు పాపమెక్కడేటి లోపముగా నున్నది.

చంద్ర—కాత్యాయనీ! రాజులకుఁ బాపమేమి?

కాత్యా—ఔను. అన్ని పాపములు నెత్తిని వైచుకొనుటకుఁ బురోహితుఁడున్నాఁడుకాదా! రాజునకుఁ బాపములేదు. పురోహితునకు గతిలేదు. మీకుఁ బురోహితులని పెద్దపేరో తక్కువపేరో యున్నది కదా! మీరు రాజుగారి కేహితమునైన ముందుగాఁ జెప్పి యాతఁడు చేయఁదలఁచిన పాపమునుండి యాతనిఁ దొలఁగింపఁ గలిగితిరా?

చంద్ర—పూర్వరాజుల వైఖరులు, పూర్వపురోహితుల వైఖరు లిప్పుడెక్కడివి? పురోహితుని నెత్తిపైఁబెట్టుకొనుట కిదేమి శ్రీరామయుగమా, యుధిష్ఠిర పరిపాలనమా! ఇప్పటి రాజుల పద్ధతులు వేఱు. రక్తివిద్యల సేవకుల కిదికాలము. అందుచే మామొగము జూచువా రేవరు? ఇప్పుడు నేను బ్రబంధము వ్రాయఁగలనా? పదముఁ బాడఁ గలనా?

గీ. గురునికంటెను గవికంటె ♦ గురుతరంపు
ఘనతఁగల పురోహితుని దుర్గతిని వినుము
కోడిగ్రుడ్డుల గుల్లలు ♦ వాడి ముక్క-
మాలకాకులు, తలసేస ♦ బ్రాలుజల్ల
బిళ్ళకచ్చను ఖాన్‌కుక్క ♦ పీఁకుచుండ
లూఢియూనాచడావుల ♦ జోడు చేతఁ
బట్టుకొనియుండు లంపటా ♦ వానిపృష్ఠ
మాశ్రయించుచు గడగడ ♦ లాడుచుండి.

కాత్యా—నాథా! ఇకఁ జెప్పవము. ఇదియా మీకు రాజుగారి యొద్దనున్న గౌరవము! చాలు చాలు!

చంద్ర—తద్దినాల పెండ్లిండ్ల దద్దయ్యశాస్త్రిల కింతకంటె గౌరవ మెటనుండి వచ్చును?

కాత్యా—ఆఁ. ఆఁ. మహారాజుతద్దినాల పెండ్లియేజరిగించినాఁడు. రెండు కటికవాఁడు—ఇట్లుచేయుట మహాధైర్యవిజృంభణ మనుకొనినాఁడు కాఁబోలు. మహాబుద్ధివిభవ మనుకొనినాఁడు కాఁబోలు. ఇంతద్రోహము తన్నుఁ దిరుగఁబడి కొట్టినివేళ యైనదా? పందిళ్ళు వేయించి తోరణములు కట్టించి పసపులు గొట్టించి ముగ్గులుంపించి యలంకరించిన పెండ్లియింటిని పీనుఁగుపెంటలవల్ల కాఁడు చేసినాఁడు. పీనిపాపము బ్రద్దలుగాను కూఁతు పేరిట నింత గొంతుకోఁతల గోలజేసినాఁడు. అకూఁతున కిది యశుభప్రదమేమో

యనిర్మైన నాలోచించినాడా! పెండ్లివారి రక్తమున దడిసిన కళ్యాణగృహము గడిగిన శుద్ధియగునుగాని యిందువలనఁ దనవంశమునకుఁ గలిగిన మచ్చ ప్రళయమువఱకు నిల్చియుండదా! ఇంత దిక్కుమాలిన మోసమెందులకు? యుద్ధమునకుఁ బిలువరాదా? న్యాయముగా హోరాహోరినిఁ బోరి కదనసీమను వారి కత్తుకలు గోసినయెడల ప్రస్తుత రాజులశిరములూఁగునే! పూర్వరాజుల యాత్మ లుప్పొంగునే; చేతగాని పెద్దమ్మ. ఛీనఁటి.

చంద్ర—తప్పు. తప్పు. పోషించు ప్రభువును దూషింపఁ గూడదు. ఇంతడు నాతఁడు మనకేయపకృతినిఁ గావింపలేదు. తన శత్రువులను దాను జంపుకొన్నయెడల నీకుఁ గోపమెందులకు? శత్రువులను జంపుటయే రాజులకుఁ బ్రధానముగాని యెట్లు జంపిన సరే!

గీ. ధర్మయుద్ధంబులందైన ♦ మర్మకలన
యున్నదచ్చటచ్చటఁబూర్వ ♦ యుగములందు
మబ్బులందు రావణి నిద్ర ♦ మబ్బులందు
ద్రౌణి, పాండవాగ్రజుబొంకు ♦ రాముకొంకు.

గీ. మర్మమునకుఁ గల్గు ♦ మహితరక్షణశక్తి
వర్మమునకు నెట్లు ♦ పరిఢవిల్లుఁ
జిత్తమునకుఁ గల్గు ♦ మెత్తనౌ వాడిమి
చాయకత్తి కెట్లు ♦ సంభవించు?
బాణపరిపాటికంటెఁ దు ♦ పాకిగుండు.
పాటుకంటెను ధీధాటి ♦ ప్రబలతరము
ధామ్మును ఫిరంగిగుండ్ల మం ♦ టలను లేదు
మొదటిచలువనే యున్నది ♦ కదనజయము.

గీ. కల్లయతులలాతౌములఁ గత్తిదాఁచి
కపటవైద్యుల సీసాల ♦ గరళముంచి
దొంగగుబ్బల ప్రక్క ♦ పిస్తోలుగూర్చి
కొలఁకులందు విషూచి పు ♦ ర్వులను జేర్చి
వంటశాలలో నాసు ♦ పత్రులందు
మఖములందు దేవాలయ ♦ మండపములఁ
గాటియందుఁ గన్నెటికపు ♦ గదులయందు
రణజయముఁ గాంతు రిప్పటి ♦ రాజసుతులు

బాహుబలపరీక్షావృత్తి ♦ ఖండనంబు
బొల్లి వేసంపుదొంగదో ♦ బుచ్చి కాదు
గోతులయు దొంగయూబుల ♦ గొడవగాదు.
ప్రాకృతికశాస్త్రవైదుష్య ♦ పటిమకాదు
నాగరకత హెచ్చె ♦ నరులధర్మము చచ్చె
మాయమీఱె దేహ ♦ మహిమలాఱె
ఆత్మగురుతతగ్గె ♦ నపరచింతలు ప్రగ్గె
ఆశనిండె చిత్త ♦ మార్తిమండె
అట్టిదిట్టిదియయ్యో నీ ♦ యవసరమున
నింతకంటె నాగరికత ♦ హెచ్చునెడల
నెవరియింటనువారుండి ♦ యేదొయొక్క-
గాలి నుష్ణాగ్ని జగమంతఁ ♦ గాల్తురేమొ !

మాయయనునది యిప్పుడు జనపతి సామాన్యముగా నుండుటచేత నీవు మన రాజును నిందించుటతప్పు. జగదాస్తిక్యమునకు మాయయేకారణముకాదా! శత్రువుల చర్మము లొలిపింపుమందువా ! లేక శత్రువులొనర్చు చేష్టలకు శాంతివహింపుమందువా !

గీ. వలపునకుఁ గట్టుపడుసాని ♦ వడుచుఁబోలె
పారమార్థికుఁడగు న్యాయ ♦ వాదిసరణి
అరులయెడ శాంతభావంబు ♦ నెఱపురాజు
చేతిచమురు భాగవతపుఁ ♦ జిందులాడు.

కావున, రాజేంద్రుల కెట్టులైనను శత్రుమారణ మవశ్య కర్తవ్యము.

కాత్యా—కావచ్చును. కాని యతిథిరక్షణము బ్రాహ్మణుల కంతకంటె నవశ్య కర్తవ్యముకాదా!

చంద్ర—ఏమి ! అబ్బ ! ఎంత చిక్కుఁ దెచ్చి పెట్టితివి. నీ కీస్వాతంత్ర్యమేల ?

కాత్యా—అతిథిపూజాస్వాతంత్ర్యము నా కీనాఁటిదా ! నాకొక్కతెకే యట్టి స్వతంత్రతయున్నదా! గృహిణులందఱ అట్లాచరించుచుండుట లేదా ?

చంద్ర—గృహిణులందఱు నీవలెనే శత్రురాజపుత్రుల కాతిథ్యమిచ్చుచున్నారా? అతిథి పాత్రుఁడగునో కాదో చూచుకొనవక్కఱలేదా?

కాత్యా—అతిథి కాకలియే యర్హత. అతఁడు శత్రురాజపుత్రుడని నాకు ముందుగా నెట్లు తెలియును?

చంద్ర—పోనీ! తెలిసిన తరువాతనైనఁ బశ్చాత్తాపము నొంది యాతనిఁ బొమ్మని చెప్పలేకపోయితివా!

కాత్యా—నాథా! పశ్చాత్తాపపడుటకు నేనేమి పాప మొనర్చితిని ?

చంద్ర—పాపముకాదా! మనము రాజసేవకులమై యుండియు నిట్లు చేయ వచ్చునా ?

కాత్యా—రాజసేవ మీకుంగాని నాకేమి? నేను మీసేవకురాలను. మీయాజ్ఞాను సార మాచరింతును. ఇప్పుడు పొమ్మని చెప్పనా?

చంద్ర—పొమ్మని చెప్పనాయని నన్నడుగ నేల? నీ కేల తెలియదు?

కాత్యా—నాథా! నాకుం దెలిసినయెడల నే నేల యాతనిం జేర్చియుందును? పొమ్మని సెలవిచ్చినయెడల నట్లు చెప్పుదును.

చంద్ర—పొమ్మని చెప్పు.

కాత్యా—మీసెలవైనదని చెప్పనా?

చంద్ర—అదిగో! నాసెలవనుట యెందులకు? ఆతనిం జేర్చుటకు నేను సెల విచ్చితినా! ఇప్పుడు పొమ్మనుటకుమాత్రము నాసెలవేల కావలెను? నీవు స్వతంత్రించి తెచ్చితివి. స్వతంత్రించియే పొమ్మనుము.

కాత్యా—పుణ్యమొనర్చుటకుం బురుషునియాజ్ఞ యక్కఱలేదుకాని; పాప మొనర్చునప్పుడే భర్త సెలవు.

చంద్ర—పాపమైన నగుంగాక. ఆతని వెడలగొట్టవలసినదే. ఆతని నింటం బెట్టుకొనుట యొకటి, చూరికి నిప్పు పెట్టుకొనుట యొకటియునా? ఆత్మవినాశక మైన యీయత్నము మనకేల? ఈసంగతిం దెలిసినయెడల రాజు మనల నుప్పుపాతఱ వేయింపండా!

కాత్యా—మనకు లేనిపోని సందేహమేకాని, మనయింట నెవ్వరున్నారో రాజున కెట్లు తెలియును?

చంద్ర—అట్లెప్పుడును దలంప వలదు.

గీ. గాలిచొరనట్టి చోటులు ♦ గలవుకాని
అతని చెవినిం జేరని రహ ♦ స్యములు గలవె!
అత్తకోడండ్ర దెప్పులు ♦ నాలుమగల
గుసగుసలు నాండుబిడ్డల ♦ రొనరొనలును
బాలిపంపుల భ్రాతల ♦ పట్టుదలలు
తోడికోడండ్ర ♦ వెడవెడ కోడిగములు
మొదలుగా నన్ని సంసార ♦ ములను గల్గు
ఛిద్రతతియెట్టి యాతని ♦ చెవినిం జేరు
ఏరయితు క్షేత్రమేదియో ♦ యెఱుంగకున్న
నేభటుని సాని యేదియో ♦ యెటిగియుండు

తనదువ్యవహారదోషముల్ ♦ గనకయున్నఁ
బరుల వ్యభిచారదోషంబు ♦ లెఱిఁగియుండు
దాసి గదిలోన గాయకుఁ ♦ డన్నననుచు
గురువుగా రింటిలోఁ గల్లు ♦ కుండయనుచుఁ
జెవికొఱుకువారుఁ దార్పుడు ♦ సేయువారు
కొండెకూఁతలవారును ♦ గోడెకాండ్రు
బానిసలు రాజుమెప్పుకై ♦ పలుకుచుండ్రు
కలికి పలుకుల కులుకుల ♦ కవితకంటె
నధికముదమున వినుచుందు ♦ రవనిపతులు
వైరుల రహస్యములు తెలుప ♦ వలయు వారు
లట్లుసేయుట కసమర్థు ♦ లౌటవలన
నిట్టికొండెంబులనె మాటఁ ♦ గట్టి యతని
యెదుటఁబెట్టఁగ వినకుండ ♦ నేమిసేయు.

ఇట్టి మాటలఁ జెప్పువారిని గద్దించిన యెడల శత్రురహస్యములు చెప్పవలసి వచ్చి నప్పుడు కూడ వారు దరిచేరరేమోయని రాజు సందేహపడును. కావున దేవరాజిక్కడ దాఁగెనను సంశయము రాజున కెట్లు తెలియునని నీవనుకొనఁదగదు. ఎట్లులైనఁ దెలియును. గోడలుచెప్పును. గాలిచెప్పును. లేనివే యున్నట్లు రాజుచెవినిఁ బడుచుండఁగా, నున్నవి యాతనిచెవిఁ జేరకుండునా? గోటిపోటు, కత్తివ్రేటుగా నాతని చెవిని బడుచుండు నే చీమచిటుకు, సీమతుపాకిదెబ్బగా నాతనికి వినఁబడునే! అట్టిస్థితిలో నీవుచేసిన యీ ప్రబలపాపము—

కాత్యా—నాకిన్ని తెలియవు. పుణ్యామో, పాపమో; తెలిసియో, తెలియకయో చేసితిని. నీవు దయయుండునెడల దేవరాజును రక్షింపవేఁడుచున్నాను.

చంద్ర—అయ్యయ్యో! అన్నవస్త్రము లిచ్చి యాదరించు మహారాజునెడలఁ గృతఘ్నుండనై యుందునా! అది మహాపాపము కాదా!

కాత్యా—అతిథినిఁ జంపుట మహాపుణ్యమైన యెడల నటులే కానిండు.

చంద్ర—అతనిని మనము చంపుటయేమి? వదలివేయుదము.

కాత్యా—అతఁడీ గుమ్మము దాఁటుసరికి వెట్టిపక్కను గొట్టినట్లందఱు తలకొక దెబ్బ యిచ్చి యాతనిని జంపకుండనుందురా! అతని రక్తముతో మన ముంగిలియే కాదు. మనముందఱిగతియుఁగూడ నపవిత్రమగుట కేమైన సందేహమా! మనకు శత్రువైనను నాతఁడు మహారాజపుత్రుఁడుకదా! రక్షింపుమని మన శరణు జొచ్చినవాఁడు కదా! మనచే నభయప్రదానమొందినవాఁడు కదా! అట్టివానిని రక్షించుభారము వింధ్య

పర్వతమువలె మనసెత్తిని బడియుండఁగా పెంటమప్పనువలెఁ జీపురుతో నాతనిని వీధిలోని కూడ్చివేయుమనుట న్యాయమా!

చంద్ర—ఆతఁడు మన కేమి రాజా! ఆతనిఁగూర్చి మనమఁ జింతయేల ?

కాత్యా—ఆతఁడు మనరాజని చెప్పలేదు. ఆతఁ డతిథి. అతిథి మహావిష్ణువనికదా మీవంటి పెద్దలు చెప్పుదురు.

చంద్ర—రాజుగూడ నటివాఁడే, అయినను నా కాతఁ డతిథికాఁడు.

కాత్యా—ఆహా! నాథా! ఎంతమాటాడినారు! నా కతిథియు మీకతిథి కాకపోవుటయునా ? ఎన్నడులేని దిప్పుడు నీవు నేను భేదము చేయుచున్నారే? ఎంత వింతగ మాటలాడుచున్నారు! నేను మీ సహధర్మచారిణినే! అర్ధశరీరిణినే! నేను మీలోని దానినే! నాదియనున దొకటియున్నదా! అంతయు మీదే! సంసారాను రాగమేకాక శాస్త్రసత్యముకూడ నంగీకరింపని నీవు నేను భేదమును విసర్జింపుఁడు. లేనిపిల్లలకొరకే యేడ్చుచుండఁగా నిట్లునన్నుఁ బరాభవించుట మీమఁ దగునా ?

చంద్ర—నేను నిన్నెట్లు పరాభవించితిని! ఆతఁడు నీ ప్రియతిథియని యంటిని. అంతమాత్రమునకే యింత యుపన్యాసమేల ?

కాత్యా—సరే! ఆతఁడు నాయతిథియే. మీరాతనిని రక్షింప నక్కఱలేదు. ఆతనిని మీరింటినుండి గెంటివేయవచ్చును. వీథిలోని రక్షకభటులచేతఁ జంపింపవచ్చును. మీయతిథి కాకపోవుటచేత మీరింతయుఁ జేయింపవచ్చును. మీకది ఘనకార్యమే కావచ్చును. కాని నేను మీ యిల్లాలినిగదా! నిత్యాగ్నిహోత్రములందు మీ ప్రక్కను గూరుచుండి సాహాయ్య మొనర్చుదాననుగదా! మీ యుచ్ఛిష్టమును భుజించుచున్న దాననుగదా! మీరే దైవమనియెంచి పూజించుచున్నానుగదా! అట్టినామాట, మీరు కొంసంతయైనఁ జూడనక్కఱలేదా ?

చంద్ర—నీమాట యేమున్నది?

కాత్యా— ఆతనిని నేను రక్షింతునని మంగళసూత్రముతో బాసచేసితిని. నామర్యాదను మీరు కాపాడనక్కఱలేదా? నాసత్యమును రక్షింపనక్కఱలేదా? రసకుంభముచే మీరుచేసిన బంగారమంతయు నానెత్తిని బెట్టుమనలేదే. ఆ శాస్త్ర రహస్యమేదో చెప్పుమని మిమ్ము దేవురింపలేదే. ఆపన్నుఁడై, నాశరణమువేఁడిన రాజ బాలకునకుఁ దలదాఁచుకొనుటకు రవ్వంత నీడనిమ్మంటిని. ఇంతేకాదా! అమ్మా యని పిలిచినందుల కాతనినిఁ గన్నకొడుకుగా భావించి యొక్క పూటయైనఁ గడుపార నన్నము పెట్టుకొన నిమ్మంటిని. ఇంతేకాదా ? ఇంతేకాదా!

చంద్ర—ఇంతేకాదా, ఇంతేకాదా యని నంగనాచివలె మాటలాడుచున్నావు.

గీ. అరికినిచ్చిననీడ ర ♦ వ్వంత యైన
వంశమున నెల్లరకును శా ♦ శ్వతపు బీడ
వైరికొసఁగిన యన్నము ♦ పట్టెడైన,
స్థిరవినాశనమగు వంశ్య ♦ నరులకెల్ల.

కాత్యా— అటులైన నాతని నింటనుండి యిప్పుడే వెడలఁగొట్టవలయునని మీయభిప్రాయము కాదా?

చంద్ర—అదిగో! తిరుగ నామాటయే యేల పలికెదవు?

కాత్యా—మీరామాటయెవ ననఁగూడదు కాని, నేనాపనినిఁ జేయవలయును గాఁబోలు. అభయమీయని మీరే యామాటఁ గంఠోక్తిగాఁ బలుకుటకు సందేహించు చుండఁగా నభయమిచ్చిన నోటితో నాపలికిఁ బొమ్మని నేనుఁ జెప్పవలయునుగాఁబోలు! పోకపోయినయెడల మెడబట్టి గెంటవలయునుగాఁబోలు. నాశాశ్వతదుర్గతిని మీరు గణింపకుండినను నాకుఁ జింతలేదు. నాయాత్మను దరింపఁజేసినను మీరే! హరింప జేసినను మీరే! మీకు సర్వదా దాసురాలను. సరే! మీరు సెలవిచ్చినట్లాతని నావలికి వెళ్ళఁగొట్టితిననుకొనుఁడు. తరువాత ?

చంద్ర—ఇంకఁ దరువాత నెక్కడ?

కాత్యా—ఇక్కడితరువాతమాటయే యడుగుచున్నాను (పైకిఁజూపి) అక్కడి తరువాత యేదో వేదములే చెప్పుచుండుటచే నందఱకుఁ దెలియునుగాదా?

చంద్ర—ఉష్. ఇక్కడితరువాత నిఁకేమున్నది? ఆతఁడు పోవును. మనము నిర్బాధకముగా నుందుము.

కాత్యా—సరే! మనము శాశ్వతముగా జీవింపవచ్చును. కాని యాతఁడు—

చంద్ర—కాత్యాయనీ! అతిథినిఁ జంపించి యాతని యాయుస్సును నేను బోసి కోవలయునని యిట్లు చెప్పుచుండుటలేదు. అతిథిపూజా మహాత్మ్యము నీయంత నాకును దెలియును. అతిథినోటియన్నముఁ బడగొట్టి నాకడుపు నిండించుకొనఁదలఁచుకొనలేదు. అతిథిరక్తముఁ ద్రావునంతటి నరాశనుఁడను గాను. అబుద్ధిపూర్వకముగనైన నతిథికిచ్చు ధాన్యపుముల్లంతబాధ ధవళగిరియంత పాపమని యెఱుఁగుదును.

కాత్యా—(చేతులు జోడించుకొని) చాలు నాథా! చాలు! ఇఁకఁ గావలసిన దేమి? కృతార్థురాలనైతిని.

చంద్ర—ఉండు. ఉండు. ఇంకను జెప్పవలసియున్నది. కాని రాజకృతఘ్నతా పాపము దానికంటె మహా ఘోరమని భావించుచున్నాను. భయపడుచున్నాను. పరి తాప పడుచున్నాను.

గీ. ఉర్విపాపంబులన్నియు ♦ నొక్కచిప్పఁ
గుప్పగాఁబోసి వేఱొక్క ♦ చిప్పలోప
లను గృతఘ్నతఁబెట్టి తూ ♦ చినను మును
మొన కృతఘ్నత ప్రకనే ♦ మొగ్గుగాదె
తలనడిమిపోటు పూపాటు ♦ దానిముందు
దావకీలప్రాలేయము ♦ దానిముందు

త్రాచుఁగరళంబు సంజీవి ♦ దానిముందు
దారుణక్రూరగతి దయ ♦ దానిముందు

కాత్యా—నాథా ! మీయభిప్రాయమునకు వ్యతిరేకముగా మనవిచేసికొనవలసి వచ్చినందులకుఁ జింతించుచున్నాను. క్షమింపుఁడు. కృతఘ్నతయని ప్రత్యేకముగా నొక్కపాపములేదు. అన్ని తుక్కగొడుగులు, మొండిచేతులు, పెంటనుండి మొలచినట్టు లన్ని పాపములు కృతఘ్నతనుండియే బయలుదేరినవి.

కాత్యా—భూమినుండి మొలవని చెట్లైననుండవచ్చును గాని కృతఘ్నతనుండి యుద్భవింపని పాపములేదు. చెట్టుబలాబలములు క్రింది పెంట బలాబలములఁబట్టి యుండునట్లు పాపముల హెచ్చుతగ్గులు కృతఘ్నతావిషయములగు వస్తువుల హెచ్చు తగులఁబట్టియు దగ్గరదూరములఁబట్టియు నుండును. జీవతత్త్వమంతయు నొక్కటియేయగు టచేఁ గాలి మడమతోఁ జీమను జంపుటయుఁ గత్తిపోటుపుతో మనుష్యునిజంపుటయుఁ గృతఘ్నతనుండి పుట్టినపాపములే కాని చీమకంటె నరుఁ డుత్కృష్టజీవమగుటచేతను, జీమకును నరులకును గలదూరము హెచ్చగుటచేతను, నరహత్య యధికపాపమని యెంచు చున్నారు. అట్లే గురుద్రోహ మంతకంటె నధికమైనది. రాజద్రోహము నట్టిదే. కాని, యతిథిద్రోహము, వేదద్రోహము; దైవద్రోహము, రాజద్రోహమునఁ గొంత పౌరుషమైన నున్నది. కాని యండచేరిన యతిథిని ద్రోహముచేయుటలో నున్న యధమాధమత్వము—

చంద్ర—చెవులు గింగురుమనునట్లు పలుకుచున్నావు. పండితునిబిడ్డ వగుటచేఁ దలతిక్కయుపన్యాసము లారంభించితివి. ఈతఁడతిథియని యంటివి. ఏలకాదనవలయు నని నేనూరకుంటిని. ఈతఁడు శరణార్థి కాని యతిథికాఁడు. ఈతఁడెవ్వఁడైనను నీతనికిఁ జేసిన యనాదరణము కృతఘ్నత యెట్లగును? ఈతఁడు వెనుక మనకేమిమేలు చేసినాడు? అది మఱచుట కృతఘ్నతయగును. రాజునెడల మనముచేయు దోషమట్టిదా ! నిజమైన కృతఘ్నత అది.

కాత్యా—అదియా మీ యభిప్రాయము ? దేవరాజును రక్షించినయెడల మీకుఁ గృతఘ్నతాదోషము లేనేలేదని నేను నిరాఘాటముగాఁ జెప్పఁగలను.

చంద్ర—ఆఁ ! లేకపోవుట గూడనా ?

కాత్యా—లేదు. మీరు పురోహితులుకాని సేనాధిపతులుకారు. మీపని గంటముతో కాని కత్తితోఁగాదు. మీకుఁబంచాంగ సంబంధముకాని శతాంగసంబంధము లేదు. మీది యాగమంత్రముకాని యాహవతంత్రముకాదు. మీవృత్తి పవిత్రముకాని యపవిత్రముకాదు. మీరు రాజునకు నంతశ్శత్రుఖండన మొనర్పఁదగువారుకాని బాహ్య శత్రుఖండన మొనర్చువారుకారు. రాజేంద్రునకు మీరు మోక్షలక్ష్మిని గూర్చువారు కాని; విజయలక్ష్మిని గూర్చువారుకారు. అట్టిచో మీరెక్కడ, యుద్ధవీరులెక్కడ? మీపనియేది ? వారిపనియేది ? వక్రించిన గ్రహములకు శాంతిఁజేయుట మీపనికాని పారిపోయిన శత్రువును జంపించుట మీ పనియా? మీరు చేయఁగూడనిపనిని చేయకుం డిన యెడల మీకు దోషమేమున్నది? మీకుఁ గృతఘ్నత యెక్కడిది? సేనాధిపతి చేయ

వలసిన పనిని జేయలేకపోతినని మీకు విచారమెందులకు! మీపని సేనాధిపతియెప్పుడైనఁ జేయయత్నించునా! గడచిన సంవత్సరమున వర్షక్షామము కలిగినప్పుడు సహస్రఘటాభిషేకము మహాదేవమూర్తికిఁ జేయకపోవుటచే నేను రాజుగారియెడలను గృతఘ్నుడనైతినని సేనాధిపతి క్షోభించినట్లు మీరు వినియుంటిరా? ఎవరివిధివారిది; మీరు సద్బ్రాహ్మణులు—బ్రహ్మనిష్ఠాపరులు—సత్యమూర్తులు—అతిథిసంతర్పణము మీకువిధి. ఆయతిథి మహారాజునకు విరోధియైన సరే, మనకు విరోధియైనసరే, లోకమునకు విరోధియైనసరే వైదికకృత్యమునకు వైరమునకు నేమిసంబంధము?

చంద్ర—నీధోరణి శబ్దాలంకారప్రధానయగు కవితవలె చెవికిమాత్రమే నచ్చుచున్నదికాని చిత్తమునకు నచ్చుటలేదు. దర్భలుబట్టు పురోహితులైనను రాజభటులే; ఖడ్గములనుబట్టు యోధులైనను రాజభటులే. భటత్వ మందఱకు సామాన్యమే! అందఱును రాజునెడలఁ గృతజ్ఞతఁ జూపవలసినవారే! ఔను! కాదామరి — రొట్టెపెట్టినవానిని ఱొకటఁ బొడువవచ్చునా! కాని, ఈసంగతియు నాలోచనీయమే. మనము బ్రాహ్మణులము—అతిథిసంతర్పణము ముఖ్యముకాదని నేనుచెప్పను. అందులో పాపము—మహారాజు—మనల నమ్మివచ్చినవాఁడు—మహాపదలో మున్గియున్నవాఁడు—సగముప్రాణముతో చేతవ్రాలిన చిలుకను బిల్లివాతఁ బెట్టుట తప్పని యెఱుఁగనా! హరహరా! రాజున కీతఁడు శత్రువేల యయ్యెను? శత్రువే కాకుండినయెడలఁ దలపైఁబెట్టుకొందుమే! కన్నుల కద్దుకొందుమే! అయ్యయ్యో! శత్రువైపోయినాఁడు ఎంతసంధిఁ దెచ్చిపెట్టితివే నీవు—హు—నీవు—హు—నీవు—హు—

కాత్యా— (చేతులు జోడించుకొని) ప్రాణప్రియా! నావలన నేమి నేరము కలిగెను? క్షమింపుఁడు దాసురాలను.

చంద్ర—నీ వలన నేరము కలుగలేదు. నావలననే నేరము కలుగనైయున్నది. నిన్ను నేను క్షమించుట కాదు. అందులకు భగవంతుఁడు నన్ను క్షమింపవలెను.

కాత్యా—మీవంటి సద్బ్రాహ్మణునకు నేరమేమి మహాత్మా!

చంద్ర—నే నీ యతిథిని వదలకొంటిని. ఆతని నిప్పుడే పొమ్మని చెప్పుము.

కాత్యా—అభ్యంతరమేమి! కాని, ఒక్క యతిథిని వదలుకొనుటతోడనే మన బ్రదుకు కడతేరునా! మీకిఁక బ్రాహ్మణత్వ మక్కఱలేదుకావున దానిని వదలుకొనవలెను. ఇఁక యజ్ఞోపవీతముతోఁబనిలేదు కావున దానిని వదలుకొనవలెను. దయాధర్మశౌచములను వదలుకొనవలెను.

చంద్ర—ఆఁ! ఆఁ! ఏమనుచున్నావు?

కాత్యా—ఉత్తమగతులన్నియు నీవు వదలుకొనఁదగినవే కావా!

చంద్ర—వదలుకొని నేను నరకమునకుఁ బోయినప్పుడు "నీవు నీరాజు నెడల కృతఘ్నత నేల చూపితి"వని యమధర్మరాజు నన్నడుగ ననురాగవతియైన భార్య చెప్పిన మాట దాఁటలేక నేను రాజద్రోహ మొనర్చితినని చెప్పవలసినదా మఱి?

కాత్యా—ప్రాణప్రియా! మాటకుమాట యంటినని నన్ను నిందింపకుఁడు. "నీవు నీయతిథిని రక్షింతువని మంగళసూత్రముతోఁ బ్రమాణము చేసితివే! ఏల రక్షింప

లేకపోయితి౹౹వని యాధర్మరాజే నన్నడుగ నాభర్త నాసత్యమును గాపాడలేకపోయి నాఁడని చెప్పవలసినదేనా?

చంద్ర—పోనీ! ముందెప్పుడో చెప్పవలసినమాట లిప్పుడేల! ఇప్పుడు చెప్పవలసిన మాటలు కొన్ని యున్నవి కాన దేవరాజు నిటపరమ్మని చెప్పుము.

(కాత్యాయని నిష్క్రమించి దేవరాజుతోఁ బ్రవేశించును)

(దేవరాజు బ్రాహ్మణవేషమున నుండును.)

కాత్యా—వత్సా! దేవరాజా! మీనాయనగారికి నమస్కరింపుము.

చంద్ర—నాకు నమస్కారము వలదు. నమస్కరించినయెడల నే నాశీర్వదింపవలసివచ్చును. మారాజునకుఁ బ్రబలశత్రుఁడవైన నీవు విజయోస్తు ! అని నే నాశీర్వదింతునా? వలదు. చేతులు జోడింపవలదు.

దేవ—బ్రాహ్మణులకు నమస్కరించుట మాకాచారము కావున నేను నమస్కరింపవలయును గాని మీ యాశీర్వాదప్రతిఫలమును గోరికాదు. గురుమహాత్మా ! నమస్కారము. నానుదిటిగీఁత యెట్లున్న నట్లగును. మీయాశీర్వాదమును నే నపేక్షింపను.

చంద్ర—అహా ! ఏమి ! వినయములో గర్వము. గర్వములో వినయము. వైరాగ్యములో వాంఛ. వాంఛలో వైరాగ్యము కాని క్షత్రియత్వములోన బ్రాహ్మణత్వము కూడ నేమి ?

దేవ—ఇది మాయమ్మగారు ప్రసాదించిన స్వరూపము.

కాత్యా—ఎందులకైన మంచిదని కొండెసిగయూడ్చి జారుసిగఁ బెట్టించితిని. మెడలోని బంగారు మెఱుఁగుఁ బూసల కంఠమాల తీయించి రుద్రాక్షల పేరు వైచితిని. దారపు యజ్ఞోపవీతమునకుఁ దోడుగ మీరు తర్పణకాలమందు ధరించు పట్టు యజ్ఞోపవీతమువంటి యొక శ్రోత్రదానిని వైచితిని. క్షత్రియ సంబంధమగు వెనుకబిగి నడికట్టు తీయించి యంగవస్త్రముకట్టిప్పించితిని. ఫాలమున రక్తచందనమును గడిగించి విభూతిని ధరింపఁజేసితిని. మీయుంగరముగూడ—

చంద్ర—కాత్యాయనీ! క్షత్రియునకు బ్రాహ్మణత్వమిప్పించితివా ? సెబాస్! వసిష్ఠునికంటెఁ బ్రబలతరవ్యక్తివివలె నున్నావు. మహాఘోరతప మనేకశతహాయనములు గాధినందనుఁడొనర్చినగాని వసిష్ఠుఁడాతని కిప్పింపఁజాలని యసాధారణ బ్రాహ్మణ్యము నీతని కవలీలగా నిప్పించినావు !

చంద్ర—పట్టుజన్నిదపు పెురఁగుతో, జారుజుట్టు మెఱుఁగుతో, బిళ్ళకచ్చ బెడఁగుతో, బ్రాహ్మణత్వము శుద్ధక్షాత్రము మీది కవతరింపఁ జేసితివి.

దేవ—మహాత్మా ! అధిక్షేపణమేల ? బ్రాహ్మణస్వరూపమే యవతరించినది కాని బ్రాహ్మణత్వ మవతరింపలేదు. అవతరింపదు. క్షత్రియునకు బ్రాహ్మణత్వ మంత శీఘ్రముగా సిద్ధింపదని నే నెఱుఁగుదును. అంతయేల ? జన్మ బ్రాహ్మణులకే తఱచుగా బ్రాహ్మణత్వసిద్ధి లేదుకదా? ఇఁక మాలెక్కయేల? బ్రాహ్మణస్వరూపమునకు బ్రాహ్మణత్వమునకు మాయమున్తైమునకు మంచిముత్తైమునకున్న యంతరముకంటె నెక్కువ యంతర మున్నదని యెఱుఁగుదును.

గీ. హృదిని సాత్త్వికగుణ మధి ♦ ష్ఠింపకున్న
బొట్టుపై వెల్లనగు నూలు ♦ పోగు లేల!
మడ్రిపులగొంతు నురిఁబెట్ట ♦ జాలకున్న
సఖుత బిరుసైన రుద్రాక్ష ♦ సరము లేల
బూదికంటెను నే నధ ♦ ముఁడ నటంచు,
బుద్ధిలేకున్న నుదుటఁ ద్రి ♦ పుండ్ర మేల
తోయ్యలుల పైకిఁ జిత్తంబు ♦ దుముకునపుడు
పృష్ఠమున బిళ్ళకచ్చ ♦ బిగింపు లేల!
ద్వేషరాగసంయుక్తుఁడు ♦ ద్విజుఁడు కాఁడు,
వానిఁజంపినయాతఁడే ♦ బ్రాహ్మణుండు
ప్రాణిహింసావిలోలుఁ డ ♦ బ్రాహ్మణుండు
పరులు తానని కొను వాఁడె ♦ బ్రాహ్మణుండు.

చంద్ర—(తనలో) ఆహా! హృదయశూలములగు మాటల నాఁడినాఁడే? 'ద్వేషరాగసంయుక్తుఁడు ద్విజుఁడు కాఁడు' నేను ద్వేషరాగ సంయుక్తుడను. 'ప్రాణిహింసావిలోలుఁ డబ్రాహ్మణుండు' నేను ప్రాణిహింసావిలోలుఁడను. మీఁదుమిక్కిలి అతిథిప్రాణిహింసావిలోలుఁడను. 'పరులు తాననుకొనువాఁడే బ్రాహ్మణుండు' పరాహాం విభేదన మొనర్చినవాఁడను నేను.(ప్రకాశముగ) కాని దేవరాజా! నీకీమ మాట లెవరుచెప్పిరి.

కాత్యా—నాయనా! ఇప్పుడుమాత్రమె నీవు పెద్దవాఁడవా!

దేవ—అమ్మా! పెద్దవాఁడనే. చిన్నవాడనై యుండగ మాగురువుగారు బోధించిరి.

గీ. తల్లియనఁటిచుట్టుఁ ద ♦ రుణత వర్ధిల్లు
పెద్దచెట్టులెనఁ ♦ బిల్లలగును
దల్లిచెట్టు కాలధర్మ ♦ మొందిన వెనకఁ
బిల్లచెట్టులెనఁ ♦ బెద్దచెట్టు
తండ్రి జీవించియున్నంత ♦ నను కఁ దెల్లఁ
బడిన మీసాలసుతుఁడైన ♦ బాలకుండు
తప్పటడుగులు వేసెడు ♦ తనయునైనఁ
బెద్దవానిగఁ జేయును ♦ బితగతించి.

చంద్ర—నిజమే కాని దేవరాజా! మాకుఁ దప్పుమాట రావలసిన దుర్యోగ

ముండి నీతప్పటడుగు మాయింటిలోఁ బడినది. మా కింక నిక్కడి రాజుచేనైన శిక్ష తప్పదు; అక్కడి రాజుచేనైనఁ దప్పదు. కాని మాదుర్గతికై నీవు విచారింపఁగూడదు. నీవు మాకు శత్రుఁడవు. నీతండ్రి మృతికై నేనావంతయైనఁ జింతనొందఁ దగదు. అది నాకు రాజకృతఘ్నతయగును. దేవరాజా! మా కెట్టి సంధిఁ దెచ్చితివి? ఈగ్రామమున నెన్నియిండ్లు లేవు. మాయిల్లే నీకుఁ గనఁబడెనా? బ్రాహ్మణులము. పురోహితులము. రాజ విశ్వాసపాత్రులము. ఇప్పటివఱకు సత్యవంతులము. ఒకనికంట బడకుండ నొకనినోటఁ బడకుండ జీవయాత్రఁ జేయుచున్నాము. నీమూలమున వినయవతియైన యిల్లాలితోఁ గలహించితినే? ఇఁక మాయిల్లు వృద్ధినొందునా? ఏమి దేవరాజా! నీవు—

దేవ—మహాత్మా! నావలన మీకుఁ గష్ట మక్కఱలేదు. మాయమ్మగా రాదరించుటచే నింతవఱ కుంటిని. నే నిప్పుడే పోయెదను.

చంద్ర— నీవు బుద్ధిపూర్వకముగ మా కీ యపకృతిఁ జేసితివని నే నంటినా! నావలన మీకుఁ గష్ట మక్కఱలేదంటివి. వచ్చినకష్ట మేదో రానేవచ్చినది. దీనిని నీవు నివారింపఁ గలవా! బ్రహ్మదేవుఁడు నివారింపఁ గలఁడా!

దేవ—స్వామీ! మీకు వచ్చిన తొందఱ యిప్పటి కేదియులేదు. నన్ను క్షమింపుఁడు నేను మీకు శ్రమమిచ్చితిని. అమ్మా పోవుదును. మీరునన్ను బుత్రునికంటె నెక్కువగాఁ గాపాడినారు.

చంద్ర— ఆమె పుత్రునివలె నిన్నుఁ గాపాడినదా? శత్రువువలె నేను వెడలఁ గొట్టుదునని నీయభిప్రాయమా! నేను వెడలఁగొట్టఁదగినవాఁడనే యని నీవనుకొంటివా? కాకులకు బల్యన్నమిచ్చినవాఁడను-కుక్కలకు బలిపెట్టినవాఁడను-మహారాజ పుత్రుఁడవైన నీకాతిథ్య మీయకుందునా! నీవు మారాజునకు శత్రుఁడవే? నీ ప్రాణములు దీసికొనుట కాతఁడు సిద్ధపడియుండ నేను నిన్నుఁ గాపాడవలసినదా? అది కృతఘ్నత కాదా? నేనే సేవకుఁడనై నీవే నారాజవైన యెడల నీవు నన్నుఁ గూర్చి యెట్లనుకొందువు? సేవకవృత్తి రాజక్షేమముకొఱకే కదా? పరరాజుల నింటఁ బెట్టుకొన్న పురోహితులకు—

దేవ—మీరు నన్నింటఁ బెట్టుకొనవలదు, ఇదివఱకుఁ జేసిన యాదరణమునకే నేను గృతజ్ఞుఁడనై యున్నాను. స్వామీ! దయయుంచుఁడు. అమ్మా! సెలవు.

చంద్ర—ఉండు దేవరాజా! ఉండు. వెళ్ళవలదని నేను జెప్పువాఁడనుగాను. ముఖ్యముగా వెళ్ళవచ్చును. కాని నీవు వీథిలోనికి బోవగనే యెవ్వరైన రాజభటులు నిరాయుధుఁడవైన నిన్నుఁ బట్టి వధించినయెడల నట్టిపాపము నాదైయుండదా? బ్రతుకు యోగమున్నవారు బ్రతుకుదురు; చావనున్నవారు చత్తురు. అందులకు విచారించువాఁడనుగానుసుమా! అందులో నీకొఱకు నేనుబొత్తిగావిచారింపఁదగదు. కాని నీవధమువలన నాకుఁ బాపమేలరావలయును! నీవు వీథిలోనికిఁ బోవుటచేతనే గదా వారు నిన్నుఁ జంపుదురు? నీ కర్ఘ్యపాద్యము లీయవలసిన నేను—హు. అతిథివైన నీరక్తముతో హర హరా!

దేవ—ఈ బ్రాహ్మణ వేషమున నన్నెవ్వ రానవాలు పట్టలేరు. అదిగాక

నాయొద్ద భటుని యున్నది. నా కెంతమాత్రమును భయములేదు. సెలవిండు.

కాత్యా—ప్రాణనాథా! మనగతి యెట్లున్న నట్లగును. ఉండుమని బిడ్డతోఁ జెప్పుఁడు.

చంద్ర—ఆఁ! ఆఁ! ఎంతమాట? ఉండుమని చెప్పనా! ఆతనికి నేను దోడుపడి మాయచే మనరాజును వధింపుమని బోధింపనా! ఆతని సింహాసనముపై నీతని గూర్చుండఁ బెట్టింపనా! ఇఁక ముందీతనికిఁ బౌరోహిత్యముగూడ నారంభింపనా?

దేవ—మహాత్మా! భవిష్యత్తున నేది యెట్లగునో యెవ్వరికిని దెలియదు. కాని యిప్పటికి క్షమించి నాకు సెలవీయవలయును. నేను బోవుచున్నాను.

చంద్ర—దేవరాజా! ఆగుము. పొమ్మనకుండ నే పోవుట తగునా?

దేవ—ఉండుమని చెప్పకపోవుట పొమ్మనుటవంటిది కాదా? స్వామీ! అది గాక పొమ్మని కంఠోక్తిగాఁ గఠినోక్తిగాఁ జెప్పవలయుండవలసినపని యేమున్నది?

చంద్ర—అతిథివి కాదా! వచ్చువఱకే నీయిష్టము కాని, పోవుట నీయిష్టమను కొంటివా? అదిగాక కంఠోక్తిగాఁ గఠినోక్తిగాఁ జెప్పవలయుండవలసినపని యేమున్నదం టివి. నీస్థితినిఁబట్టి నాస్థితినిఁబట్టి యట్లు కంఠోక్తిగాఁ జెప్పవలసినపని యున్నదందువా లేదా! నీవే పురోహితుఁడనుకో—నేనే దేవరాజును. అట్లునీవందువా లేదా? ఆలోచించు కొని చెప్పుము. అట్లూరక చూచుట కాదు. తీరికగా నాలోచించుకొనుము.

దేవ—మహాత్మా! పొమ్మని చెప్పవలసినదే. తప్పకుండఁ బొమ్మని చెప్పవలసినదే! కావున నేను బోవుచున్నాను. అమ్మా! దయయుంచుము (పోఁ బోవును.)

చంద్ర—(అడ్డువచ్చి) అర్ధరాత్ర మింటికి వచ్చిన యతిథిని—ప్రాణము లఱ చేతిలోఁ బెట్టికొని పారిపోయివచ్చిన యతిథిని—ఆదరింతునని యాసపెట్టి యింత సేపు నాభార్య పుత్రవాత్సల్యముతో నాదరించిన యతిథిని—బట్టపగలు దాహాతీర్థమైన నీయ కుండ నడివీధిని శత్రుమధ్యమునఁబడునట్లు మెడబట్టి గెంటిన రౌరవాదినరకములు నామె డకుఁ జుట్టఁబెట్టి నీవు తటాలున బరుగెత్తెదవా! నామాటయేమియో చెప్పి మఱిపొమ్ము. నీవు మాయింటఁ బ్రవేశించినందులకు మాకుత్తరగతు లూడుటయే ఫలమా?

దేవ—దోష మేమున్న నదియంతయు నాది. మీరు నన్నుఁ బొమ్మనలేదు. అర్థి నిరాకరణదోషము మీ కేదియులేదు. నాయంతట నేనుఁ బోవుచున్నాను. తెలిసినదా స్వామీ!

చంద్ర—నాకు నచ్చలేదు, లేదు. నీయంతటనీవుపోవువాఁడ విదివఱకే పోలేక పోతివా; ఇంత సేపేలయుంటివి? ఇన్ని వేసములేల వేసితివి? నన్నుఁ జూచుటకేల వచ్చి తివి? నాదర్శన మేమి చంద్రశేఖరదర్శనమా?

(నేపథ్యమున) చంద్రశేఖరస్వామీ! చంద్రశేఖరస్వామీ!

కాత్యా—ఎవరువారు?

(నేపథ్యమున) సేనాధిపతి భటులతో దర్శనార్థమై వచ్చి యున్నాఁడు.

కాత్యా—సరే! తలుపుఁదీసెద నుండుఁడు.

చంద్ర—నాయనా! దేవరాజా! నిన్నుఁజంపుటకై వచ్చియున్నారు. జడుపకుము,

నా ప్రాణములు నీకిచ్చెదను. నేనింతటితో రాజద్రోహిని. రాజద్రోహిని. ఇఁక నెన్ని యసత్యము లాడవలయునో, యెన్ని పాపములు చేయవలసియుండునో; యీ రహస్యము మాత్రము దాగదు. రాజు నన్ను సాధించును. ఈయిల్లు దగులఁబెట్టించును. రాజుచేతిలో నాకుఁ జావు నిశ్చయము. పరాభవమునకు లక్ష్యపెట్టక, ప్రాణాపాయమునకు జంకక పాపమునకు వెనుదీయక, నిన్నుఁ జేపట్టితిని. నీకభయమిచ్చితిని. నీవు శత్రుఁడవే యగుదువు. కాని యభ్యాగతుఁడవైతివి. శరణార్థివైతివి. నాభార్యశపథమును నేను జెల్లింపక తప్పదు. రాజవైన నీవలనఁ బ్రతిఫల మేమైన నపేక్షించి నేనిట్లుచేసితిననుకొంటివేమో? నాకట్టియాసలేదు. నేను రసవాదసిద్ధుఁడను. నాకు సమృద్ధిగ బంగారమున్నది. నీ విక్కడ నుండి పోయినపిదప రాజు మిమ్మేమిచేసిననుసరే; ఏమో చెప్పబోవుచున్నావు. ఏమియు బ్రతివాక్యమాడకు. అడకుము—ఇఁక నేను దలుపుఁ దీసెదను. (తెరవంకఁజూచి) కాత్యాయనీ! ఎందుకైన మంచిది. నీవు దేవరాజును వెంటఁబెట్టుకొని లోనికిఁ బొమ్ము ఊఁ. కాదు. నేనే లోనికిఁబోవుదును. మీరే యిచ్చట నుండుఁడు. చూడు కాత్యాయనీ ఇటురా (చెవిలో నేదియో చెప్పుట నభినయించును)

కాత్యా—చిత్తము.

చంద్ర—దేవరాజా! నీ పూరకే చూచుచుండవలయును గాని యేమియు మాట లాడఁగూడదు సుమా.

దేవ—చిత్తము.

చంద్ర—(నిష్క్రమించును.)

కాత్యా—(తలుపుతీయుట నభినయించి) శ్రీకంఠదాసా లోనికి రమ్ము.

(శ్రీకంఠదాసుఁడు ప్రవేశించును.)

శ్రీకం—భటులారా! మీరు గుమ్మములోనే యుండుఁడు. అమ్మా! స్వామిగారేమి చేయుచున్నారు?

కాత్యా— మాధ్యాహ్నికకృత్యములు నిర్వహించుకొనుచుఁ బూజాశాలలో నున్నారు.

శ్రీకం—అప్పుడే రెండుయామములు దాఁటినదికదా! అవి యెప్పటికిఁ బూర్తి యగును?

కాత్యా—ఇప్పుడే పూర్తియగును.

శ్రీకం—ప్రతిదిన మీసరికి భోజన మొనర్చుచుండెడువారు కాఁబోలును. ఈదిన మింత యాలస్య మేలచేసితిరి?

కాత్యా—నాయనా బుద్ధిహీనులకార్యారంభములవలె బ్రాహ్మణుల భోజనము లెప్పుడు వేళదాఁటిన తరువాతనే కదా! అందులోఁ బురోహితునింటి భోజనముల జెప్పనేల? అందుపై నీదినమున నీచిన్నవాని తండ్రి మృతతిథికూడను.

శ్రీకం—అటులైన స్వామిగారింతటఁ బైకి రారుకాఁబోలు. ఆచిన్నవాఁ డెవరమ్మా.

కాత్యా—ఆతఁడు మాపినతండ్రిగారిపుత్రుఁడు. పనియున్నయెడల స్వామిగారు

పైకిరావలెందురా? వచ్చి తిరుగ స్నానముచేసి యర్చన నారంభింతును. లోనికిఁ బోయి యాయన నిటకు రమ్మని చెప్పనా?

శ్రీకం—అమ్మా! అటులే కానిండు. (కాత్యాయని నిష్క్రమించును)

శ్రీకం—(తనలో) ఆహా! ఏమిది? ఏమిది? ఇదేరంగు. ఇదే పొడుగు. దాదాపుగా నిదేలావు. ఏమి యీతఁడతఁడే యైయుండునా?

గీ. దీర్ఘనేత్రాంతముల క్షాత్ర ♦ తేజమేమి!
ఫాలభాగంబున విభూతి ♦ పట్టియేమి!
వడితిరుగుకండపలకల ♦ వక్షమేమి!
సవ్యభుజపీఠమునఁ బట్టు ♦ జందెమేమి!
సింహశాబకసమమధ్య ♦ సీమయేమి!
తలకు నడుమను వ్రేల్ముడి ♦ పిలకయేమి?
ప్రకటమోకాళ్ళ నంటెడు ♦ బాహులేమి!
దర్భముడి యునామికమున ♦ దనరుటేమి!
(ఉంగరమున బాగుగా నిదానించుచున్నాఁడు.)
గోముఖములోపల ఫిరంగి ♦ గుండుపడియె!
వ్యాఘ్రపోతము హరుని దే ♦ వళముదూరె!
బాపురే బాపనయ్యల ♦ బావయేడ!
క్షాత్రనిక్షేపరూక్షవి ♦ గ్రహము నేడ!
అయినను దొందరపడక నిదానింపవలసియున్నది.

దేవ—(తనలో) ఆహా! ఎంతమంచిసమయము సిద్ధించినది! సేనాధిపతి యొక్కఁడు మా యెదుటఁ బడినాఁడు. ఇప్పు డీతనిని నవలీలగఁ జంపక యూరకుండఁ దగునా? తగదు. చంపవలసినదే! కాని తండ్రిగారు తొందరపడక తగిన సమయముకై వేచియుండి శత్రుమారణము చేయుమని సెలవిచ్చిరికాదా! ఇప్పుడు నేను దొందరపడి యీ సేనాపతిని జంపినంతమాత్రమున వినియోగమేమున్నది? గుమ్మములోని భటులే వచ్చి నన్ను జంపుదురు.

గీ. ఇతని హృద్రక్తతర్పణ ♦ మిచ్చినపుడె
సుతుఁడవీవని నాయాత్మ ♦ కుతుకమందు.

అని తండ్రిగారు సెలవిచ్చినారు కాదా! ఆపని యెట్లు జరుగఁగలదు! అదిగాక రాజశిక్షకైన జంకక యసత్యపాపమును గడింపక నన్నుఁ గాపాడిన యీబ్రాహ్మణ దంపతుల కుపద్రవము నా మూలమున గలుగును. మాటలాడనని కూడఁ జంద్రశేఖర స్వామితోనంటిని. మాటలాడకుండ శత్రుమారణ మొనర్పవచ్చునుగాని యందువలన ననేకబాధలున్నవి. కావున దొందర యెంతమాత్రముకూడదని తోఁచుచున్నది.

గీ. బ్రాహ్మణోత్తము గృహముల ♦ బట్టఁజేరు
భూమివరునకు క్షాత్రవి ♦ స్ఫూర్తితగ్గు
నందుపై బ్రాహ్మణుని వేష ♦ మవధరించు
క్షత్రవరునకు వేఱేది ♦ శాంతికంటె.

శ్రీకం—(తనలో) చంద్రశేఖరస్వామి సుగుణసంపన్నుఁడు. రాజవిశ్వాసఖని. ఇతఁడు దేవరాజేయైనయెడల నాతఁడీతనిని జేరనిచ్చియుండునా? ఎంతమాట! నాయూహము తప్పు. ఒకనిని బోలినవాఁడు వేఱొక్కఁడుండుట యింత విపులసృష్టిలో నాశ్చర్యమేమి? బ్రహ్మక్షాత్రతేజోవిభేదమును గూర్చి కూడ యంత చింత యక్కఱ లేదనుకొందును.

గీ. ఆస్యశాతత్వధాళధ ♦ ళ్యప్రశస్తి
బ్రాహ్మణులకంటె రోహిలాల్ ♦ ప్రబలతరులు
క్షత్రవీరులకంటె నాఫ్ ♦ ఘనులు ఘనులు
వేఁడి చలువల బెడఁగుకై ♦ చూడనేల?
మనస్సులో నింద్రధను స్సున్న ♦ మానవునకు
నొడలి వర్ణంబు నల్లగా ♦ నున్ననేమి?
మదిని మసిబొగ్గు గనియున్న ♦ మానవునకు
ఫాలమున భానుఁడుదయింప ♦ ఫలముగలదె?

(చంద్రశేఖరస్వామి ప్రవేశించును.)

శ్రీకం—(ప్రకాశముగా) స్వామిగారూ! నమస్కారము.

చంద్ర—శ్రీకంఠదాసా! విజయోస్తు! ఆలస్యమైనందులకు క్షమింపవలెను. కాని నాతో నీకిప్పుడు కలిగిన తొందరపని యేదియో చెప్పెదవుగాక.

శ్రీకం—మీ యొక్కరితోడనే కాదు. గ్రామమందలి యందఱ గృహస్థులతోఁ బనియుండియే తిరుగుచున్నాను.

చంద్ర—అదేమి ?

శ్రీకం—రాత్రి జరిగిన కళ్యాణపు గొంతుకోఁత యంతయు మీకుఁ దెలిసిన యంశమే. పెండ్లికొడు కెచ్చటికో పాఱిపోయినాఁడు. అతఁడు దూరమునకుఁ బాఱిపోవుట కింక నవకాశము లేదనియు, గ్రామములో నెవరియింటిలోనైన దాఁగియుండెనేమో, ప్రతి గృహమును స్వయముగాఁ జూడుమనియును నాకు మహారాజుగా రాజ్ఞాపించిరి. అందుచే నిట్టుషఃకాలమునుండియుఁ దిరుగుచున్నాను. రాజాజ్ఞ ననుసరించి మీ యింటికిఁగూడ వచ్చితిని.

చంద్ర—(నవ్వుచు) తుదకు మాయిల్లుకూడ చూడక తప్పినది కాదా?

శ్రీకం—తప్పినదికాదు. తుదకే-తుట్టతుదకే-ఇచ్చటకు మర్యాద ననుసరించి

వచితిని. ఇది సందేహాస్పదమైన గృహము కాకుండుటచే మొగముఁజూపి పోవలయునని వచ్చితిని గాని, సందేహము మీయింటిలోనే కలిగినది. క్షమింపవలయును.

చంద్ర—క్షమించుటకు నిచ్చట వసుమతీపతి, యచ్చటఁ బార్వతీపతి తప్ప మఱియెవ్వరు సమర్థులు? శ్రీకంఠదాసా! మేము రాజాజ్ఞకు విధేయులము. నీయిష్టమూ వచ్చినట్లు గృహమంతయు శోధించుకొనుము. రమ్ము. లోనికిరమ్ము. గదులు, వసారలు దొడ్డియంతయుఁ జూచి వత్తము రమ్ము.

శ్రీకం—లోనికేల? లోనికేల?

చంద్ర—నీకు సందేహ మక్కఱలేదు. మేము నీతోనుండఁగ శోధించుట కిష్టము లేకున్నయెడల వెలుపలికిఁ బోదుము. బావా! శంకరశాస్త్రి! మీయక్కను రమ్మని చెప్పుము. మనము వెలుపల నిలుతము.

శ్రీకం—ఆమె రా నేల? మీరు వెలుపలకుఁ బోనక్కఱలేదు. అయ్యా! ఈయనను గూర్చియే నాకు సందేహముగా నున్నది.

చంద్ర—ఇతనిఁ గూర్చి సందేహమేమి?

శ్రీకం—ఇతఁడు దేవరాజేమో యని సంశయ పడుచున్నాను.

చంద్ర—సెబాస్. బావా! అదృష్టవంతుఁడవు! భటులు లేరు. రాజ్యములేదు. పైసయైనఁ జేతలేదు. అట్టి నీవు మహారాజసుతుఁడగు దేవరాజవైతివి. గొప్పవారనియని పించుకొనఁదలఁచి యెందఱో తలఁగొట్టుకొని యేడ్చుచుందురు. అట్టిబాధ యేదియు లేకుండ యెంతపేరు నెత్తిఁ గట్టికొంటివి? మహాభాగ్యవంతుఁడవు. మా మహారాజుగారి చేతిలో నుత్తరక్షణమున నీ కుత్తరలోకము సిద్ధించును. నడు. శ్రీకంఠదాసా! వీనినిఁ గొనిపొమ్ము. మాకు బావలకు లోపములేదు. ఇంక నాల్గురున్నారు. ఒక్కఁడు విడుదల యైన నగుటయే.

శ్రీకం—స్వామీ! నేను బరిహాసోక్తిగాఁ బలికితి ననుకొనుచున్నారు కాఁబోలు. ఈతఁడు దేవరాజని నాకు సందేహముగా నున్నది. అట్టి సంశయములను మీరు నివృత్తి చేసినఁ గాని యీతనిని మహారాజున కగపఱచి యీతని శిరమును ఖండింపవలసివచ్చును.

చంద్ర—ఏమి శ్రీకంఠదాసా! అట్లు మాటలాడుచున్నావు? నా యోగ్యతను గూర్చి సంశయము నేఁటికి సంభవించినదా? నా కృతజ్ఞతను గూర్చి సందేహము నేఁటి కంకురించినదా? సంశయవిచ్ఛిత్తి యిప్పుడు నీయెదుటఁ గావలయునా? కాని యెడల మాబావను జంపి బ్రహ్మహత్యను గట్టుకొనఁ దలఁచితివా! తండ్రి శ్రాద్ధమునకై మా యిల్లు చేరిన యుత్తమాతిథిని జంపుట యెందులకు! నేను లేనా! నన్నే చంపి నా శిరమును దీసికొనరాదా? చిరకాల సేవాఫల లాభము నాకు నీకుఁగూడ గలుగును.

శ్రీకం—స్వామిగారు! శాంతినొందుఁడు! మీ కృతజ్ఞతను గూర్చి సందేహము లేదు. ఇతని రూపమును గూర్చియే సందేహమున్నది.

చంద్ర—శ్రీకంఠదాసా! అంతవింతగ మాటలాడుచున్నావు. నేను ద్రోహిగఁ బోదునని నీకు నమ్మకము లేదుగాని నాచేతిలోనిది కల్లుకుండయేమో యని సందేహమా!

శ్రీకం—స్వామీ! నా కిన్ని తెలియవు. పుణ్యమో పాపమో కాని యీతనిపై

నాకు సందేహము కలిగినది. ఈతఁడు మీ బావకాఁడేమో యని నాసందేహము. బావ యని ఋజువు పఱచుకొనుఁడు. నే నావలికిఁ బోవుదును.

చంద్ర—ఇతఁడు నాబావ కాఁడని మొదట నీకు సందేహమేల కలుగవలెను? నీ యిష్టానుసారము నీకు సందేహములు కలుగుటా! అవి తీర్చుటకు మాకు గృహశోధయు, బంధుబాధయు నా! బాగుగానే యున్నది.

శ్రీకం—అయ్యా! రాజాజ్ఞపై నడుగుచున్నాను.

చంద్ర—రాజుగారు నిన్నడుగుమనినారు కాని, యసందర్భముగా నీవు పొందిన సందేహములను మమ్ము దీర్చుమనినారా! తీర్పకున్న యెడలఁ బురోహితబ్రాహ్మణుని బావతోఁగూడ శిరచ్ఛేదమును జేయుమనినారా! బ్రాహ్మణుఁడు కానివాఁడు, నా శాఖవాఁడు కానివాఁడు నాకు బంధువుఁడు కానివాఁడు నాయింటి కేలవచ్చును? ఆతఁడు బావయని నేను జెప్పుచున్నాను. నీవు నమ్మవలసినదే గాని సందేహింపవలసిన పని లేదే! ఈతఁడు బావయని నేను ధృవపఱచుకొన నక్కఱలేదు. బ్రాహ్మణత్వ మొప్పుకొనుచున్నది. బంధుత్వ మొప్పుకొనుచున్నది. ప్రస్తుత పరిస్థితి యొప్పుకొనుచున్నది. ఈతఁడు నా బావకాఁడని ఋజువుచేసికొనుభారము నీది.

శ్రీకం—అపరరాత్రమున దేవరాజు పాఱిపాయినాఁడు. ఎక్కడవెదకినను గానఁబడఁడు. ఇతఁడు దేవరాజువలె నున్నాఁడు. అందుచే నేను సందేహపడుచున్నాను.

చంద్ర—అపరరాత్రి చంద్రుఁ డస్తమించినాఁడు. ఎక్కడ వెదకినను గానఁబడఁడు. ఇతఁడు చంద్రునివలె నున్నాఁడు. కావున నితఁడు చంద్రుఁడు. ఇది సరిగా నున్నదా!

శ్రీకం—అయ్యా! మీబావ యెప్పు డిక్కడకు వచ్చినాఁడు?

చంద్ర—ఎప్పుడు వచ్చినాఁడని చెప్పిన నీకు నమ్మకము? అపరరాత్రియే—దేవరాజు పాఱిపోయినప్పుడే వచ్చినాఁడనుకొందము. దేవరాజు పోకకు మా బావ రాకకు నేమిసంబంధము? అమ్మవారి జాతరకు నాఁడుబిడ్డ సమర్తకేమి సంబంధము?

శ్రీకం—కాని దేవరాజునకు మీ బావకుఁ బోలికచే సంబంధమున్నది కాదా?

చంద్ర—ఉండఁగూడదని యెక్కడనైన శాసనమున్నదా యేమి? ఏనుఁగునకుఁ బందికి నక్కకు సింహమునకుఁ బులికి పిల్లికి నున్న దేది? పోలికయే లేనివస్తువుల నీవు ప్రపంచమందుఁ జూపఁగలవా యేమి? సృష్టిలోఁ బోలికయే సర్వసామాన్యము. భేదమే యరుదు కాదా! భగవంతుఁడు చేసిన యీపనికి మా బావను జంపఁదలఁచుకొంటివా! సేనాధిపతీ! నీ చర్యకు నర్థమేమియు నగపడుటలేదు. నీ సందేహమునుబట్టి దేవరాజును నీవు బాగుగా నెఱుఁగనట్లు కనఁబడుచున్నది. నీ కంటె నాతనిని నేనే బాగుగా నెఱుఁగుదునేమో! ఇతనికి దేవరాజు లక్షణములులేవు. ప్రభుత్వ లక్షణములే యున్న యెడల మా బావకుఁ బౌరోహిత్యపుఁ గాసెందులకు? ప్రాచీనావీతిమంత్ర మెందులకు? ఇతఁడు మా బావయని యింతకంటె నెక్కువగా నేనేమి చెప్పఁగలను? ఇదిగో అక్కగారి నడుగు.

శ్రీకం—ఆమె నడిగినాను. సోదరుఁడనియే యామె చెప్పినది.

చంద్ర — ఇఁక నేమి! అంతకంటె నామె మాత్రమాతని మొఖము మీఁద శంకర శాస్త్రి కాత్యాయని సోదరుఁడన్న పేరు కనఁబఱుపఁ గలదా? నీవు విశ్వసింపవలసినదే గాని యింతకంటె నిర్ధారణ యేమిచేయఁ గలవు?

శ్రీకం — నాకు సంతుష్టికరమైన నిర్ధారణమార్గమున్నది. అట్లు మీరాచరింతురా?

చంద్ర — కాని, శ్రీకంఠదాసా! ఏదోయొకటి నిర్ధారణ చేసికొని కాని నీవు వెళ్ళఁదలచుకొనలేదా యేమి?

శ్రీకం — ఇతఁడు దేవరాజని సందేహము నాకున్నది. ఈతనిఁ దీసికొనిపోయి రాజునెదుటఁ బెట్టఁగానే యుద్ధ సమయమున విశేష పరిశీలన మక్కఱలేకుండుటచే నీతని వధింపుమని ప్రభుఁడాజ్ఞాపించును. ఇతఁడు బ్రాహ్మణుఁడే యగునెడల బ్రాహ్మణ వధ పాపము నాకు సంభవించును. పోనీ, మీ మాటను నమ్మి యాతని నిచ్చటనే యుంచి నేను బోవుదుననుకొనుఁడు. మీయింటిలో దేవరాజు దాఁగియున్నాఁడని కర్ణా కర్ణికగ రాజు వినినయెడల నాతఁడు ముందు నాతలఁ గొట్టును. బ్రహ్మహత్య కొప్పు కొందునా! ఆత్మహత్య కొప్పుకొందునా! ఏదోయొక హత్యకొప్పుకొనుటకైన ముందు నామనస్సునకు జాలినంత నిదర్శన మేర్పడియున్నది? అందుకొఱకే నేనొకమార్గము చెప్పుదును. మీ కిష్టమైనయెడల నట్లాచరింపుడు. కాదేని నా యిష్టము వచ్చినట్లు నేనొనర్తును.

చంద్ర — నీ మార్గ మేదో చెప్పుము.

శ్రీకం — ఈతనితో మీరుకలిసి భోజనము చేసినయెడల నేను మాఱుమాటాడ కుండఁ బోవుదును.

చంద్ర — (నవ్వుచు) శ్రీకంఠదాసా! గొప్ప యాలోచన చేసినావు. దొంగ బావకొఱకు నిజమైన బ్రాహ్మణత్వము భగ్నపఱచుకొననుగదా యని నీ వూహించితివి. బాగుగనే యున్నది. కాని యింతకంటె మంచి యుపాయమును నేను జెప్పనా!

శ్రీకం — మంచిదైనయెడల సెలవిండు.

చంద్ర — నాభార్యపంక్తి నాతఁడు భుజియించును. సరియేనా!

శ్రీకం — మీరైన సరియే, నామెయైన సరియే.

చంద్ర — అదియు నిదియు నొక్కటియే కాదు. ఆమెతో భుజియించుటయే నాతో భుజించుటకంటె సర్వవిధముల నెక్కువది.

గీ. వంశదాఁటులలో మగ ♦ వారు ఘనులు
వంశమర్యాద యెన్నఁడు ♦ వదల దబల
ఇంటి పరిశుద్ధి యెల్లప్పు ♦ డింతివలన
నిలఁబడునుగాని మగవాని ♦ వలనఁగాదు
ఆఁడుదాని యాచార మా ♦ హాత్మ్యమునను

బురుషుకానికూళ్ళను వింత ♦ పోకడలును
బైటనేకాని యింటిలో ♦ పనికిరావు
కాన నిప్పటికిని జాతి ♦ ఘనతదక్కె-
కట్లుపడఁద్రెంపి చెలరేఁగి ♦ కాంతనడువ
దేశదుస్థితిసంజ్ఞగాఁ ♦ దెలియవలయు
నిట్టి దుర్దశ మనకు లే ♦ దింతవఱకు
భావిగతి యేదొ యెవ్వరు ♦ పలుకఁగలరు
ఎంతచెడినను మనస్త్రీలె ♦ యిలను గలుగు
నబలలందుత్తమోత్తమ ♦ లనుట తగును
దేశశుభగత మగవాని ♦ తెలివిబట్టి
నిలువ దబలయోగ్యతబట్టి ♦ నిలుచుగాదె.

శ్రీకం—స్వామీ! భవిష్యదంశమునుగూర్చి యిప్పు డిన్ని మాటలేల?

చంద్ర—చెవియొగ్గి వినుచున్నావు కావునఁ జెప్పితిని. ముందుమాటలు నాకు మాత్రమేల? ఇప్పటి పనియేదియో అదియేచూతము. బావా! మీ యక్క నిటకుఁ దీసికొని రమ్ము.

శ్రీకం—ఆయన లోనికిఁ బోనేల? మీరు పిలిచినయెడల నామెవత్తురు.

చంద్ర—(నవ్వుచు) సేనాని! ఇంతలో నాతఁ డెక్కడికైనఁ బాఱిపోవుననియా? కాత్యాయనీ!

(కాత్యాయని ప్రవేశించును.)

కాత్యా—స్వామీ! యేమి సెలవు?

చంద్ర—వంటయైనదికాదా?

కాత్యా—ఆఁ!

చంద్ర—సరే; నీవు నీ తమ్మునితోఁ గూడుకుండి యిప్పుడు భోజనము చేయవలయును. కాని, శ్రీకంఠదాసా! వీరు మీ యెదుట భుజించువారు కాదుగదా! మీకు నమ్మికయేలాగున?

శ్రీకం—మేము మీ పంక్తిలోఁ గూరుచుండఁ గూడదు కాని, భిన్నపంక్తిలోఁ గూరుచుండవచ్చును గాదా! అట్టిచో నిలువఁబడి చూచుటకుఁ దప్పేమి?

చంద్ర—ఇది కర్మకర్తియాచారముకాని మఱియొకటికాదు. ఈ విషయమున మాకంటె దాక్షిణాత్యబ్రాహ్మణులు కొందఱు నియమవంతులు. పోనిమ్ము! కాత్యాయనీ! నీవును నీ సోదరుఁడును గలిసి యిచ్చట భుజింతురుగాని పదార్థముల నిటఁదెమ్ము.

కాత్యా—స్వామీ! మేమేల ముందుగా భోజనము చేయవలయును? ఈ దినమున మాపినతండ్రిగారి మృతతిథికాదా!

చంద్ర—ఓహో ! మఱచితిని. పెద్దచిక్కే వచ్చినదే ! శ్రీకంఠదాసా ! ఏమి చేయుదము ?

శ్రీకం—రొట్టెయేతినవలయునన్న మాట యక్కఱలేదు. శంకరశాస్త్రి చేతితో నిచ్చిన నీరము నామె రవంత త్రాగినఁ జాలును.

చంద్ర—అభ్యంతరమేమి ? కాత్యాయనీ! నీవు లోనికిఁబోయి యుదకపాత్ర మిటు తెమ్ము.

కాత్యా—(పోవును)

చంద్ర—సేనానీ ! అనావశ్యకమగు పనిని మాచేఁ జేయించుచున్నావు కదా !

కాత్యా—(ప్రవేశించి) స్వామీ ! ఇదిగో జలకలశము.

చంద్ర—శంకరశాస్త్రి ! నీవీకలశమును బట్టుకొని మీ యక్క చేతిలోఁ గొంచెము కొంచెముగాఁ బోయుము—ఊఁ ! (దేవరాజు పోయును)

చంద్ర—కాత్యాయనీ! పుచ్చుకో. కేశవాయస్వాహా (దేవరాజు మరలపోయును.)

చంద్ర—నారాయణాస్వాహా ! (కాత్యాయని పుచ్చుకొనును.)
(దేవరాజు మరల పోయును.)

చంద్ర—మాధవాయస్వాహా ! (కాత్యాయని పుచ్చుకొనును.)

చంద్ర—శ్రీకంఠదాసా ! ఇంకసరేనా ?

శ్రీకం—స్వామీ ! సంతోషమే ! శ్రమకు మన్నింపవలెను. నమస్కారము. పోవుచున్నాను.

చంద్ర—సరే;

శ్రీకం—(నిష్క్రమించును.)

కాత్యా—అబ్బ—అబ్బ—ఇప్పటికైనది.

చంద్ర—ఆ ! అయినది. రాజుతో సంబంధము తెగుటయైనది. కృతఘ్నతా వృత్తి కారంభమైనది. అసత్యప్రలాపమున కంకురార్పణమైనది. ప్రశాంత జీవనమునకుఁ బరశురామప్రీతియైనది. కష్టాంతనాటకమునకుఁ బ్రథమాంకమైనది. ఇప్పటికెంతయైనను నీకఁగావలసిన దింతకంటె లక్షాంశము లెక్కవగనున్నది.

దేవ—అయ్యా! మందభాగ్యుడనైన నావలన మీకింత తొందర కలిగినందులకుఁ గడుఁ జింతిల్లుచున్నాను.

చంద్ర — దేవరాజా ! విచారింపకుము. నీవు మాయింటికి రావలయునని రాలేదే? నిన్ను రమ్మని మేముపిలువలేదే? అందుచే నీతప్పేమున్నది! మాతప్పేమున్నది? ఎవ్వరును విచారింపవలసిన పనిలేదు. కాని యిప్పుడీమాటలతోఁ గాలము వృథాపోనీయఁగూడదు. నీ విక్కడనుండి శీఘ్రముగా నింకఁ బోవలసియున్నది. నిన్నుఁ గాపాడుటకు నేనసత్యమాడితిని. రాజాగ్రహమునకు, రాజశిక్షకు భయపడికాదు. నీవెటులైన శీఘ్రముగాఁ బోయి ప్రాణమును గాపాడుకొనుము. నీ ప్రాణసంరక్షణమైన తరు

నాతి రాజువలన మాకుఁ బ్రాణాపాయమైనసరే; ప్రొద్దు క్రుంకవచ్చుచున్నది. మీయమ్మ పెట్టిన దేదో దయయుంచి భుజించి యామెయొద్ద సెలవుతీసుకొనిపొమ్ము. నేనింక స్నానమునకై పోవలయును. నీవు వెడలునప్పు డొక్కసారి నన్నుఁజూచి మరిపొమ్ము.

దేవ—స్వామీ! ఆమాట చెప్పవలయునా! కాని తిరుగ నెప్పు డెచ్చట మనము కలిసికొందుము?

చంద్ర—తిరుగ నేల కలిసికొనవలయును?

దేవ—మృతిలోపునఁ దిరుగ మనము కలిసికొనుట సంభవింపనే సంభవింపదా ?

చంద్ర—ఈ లోపున గలిసికొనుటలెంత ? విడిపోవుటలెంత ? గాలిలోని రేణువులకంటె మనము ఘనులముకాము. నాయనా ! నేను బోవుదును. (నిష్క్రమించును.)

దేవ—అమ్మా ! మీ కటాక్షమువలన బ్రతికితిని. అయినను బ్రతికియుండిన సంతోషములేదు. నేను దండ్రిలేనివాఁడను. మీరును నాయనగారును నాయొద్దనుండి నా సేవ నంగీకరించి—

కౌత్యా—దేవరాజా ! ఈమాటలేల ? పోనిమ్ము. ఆఁకలిఁ గొనియుంటివి. భుజింతువుగాని రమ్ము.

దేవ—(తనలో) శీఘ్రముగ నడవిదారిఁబట్టి తుదకెట్టులైన నారాష్ట్రమును జేరవలయును. అక్కడ రాష్ట్రగతి యెట్లున్నదో ! మాతల్లిగారి నచ్చట విడిచివచ్చితిని. ఆమె యెట్లున్నదో !, ఎంతదుర్దశవచ్చెనో!

(ఇద్దఱు నిష్క్రమింతురు)

ఇది ద్వితీయాంకము.

---

శ్రీ

# వ్రా ర్థి వం

---

## తృతీయాంకము,

ప్రదేశము—మహారణ్యము - కొండగుహ.

ప్రవేశము—పురుషరూపమున నున్న శారద, భీముఁడు, శత్రుంజయుఁడు, భైరవుఁడు, కేశవుండను నలుగురు దొంగలు, నడుమను గాళికేశ్వరివిగ్రహము.

భీము—బాబూ! మీరొప్పుకొనక తప్పదు.

భైర—భీమన్నా! ఒప్పుకొకపోవునెడల యీబుఱ్ఱ - యీపీఁక - యీతలపండు టెంకకుటెంక. తొక్కకుతొక్క, లాగివేయనియెడల నాపేరు భైరవన్నగారు కారని ఒట్టుపెట్టుకో.

శత్రు—దౌడపండ్లు విఱిగినవనుకో. ఎ. ఎ. (యెక్కిలి) అంతే. ఎ. ఎ. చెడఁద్రాఁగి, దొంగ, దొరల వారలేమండ దండాలుపెట్టు దొరగారికి. దొరగారనగా నెంతవారనుకున్నావు. కాళికమ్మగారి నుంచుకొనుటకుఁ దగినవాఁడు.

కేశ—ఛీ. తుంట్లమీఁద లెంపలు వేసికో. కాళమ్మ అనఁగా మనతల్లిరా లంజకొడుక! ఎక్కిళ్ళు వచ్చునట్లు చెడఁద్రాగి తగుదునమ్మ యని తగువుదిద్దవచ్చినావా.

శత్రు—ఎ. ఎ (ముష్టిచే కేశవునిఁ బెదరించును)

శార—మిత్రులారా! మీకు నాయందుఁగల దయకు సంతసించితిని. కాని నేను మీకుఁ బ్రభువుగా నుండుట కంగీకరింపను.

భీము—అదెందుచేతనో? అదే నాతో మనవి చేసికోవలెనన్నమాట.

భైర—అసబబేమిటో, అసందర్భమేమిటో, అవాకబేమిటో, అదర్యాప్తేమిటో, ఆరాకడేమిటో, అఁ. అఁ.

శత్రు—హాప్. ఊండరా. పెద్దవు బయిలుదేఱినావు. ఎ. ఎ. కొమ్ము లేనుఁగులు వంటి ఖుహోయిషుదార్లుండగా నా మోకాలంతలేవు. ధూ. శూరుఁడైనవాఁడు త్రాఁగి నప్పుడుతప్ప మఱెప్పుడు నోరు తెవనేకూడదు. పెట్టు దండాలుపెట్టు దొరగారికి. ఎ.ఎ.

కేశ—ఓరిభీమన్నా! నీవు, ఓరిభైరవన్నా నీవు, ఓరి శత్రుంజయా! నీవు, ఓరి కేశవన్నా! నేను; ఈఅయిదుగురము, యీపదిమందో చేయవలసినదేమనఁగా మనదొర పులినోటిలోఁబడిపోయినాఁడు గనుకా—ముందుకనఁబడిన బాటసారిని కొత్తదొరగాఁ జేసికోవలెనని అనుకొన్నాము గనుకా—భీమన్నా! సరిగాఁజెప్పినానా? అదిఅదిగో అది-పాతిలోఁ బెట్టిపోయినప్పుడు కొత్తలోట్టె వచ్చినట్లు వెన్నపూసవంటిమాటచెప్పినానా? కాదన్నవానిని జూతితీసికొని హా. హో. హో. (గట్టిగా నవ్వును)

శార—సోదరులారా! ఊరకుండుఁడు. నేను మీకుఁ బ్రభుత్వమునకర్హస్థితిలో లేను. గొప్ప యాపదలో నున్నాను.

శత్రు—కల్లు దొరకలేదు కాఁబోలు. ఎ. ఎ.

శార—అది యేదో మీకుఁ దెలుపనక్కఱలేదు. నాకు సెలవిచ్చునెడల నేను ముందునకుఁ బోవుదును. మీలో నొకరినిఁ బ్రభునిగాఁ జేసికొనుఁడు.

భీమ—ఆ. పప్పుడికినది కాదన్నమాట.

కేశ—దొరా! నీచేతిమీఁదుగా నన్నుఁబెట్టు. నీపాదాలతోడు. ఎంతటీవిగా—ఎంతడౌలుగా—ఆపాళెముగ గంపసిడి ద్రిప్పినట్లు—అద్దే! హె. హె. హె. (నవ్వును)

శత్రు—దొరా ! కడుపునిండినప్పుడే అధికారము. ఎ. ఎ. అయిదుపాయలకే ఎ. ఎ. గ్రుడ్లు తేలవేసి తొత్తుకొడుకా! థూ. థూ. నాకాలిక్రిందబలాదూరు. పెట్టు దండాలు దొరగారికి.

భైర—నాకడుపులోఁ గల్లుచుక్కయుండఁగ నిట్రాతిమీద కూర్చుండుమను ఎవనికైనసరే తమాషా. భైరవన్నతడాఖా హె. హె. హె. నేను నవ్వినాననఁగా నేడ్చినానన్నమాట.

శార—(తనలో) వీరునన్ను వదలునట్లులేదు. (ప్రకాశముగా) మిత్రులారా ! మీలోమీకు సఖ్య మిప్పుడు కుదురునట్లులేదు. మీ రింకఁ ద్రాగకుండునట్లు మీతోఁ గొన్ని నీతివాక్యములుచెప్పి.—

శత్రు—ఆయీఁతవాక్యాలలో యేమైనాకల్లున్నదా? అది ముందుచెప్పు.

భీమ—దొరనోటికడ్డురాకురా. ఉక్కిరిబిక్కిరి కొఁడఁటరా. దొరా! నీఖుషీ యేలాగునో అలాగునఁగాని. అడ్డువచ్చినవారిని జపా.

శార—నాయనలారా ! మీరింక ద్రాగుట మానివేయవలయును.

భైర—మానివేయకమాకేమి. త్రాగవద్దని కాళికమ్మ మూతిమీఁదగొట్టిచెప్పు. మీకందఱకు బుద్ధిరానియెడల నేను—భైరవన్న—నామట్టుకునేను—గొంతుముడివరకు వచ్చిన తరువాతగాని మానను.

శత్రు—ఓరి పిటికిపెద్దమ్మా! ఓరిపిటికిపెద్దమ్మా ముక్కుచివఱకు ఇంకొకలొడి తెడు స్థలముండఁగా థూ. థూ. దద్దమ్మలు. ఎ. ఎ. దేశాని కప్రతిష్ఠ.

శార—మీరు త్రాఁగుటమాననియెడల మీకుఁ బ్రభువుగానుండుట కంగీకరింపను.

కేశ—దొరా! నీవుకూడ త్రాఁగరాదఁటయ్యా? నిన్ను వద్దన్నయెడల మూఁతి మీసము గరిగమ్మనుపెట్టి గొరిగించి—అద్దే!

భీమ—గొప్పవారికీకల్లు పనికిరాదురా. వారికి షరాబ్.

శత్రు—కడమకల్లులు కడుపునంటయేగాని నాకునచ్చలేదురా. ఎ. ఎ. ఈత కల్లు—ఒక్కరోజామాఁగిన యీఁతకల్లున్నదే దానిఘసందు మజా—దానివడి—ఎ. ఎ. అన్నము దిన్నట్లేరా చలువకుచలువ సంపెంగపూవువాసన కాదటరా. ప్రాణము లేచిరాదఁటరా.

భైర—ఒక్కొక్కనోటి కొక్కరుచి. ఒక్కొక్కకంటికొకచూపు. ఒక్కొక్క బుద్ధికొక కవిత్వము.

భీమ—ఓరీ డొక్కచీల్చి డోలుగొట్టనియెడల గాళికమ్మబుఱ్ఱ గొరిగించినంత

ప్రమాణము. ఈబాబు మనతుదొర. ఆయనకాళ్ళమీద ఊఁ_చూడకుఁడు; భైరవన్నా! ఏఁదీ! నీవుకట్టినపదముపాడు. శత్రుంజయా! నీవేడుపారంభించు. కేశవన్నా! నీవు నవ్వు. నేను నోరు తెఱచుకొని యుందును.

శత్రు—(ఎక్కిలితో ఏడ్చును)

కేశ—(నవ్వును)

అందఱు—(శారదకాళ్ళపైఁబడి) రక్షించు. రక్షించు.

శార—మీరు నాకాళ్ళపైఁ బడవలదు. (తనలో) ఈదినమున మిగులబడలి యుంటిని. ముందునకుఁ బ్రయాణమై పోవఁజాలను. అందువలన నిచ్చట నేయుందును. అదిగాక వీరునన్ను వదలరు. ఉపటివఱకు బ్రతికియున్నయెడల నప్పటికర్తవ్యమేదో చూచుకొనవచ్చును. (ప్రకాశముగా) మిత్రులారా! నేను మీకు బ్రభువుగా నిచ్చట నుండుట కంగీకరించితిని. నేనుఁజెప్పినట్లు మీరు వినకతప్పదు.

అందఱు—ఓ. ఓ. సెబాస్. సెబాస్. (చప్పట్లు)

శార—కాని నాయిష్టమువచ్చినప్పుడు నేనుబోవుదును.

భీమ—దానికేమిలేదొర! ఇక్కడిజీలుగుకల్లు రుచిమరగిన తరువాతమాత్రము జీవాలతో నీగుహదాటి పోఁగలవఁటయ్యా.

శార—నేను గొంచెమలసియున్నాను. ఆచెట్టుక్రింద శయనింతును. మీరిప్పుడేమి జేయుదురు.

కేశ—పందిమాంసమో, పిట్టమాంసమో కల్లులో నంజుకొనుటకుఁ దీసికొని వత్తుము. (శారద నిష్క్రమించును)

భీమ—ఈరోజున మనకు మంచి లాభము కలుగవలెనని కాళికమ్మకు పదము పాడవలెను. భైరవన్నకవీ! ఏదీ నీవుకట్టినకైతము గట్టిగ నేద్వరా.

అందఱు—(పాడుదురు)

### పదము - నాదనామక్రియ - ఆది.

**కరుణించుకాళమ్మతల్లి, మాకుగడుపులునిండఁగ గల్లిమ్ముతల్లీ ॥కరుణి॥**
**చల్లగరక్షించుతల్లీ, రాతిరిచద్దన్నముకంటెను చలువైనతల్లీ ॥కరుణిం॥**
**పగవారిఁజంపుముతల్లీ, మంచికోడికత్తికంటె పదనైనతల్లీ॥కరుణిం॥**
**బాటసారులతలఁగొట్టీ, పైసాహరియించువిద్దెలో పాండిత్యమిమ్ము॥కరు॥**
**కవులలోపల భైరవన్న, కవిగట్టిననాముతాడికల్లువంటికవిత॥కరుణిం॥**
**కాళికమ్మతల్లీకీజయా. కల్లుకుండకూ జయా.**

భీమ—అమ్మవారు ప్రత్యక్షదేవతరా. మీసిగలు దరుగా; పాట నోటివెంట బైటపడుసరికి బాటసారి కంటబడినాఁడురా; వహావ్వా! అదిగో! అటు.

భైర—ఏఁడీ? ఏఁడీ?

భీమ—అదిగో గ్రుడ్డిపెద్దమ్మ—కడిమిచెట్టుక్రింద నిలువఁబడి యటునిటు చూచుచున్నాఁడు.

కేశ—సరి—సరి—ఇకఁ జప్పుడు వలదు. నే నిక్కడ నుందును. మీరు తలకొక దిక్కునకుఁ బొండు. ఓరి శత్రుంజయా! నీవు కైపు వదలినదా లేదా? కైపున్నంతసేపు చేతికి బింకముండదుసుమా—వానిని గట్టిగఁ బట్టుకొనవలెను.

శత్రు—అద్దే—ఇప్పటి కల్లునీళ్ళవు మునుపటి కైపుసాగను లేదురా—ఒక్క సారి ఋస్సుమని దిగజారి పోవును—అదికాక కైపనునది సాఁగుబడిలో నున్నది.

భైర—అదిగాక పైస చేతిలోఁ బడుసరికి పిచ్చియే యెగిరిపోవునుగదా—కైపు లెక్కయేమి; కర్ణము చాలక యొక్క లెంపకాయ వాఁడు గొట్టుసరి కన్నికైపు లుడాయించును.

శత్రుం—ఛూ—కైతము చెప్పువాఁడెప్పుడు పిటికిపెద్దమ్మయని యొట్టుపెట్టుకొనుచును ముగ్గురమున్నాముకదా—ఒక్కఁడు లెంపకాయకొట్టులేమి.

కేశ—ఆతఁడిట్లు వచ్చుచున్నాఁడు-మీరు పొండు. (ముగ్గురు నిష్క్రమింతురు)

(దేవరాజు బ్రాహ్మణవేషమునఁ బ్రవేశించును.)

దేవ—ఘెూరారణ్యమున నెన్నిపగళ్ళు తిరిగితినో, యెన్నిరాత్రులు తిరిగితినో లెక్కలేకుండనున్నది. ఇచ్చట నరణ్యభాగము మిగులఁ బలుచనగా నున్నది—నేలపై గడ్డియైన దట్టముగాలేదు—సరేకదా—అచ్చటచ్చట మాడియున్నది. అడవి జంతువులు కూడ బహు విరళముగా నున్నట్లున్నవి. ఆహాహా!

గీ. నవ్యసుందర వృక్షముల్ ♦ నఱికివైచి
బహువిచిత్రంపు జీవముల్ ♦ భంగపఱచి
తనదుసౌఖ్యంబునకుఁ గొన్ని ♦ తావులందు
జాతిపేరైన లేకుండఁ ♦ జంపె నరుఁడు
పచ్చికలమినమినఁబట్టి ♦ పసులజాడ
వృక్షసాంద్రత్వమును బట్టి ♦ పక్షిజాడ
మేలు నెలవులస్థితిఁబట్టి ♦ మెకపుజాడ
పాదుదలఁబట్టి నరుజాడఁ ♦ జూడఁదగును.
అగ్నిగాలినచోటైన ♦ నంకురించు
కత్తివ్రేసైనఁ జిగురించు ♦ గాని నరుఁడు
కాలిడినచోటు స్థిరముగాఁ ♦ గాలిపోవు
సృష్టిసౌందర్యమారక ♦ శ్రేష్ఠుఁడతఁడు.

ఇతరజాతిహత్య యటుండగా స్వజాతిహత్యలో సహజపండితాగ్రగణ్యుఁడు. పాములవు లేనికోపము, కోడిపుంజులవు లేనిక్రోధము, శార్దూలములవు లేని క్రౌర్యము,

నుడుములకులేని పట్టుదల వానికున్నవి. అదిగాక యన్నిజంతువులనుమించిన మాయ యున్నది. హా—కల్యాణమున కాహ్వానములేమి? కౌటికంపకములేమి. హాతండ్రీ! శౌర్యరాశీ! నీవుపరలోకమున కేగితివి. నన్నుగూడ నీవెంటరానిచ్చితివికావు. తల్లిగా రెట్లున్నారో తెలియదు. హరహరా! ఎంతదుర్గతిపట్టినది!

కేశ—(ఎదుటఁ గత్తి భుజముమీఁదనుంచుకొని నిలువఁబడును)

దేవ—ఓయయ్యా! నీవెవఁడవు? మాటలాడవేమి? నీ వెవఁడవు? ఎందులకు నాయొద్దకువచ్చినావు?

కేశ—నే నెవఁడనైన నీకేమి? నీతో సంబంధమునకు రాలేదు. మాకుఁ గావలసినది కాను—నీయొద్దనేమున్నదో బుద్ధిగలిగి యిటుపెట్టు—లేనియెడల నిదిగో కత్తి—గాడిదనైనఁ జంపుటకుఁ జాలియున్నది.

దేవ—నాయనా! అడుగకుండ నే నొకనికిఁ గానీయవలసినవాఁడను. అడిగిన తరువాతనైన నీయఁదగినదికాదా! అందులో నీయకుండినయెడల తలఁ బగులఁగొట్టెదనని బెదరించిన తరువాతనైన బెదరు లక్ష్యముచేసినను చేయకున్నను నీయవలసినదేకదా—కాని నీకీయఁ దగినది నాయొద్దనేమియులేదు. వ్యర్థాశుఁడవై నీవు మరలిపోవలసివచ్చెను గదా యని విచారించుచున్నాను. లేదనుట యలవాటులేని నానోటను లేదనుమాటను దిరుగననిపింపకపొమ్ము.

కేశ—నీప్రాణముబుచ్చుకొనకుండ నేను బోవువాఁడనుగాను. లేనిపోని వెఱ్ఱిచదువులు చదువక—తెగసాగక—యున్నదేదో యీవలఁబెట్టు. ఇదిగో గద—నీవంటివారితలల నెన్నో పాడిచేసినది. పిడుగుపాటునకైన వెనుకపాటున్నదికాని దీనికితిరుగులేదు—ఒక్క వ్రేటు పదునారు తునుకలు. హా. హా. (కత్తిత్రిప్పును)

దేవ—(నవ్వుచు) నావంటివారి తలలనెన్నో పాడిచేసినదంటివి. అసత్యము—నీవంటివానితలలను నేనుగొట్టియుండలేదు, నావంటివాని తలను నీవుగొట్టియుండవు. లేనిపోనిమాటలాడక నీదారిని నీవుపొమ్ము.

కేశ—నెత్తిమీఁదగుడ్డ అక్కడపెట్టు—తొడుగుకొన్న అంగరఖ అక్కడపెట్టు—అదిగో—అదిగో—లేదు లేదని బీదయరపు లరచెదవా—దొంగమాటలాడెదవా—వ్రేలిని బంగారపుచుట్టున్నదే తీసియిచ్చెదవా చంపనా? (కత్తియెత్తును.)

దేవ—ఈయుంగరము నాదికాదు. నేనీయఁదగినది నాయొద్ద నేదియు లేదంటిని. నే నసత్యమాడలేదు.

కేశ—(దేవరాజు చేయిపట్టుకొని యుంగరములాగికొనఁబోవును)

దేవ—పో. పో. దూరముగఁబో—బ్రతికియుండుట కిష్టము లేదారేమి?

కేశ—నాకుగాదు—నీకు ఇకఁజావు. (కత్తియెత్తి నెత్తినిబెట్టును)

దేవ—(తప్పించుకొని, కత్తిలాగుకొని) నీ వొక్కఁడవు నన్నుఁ గొట్టఁజాలవు. నీ కత్తి నీకిచ్చెదను. ఇప్పుడైన బుద్ధిగలిగి పొమ్ము.

కేశ—(ఈలవేయును)

దేవ—నీవారిని బిలుచుచున్నావా?

కేశ—పిలువక మానుదునా—నిన్ను ముక్కలక్రిందఁ గోయింపకూరకుందునా—కట్టిలాఁగుకొంటివా—హుఁ—హుఁ (అని మీదికివచ్చును.)

(భీమన్న, భైరవన్న ప్రవేశింతురు.)

కేశ—ఓరీ! నీవు జుట్టుబట్టుకొని గుంజు—నీవు గుండెలలోఁబొడు. చూచెదరేమి?

భీమ—(అపవారించి) కేశవన్నా! రాకడయేమైన నెదురెత్తుగావచ్చినదారేమి? కొంచెము పకడుగా నున్నట్లున్నదేమి?

భైర—(అపవారించి) అసలు నాకువిశదమైనదికాదు-బాపనవాని కీనిలబాటేమి? ఈమొరాయింపేమి? ఈ బింకమేమి? నాకు సందేహముగా నున్నది. కత్తిగాని చిన్న తుపాకిగాని చొక్కాచాటున లేదుగద—కొంచెము నిదానింతము.

కేశ—(అప) ఛీ-పిఱికిపందా-నీకట్టి నాకిమ్ము-(భైరవన్న కట్టిఁదీసికొనును)

దేవ—అదిగో నన్ను గొట్టుటకుఁ గాఁబోలు కఱ్ఱతీసికొనుచున్నావు. నామాట విని కొట్టకుము—నీవు కొట్టినయెడలఁ దిరుగ నిన్ను గొట్టవలసి వచ్చును. అది నాకిష్టము గాదు—దురభ్యాసముననో, కడుపు కక్కుర్తిచేతనో మీరీవృత్తినవలంబించినారు. న్యాయమైన జీవన మున్నయెడల మీరిట్టి హేయమైన పనినిఁ జేయరు.

భైర—తమ్ముఁడా! నీవు మాటలాడకు నేను మాటలాడెదను—అయ్యా! దొంగ వృత్తి నీచమనుచున్నావు. దొరవృత్తి ఘనము గాఁబోలు. మేమొక్కనిసొత్తే హరింతుము గాని దొరలు—బాబులు—నిక్షేపరాయలు—ప్రజలందఱు ధనమొక్కమారే హరింతురు. మేమొక్కనికొంపఁ గాల్చునరికి దొరలు దేశాలు బూడిదెజేయుదురు—మేమొక్కనిగొంతుక నొక్కుసరికి జాతుల జాతుల గొంతుకలన్నియు దొరలు నొక్కుదురు. దొరల దొంగతనాలముందు మాదొంగతనాలెంత! న్యాయమైన జీవనమఁట!—దొంగ తనమే న్యాయము—ప్రపంచపు బొంగరము దొంగతనపు జాలిమూలముగాఁ దిరుగు చున్నది. హే—హ్హే—హ్హే. (అప) కేశవన్నా! సరిగాఁ జెప్పినానా-తూలేమిలేదుగద-కైపు దిగినతరువాతమాత్రము బుఱ్ఱగుంజునకు నాకవిత్వమునకు భేదము బ్రహ్మదేవుఁడు తీయలేఁడు.

కేశ—(అప) బుఱ్ఱలుపగులుటకుసిద్ధముగానుండి మొత్తుకొనుచుండఁగా బుఱ్ఱగుంజు కవిత్వమని యేడ్చెదవేమిరా, నీకవిత్వము కాలిపోను (ప్రకాశముగా) అయ్యా! మమ్ము తప్పించుకొనిపోవుట నీతరముకాదు. నిన్ను బుట్టించిన బ్రహ్మదేవుని తరముకాదు—తెగసాగక యాయుంగర మిక్కడపెట్టు—పెట్టు కిక్కురుమనకుండ—పెట్టుమనగాను.

(మీఁదికి వచ్చును)

దేవ—అక్కడనే యాగు. ఈయుంగరము మాగురువుగారిది. నాప్రాణములు దీసికొనకుండ దీనిని మీరు తీసికొనలేరు.

భైర—అంతకంటె నేమియు సొత్తులేకుండ నేల ప్రయాణమైతివని పొడుపొడు. వట్టిచేతు లాడించుకొని వచ్చినయెడల మావంటివారి మర్యాద లెట్లుజరుగుననుకొంటివి? మా కేమి మళ్ళా, మాన్యాలా? పదిమంది బాటసారుల సంచిదులుపైనఁగాని యొక్క

పూట సాపాటులేదుకదా ? మేమేమి పస్తుందుమనుకొంటివా ? భాగ్యవంతులకువలె మా కేమి తినలేని రోగాలనుకొన్నావా ?

కేశ—అయుంగర మిచ్చెదవా లేదా? ఇదిగో వేయుచున్నాను. (కఱ్ఱత్రిప్పును)

భీమ—చూచెదవేమి, కానీ !

కేశ—(దేవరాజు నెత్తిపైఁ గొట్టును.)

దేవ—(తనకఱ్ఱచే నాదెబ్బ నాపుకొనును.) మఱియొకసారి చెప్పుచున్నాను. మీరు బుద్ధిగలిగి పొండు. మీకు ధనమిచ్చి సంతోషపెట్టలేకపోయితినని విచారించుచున్న నన్ను మిమ్ము హింసించునట్లుకూడఁ జేసికొనకుఁడు.

భీమ—నీ విచ్చుట, మేము పుచ్చుకొనుటా ? మే మేమి బాపనముండా కొడుకుల మనుకొన్నావా ? జబర్దస్తీని పుచ్చుకొందుము. తమ్ముఁడా! రా!

కేశ—భైర—(కలిసి దేవరాజుపైఁ బడుదురు.)

దేవ—(వారినిద్దఱను చెరియొక గ్రుద్దుగ్రుద్ది, నేలఁబడఁగొట్టును.)

భీమ—కేశ—హా ! హా ! (నేలఁ బ్రాలుదురు.)

భైర—(తనలో) అయ్యో! దున్నపోతులవంటి ముండకొడుకులు నేలఁబడినారు. నేనొక్కఁడ నేమిచేయఁగలను. ఆయెక్కిళ్ళతొత్తుకొడు కెక్కడఁ గనఁబడడే!

దేవ—అబ్బీ ! నీ కేమియు భయములేదు. వారు చచ్చిపోలేదు. మీకు హాని చేయుటకు వచ్చినవాఁడను గాను. మీ వలన హానిఁ బొందువాఁడను గాను. నే నడిగిన యంశములు మాత్రము సరిగా నీవు చెప్పకుండినయెడల నీప్రాణములు దక్కవు. నీవింతకు ముందు దొంగతనమని దొరతనమని మంచి యుపన్యాస మిచ్చితివి. నీవు బుద్ధిమంతుఁడవు. ఇచ్చటికి భట్టికులమువారిరాజ్య మెంతదూరమున నున్నది?

భైర—దాదాపుగాఁ బదియామడల దూరమున్నది. నీ వక్కడకుఁ బోవలయునా యేమి ?

దేవ—అవును.

భైర—అక్కడి కిప్పుడెందులకు ? ఆరాజు, రాజుకొడుకు పెండ్లికి వరాహాపురమునకుఁ బోయినారు. అక్కడకుఁ బోయిన యెడల నేమైనఁ దొరకఁగలదు. ఏవో కొన్ని కింవదంతు లున్నవికాని, అవి నిజమని నేను నమ్మను.

దేవ—మీరున్న యీస్థలము భట్టిరాజ్యములోనిదా? వరాహాపురపు రాజ్యములోనిదా ?

భైర—దేనిలోనిది కాదు. ఇది మా సొంతరాజ్యము. మమ్ము నొక్కివేయవలయునని యెన్నిరాజ్యాలవారో తంటాలు పడినారు. మేము వారి కందలేదు.

దేవ— (తనలో) ఇట్టి దొంగలున్నారని నేను కర్ణాకర్ణికగ వినియుంటిని. (ప్రకాశము) అబ్బీ ! సొంతరాజ్యమనఁగ నాకుఁ దెలియలేదు.

భైర—మాకును రాజు, కోట, పందులు, పండితులు, కుక్కలు, సంగీతపాటకులు, కవులు, గాడిదెలు, కాళికమ్మ, కల్లుపాక, అన్నియు నున్నవి. అన్ని వ్యవహారాలు, క్రమము తక్కువ యన్నమాటకాని జరుగుచునే యున్నవి. ఎక్కడికి-చిన్నకుఁ

జిన్న, పెద్దఁబెద్ద, రథపుచక్రము దిరిగినదే, రాట్నపుఁజక్రము తిరిగినదే! అదిచక్రమే! యిది చక్రమే. ఆలాగే గౌరవానికి, మర్యాదకు సన్ని రాజ్యము లొకటే?

దేవ—అబ్బీ! నీవు చదువుకొంటివా?

భైర—చదువుకొన్నయెడలఁ గవిత్వములో సెందులకుఁ దిగుదును? మాలోఁ గొందఱు చదువువచ్చినవారున్నారు. కాని యందఱుమగవారు. ఆఁడుపురుగున్నైనఁ జేగ నీయలేదు. వారితో బాధలు పడలేక—

దేవ—మీరంద తెందఱున్నారు?

భైర—దాదాపుగా నాలుగువందల జనమున్నాము. అయ్యా! నేను జెప్పిన మాటలు వారికి వినఁబడి యుండవుకద?

దేవ—వినఁబడవు. నీవు చెప్పినట్లు వారితో నేను జెప్పను. నీ కొసందేహ మక్కఱలేదు.

భైర—నిన్నుఁ జూడఁగానే కవిత్వపుఁ బసిచేత మీ గొప్పతనమును గనిపెట్టినాను.

దేవ—(తనలో) నే నొక్కఁడను. మీ రనేకులున్నారు. నరహత్యకు సందేహించువారుకారు. ఇంకను మారాజ్యము పదియామడ యున్నదఁట! కష్టమోర్చినవారి యామడ నుకుమారికి రెండామడలు. ఇదివరకే నుక్కిలి యలసియున్నాను. కావునఁ గలహము మాని వీరికి వశుఁడనై వీరి రాజునుజూచి యాతనియొద్ద నొక్క గుఱ్ఱమునడిగి పుచ్చుకొని మా యూరు చేరవలెను. (ప్రకాశముగా) అబ్బీ! అకుంటలోని నీరము దోసిటితోఁ దెచ్చి వారి మొగమునఁ జల్లుము.

భైర—(అటు చేయును)

భీమ—కేశ. -(లేతురు.)

భైర—(వాని పట్టుకొని) నాయనలారా! తొందరలేదు. ఒక్కనిముసము సంబాళించుకొనుఁడు.

కేశ—పెద్దమ్మ! నీవొక్క వ్రేటు వేయలేకపోయినావా? ఇంతసేపు బ్రతికి యుండి నీ వేమి రొడ్చుచున్నావు? ఆకల్లుతిత్తిగాడి దెకాడు కేడీ?

భీమ—మనము ముగ్గురము మోటత్రోపుగా మీదఁబడుదము. ఊ—కానీ—ఊ—కానీ.

భీమ—భైర—కేశ—జయా! కాళికమ్మతల్లీ! జయదుర్గమ్మతల్లీ!

(దేవరాజు మీదఁ బడుదురు.)

దేవ—ఇదిగో నాచేతికత్తి నావల బాఱవైచెదను. మీరునన్ను గొట్టకుఁడు. వశుఁడైనవాని నేలకొట్టుదురు.

భీమ—ఈ బుద్ధి వెనుకనే యేలరాకూడదు! (కొట్టును.)

కేశ—హు—ఏమనుకొంటివో? పిడుగులు గురిపింతును. కొండలు పిండిచేయుదును. (గ్రుద్దును)

భీమ—కట్టు. చేతులు విఱిచికట్టు. (దేవరాజు భుజములు కట్టివేయుదురు)

దేవ—సరే; కట్టితిరి. బాగుగనే యున్నది. ఇటుపిమ్మట నన్నేమి చేయఁదలఁచినారు.

కేశ—కాళికమ్మకు బలి నిచ్చెదము.

భీమ—సెబాస్ ! మనకుఁ గ్రొత్తరాజు వచ్చినందుల కుత్సవముగా నుండును.

దేవ—(తనలో) గుఱ్ఱమును, దారిజూపువాని నొకనిని వీరిరాజు నడుగఁదలఁచి వీరికిట్లు బుద్ధిపూర్వకముగాఁ జిక్కుకొంటిని. ఇది బుద్ధిలేని పనియేమో ! గుఱ్ఱములేకున్న యెడలఁ గుంటుకొనుచునో దేకుకొనుచునో యెప్పటికో యొకప్పటి కిల్లు చేరుకొందునుగాని గుఱ్ఱముకొఱ కిట్లు జేయుటవలన బ్రాణమునకే మోసము వచ్చునేమో! ప్రాణము పోయినయెడలఁ దండ్రిగారియాజ్ఞ నెట్లు నిర్వహించుకొనఁగలను. అయినను ఆత్మరక్షణకై మెలను బాకున్నదిగదా? పోనీ, వీరికిఁ జిక్కకుండఁ బోవలెనన్న నాతరముకాదే? ఎంతసేపని యెందఱితోనని పోరాడఁగలను. ఎన్నిరోజులనుండి నిద్రాహారములు లేవో యెఱుఁగను. ఇట్టి స్థితిలో నింతకంటె నేమిచేయవలసినది ? ఏమో ?

గీ. మంచిచెడ్డలఁ గొంతయో ♦ జించి యేదొ
పద్ధతినిబూని భాగ్యదే ♦ వతకుఁదుదకు
వదలవలెఁగాని యెపుడదే ♦ పనిగ మెదడు
చింపుకొని త్రొక్కులాటలఁ ♦ జెందఁదగునె
ఏదియెటువచ్చునో బుద్ధి ♦ కెఱుకపడునె
ఎఱిఁగియుండియు నట్లను ♦ ష్ఠింపఁదరమె
ఎఱుఁగుదుము మంచిదెదొ యాచ ♦ రించినామె
ఎఱుఁగుదుము చెడ్డదెదొ త్యజి ♦ యించినామె
అంతిపురిఁ బెండ్లికొడు కేడ ♦ నడివి నిప్పు
డిచటికాళికి వేటపోఁ ♦ తేడ నకట
వింతభాగ్యదేవతగంగ ♦ వెల్లువలందు
సుడిఁబడుచుఁ గొట్టుకొనిపోవు ♦ బుడమియంత.

భీమ—పద. పద. అమ్మవారిగుడికి—(లాగును)

(నేపథ్యమున)

నేను రాకుండనే యమ్మవారిగుడికా— (శత్రుంజయుఁడు ప్రవేశించును.)

భీమ—ఓరి నీ గొంతుక గొయ్య—ఇంతవఱ కెక్కడనుంటివి?

శత్రుం—ఒకనిమీఁద ముగ్గుఱు కలియఁబడుటయే మగతనమునకుఁ గానిపనియై నప్పుడు నేనుగూడ నేమొగముపెట్టుకొని రావలసినది! చాలు-చాలు-ఈమాత్రపుఁబని కెంతగింజుకొంటిరి.

కేశ—సరే! మాకు శౌర్యములేదు. పోనీ; కాని, నీవు ముందుగాఁ బరుగెత్తి

మనరాజునొద్దకుఁబోయి "శౌర్యముగల బాటసారి యొకఁడు దొరకినాఁడు; బ్రాహ్మణుఁడువలె నున్నాఁడు. ఆతనిని బట్టుకొనుట మిగులఁ గష్టమైనది. కాళికమ్మవారికాతనిని బలియిచ్చుటకు నిశ్చయించుకొన్నాము. మీసెలవు కావలెను" అనిఁ జెప్పి సెలవిచ్చినట్లు లేదైన నానవాలు తెమ్మ—పొమ్మ—(శత్రుంజయుడు నిష్క్రమించును)

భీమ—ఇదిగో! మేమీలోపల నితనిని గుడియొద్దకుఁ దీసికొని పోవుదుము—అక్కడ నీవు మమ్ము గలిసికొనుము. వినఁబడినదా?

(నేపథ్యమున) అద్దే!

కేశ—(అప) భీమన్నా! భైరవన్నా! ఒక్కనిని బట్టుకొనుటకు ముగ్గుఱకుఁ జావు తెంపులైనవి. అందులో బ్రాహ్మణుని బట్టుకొనలేకపోవుట వంశానికంతకు నప్రతిష్ఠ కాదా—ఈకల్లుమూలమున మనమిట్లుపాడైతిమిసుమా, మానినయెడలమంచిదేమో.

భీమ—(అప, భైరవునితో) నీవేమి యాలోచించుచున్నట్లున్నావు!

భైర—(అప) బలికంటె గాలపుసిడియాడినయెడల కవిత్వమున కెక్కువరంగుగా నుండునేమో యని చూచుచున్నాను-అదిగో! అమ్మవారిగుడి—జయా — కాళికమ్మ తల్లికి జయా—

(తెరయెత్తగ వెనుక కాళికమ్మ గుడి.)

అందఱు—జయా, కాళికమ్మకు జయా—

భీమ—బలిపోతునకుఁ బూలదండలుగట్టి పసపురాయుము.

కేశ—(అట్లు చేయును)

భీమ—భైరవన్నా! నీవు వేటకత్తిని చాఁపఱాతిమీఁద నూరి రవంత పసపును, గుంకుమమును దానిమీఁదఁ బూజచేయుము.

భైర—(అట్లుచేయును)

భీమ—బాపనయ్యా! ఈ ఱాతిమీఁద నమ్మవారివంక మొగము పెట్టుకొని కూర్చుండుము.

దేవ—(అట్లు చేయును)

భైర—సోదరులారా! ఇతనిని జంపినందువలన మనకు లాభమేమి?

కేశ—నీవు కవిత్వము చెప్పినందువలన మాకు లాభమేమి?

భైర—మాకు లాభము లేకపోయినను లోకమునకు ముందు లాభించును. ఆసంగతి నాకుఁ దెలియునులే. దానికి దీనికి సాటిదెచ్చితివేమి? బాపనయ్యా! ఒక్కమాట. ఈయుంగరముకొఱకుగదా యింతతగవు. అది మాకిచ్చి నీదారి నీవు పోరాదటయ్యా?

దేవ—నే నిప్పుడిచ్చుట యెందులకు? నాతల తెగినతరువాత మీరే తీసికొనవచ్చును. ఇంతలోఁ దొందరయేల?

కేశ—చూచితివాపట్టు-తేరాకత్తి- (కత్తిపుచ్చుకొనును)

దేవ—నన్నుఁ జంపుటకు మీరాజాసెలవేది? అదిరాకుండఁ గత్తియెత్తినయెడల మీ ముగ్గుఱకుగూడ మెఱపుమెఱసినంతలో నీకత్తితోడనే నఱకెదను జాగ్రత్త.

శత్రుం—(ప్రవేశించును) ఇదిగో వచ్చుచున్నాను. ఆఁగుఁడని రాజుగారు మనవి చేయుచున్నారు.

భీమ—నీ మొగము! సెలవిచ్చినా రనరా.

కేశ—ఆయనను రమ్మని చెప్పితివారేమి ? బలికాలమందు రాజుగారు వచ్చుట యాచారములేదే—వారిసెలవు మాత్రమే యాచారముకదా !

శత్రుం—క్రొత్తరాజుగనుక మొదట నన్నియు స్వయముగానే చూచుకొనవల యునని దేవులాడుచున్నాఁడు.

దేవ—

సీ. మహిమస్వరూపోగ్ర ♦ మాంసభోజనరక్త
జాతప్రపాన సం ♦ ప్రీత, మాత ?
జ్వాలాసముజ్జ్వల ♦ చ్చండనేత్రత్రయా
భీకరవదన సం ♦ స్ఫీత, మాత !
ప్రబలదంష్ట్రాంకూర ♦ బహుళసౌదామనీ
పుష్కలగాత్రజీ ♦ మూత, మాత !
ప్రమథాధిపతితాండ ♦ వ ప్రహోషక ఘోర
ఘోరసంగీతని ♦ ష్ణాత, మాత !
శీతభూధరరాజ సం ♦ భూత, మాత !
ఘనదయాపుష్ట భక్త సం ♦ ఘాత, మాత !
క్షత్రసుతశౌర్యరక్షణ ♦ ఖ్యాత, మాత !
పాహి మాంపాహి పాహిమాం ♦ పాహి పాహి.

(శారద ప్రవేశించును)

శార—(తీవ్రముగా) ఆఁ ఆఁ, ఎవరది? ఎవరది? ఎవరిదాకంఠధ్వని ? భటులారా! మీరు దూరముగఁ బొండు. (వారు నిష్క్రమింతురు)

నాయనా! దేవరాజా! ఏమీ? ఒక్కఁడవేవచ్చితివేమి ? అయ్యో! అయ్యో— (గడ్డము పైకెత్తిపట్టుకొని) నాయనా మాటలాడవేమి ? మీతండ్రిగారేరి ? నాయనా! అట్లు కన్నీరు పెట్టుకొందువేమి? మీనాయనగారు సుఖముగా లేరా? ఏమిమునిఁగిన దోయి నాయనా! (ఏడ్చును.)

దేవ—అమ్మా—అమ్మా (ఏడ్చును)

శార—హా ప్రాణనాథా —(మూర్ఛిల్లిపడును.)

దేవ—హా తండ్రీ! — హా సుగుణసముద్రా!—హా ఆదిత్యప్రతాపా! హు—హు— మోసముచే నిన్నా పాపాత్ముఁడు హరింపఁగలిగెనుగాని బహిరంగయుద్ధమున నిన్నెవ్వఁడు తాకఁగలఁడు.

శార—(తలయెత్తి) ఏమంటివి ? ఏమంటివి ? మోసమా ? హా ప్రాణనాథా! నిన్నుఁగూర్చి యెంతమాట వినుటకు బ్రదికియుంటిని. హా! పరమేశ్వరా!

(తిరుగ నేల వ్రాలును.)

దేవ—అమ్మా!_ఆశ్వాసిల్లుము—తల్లీ!_ఆశ్వాసిల్లుము.

శార—నాయనా! మోసమంటివి. నాప్రాణములు పోకమును పామోసమున కేమికారణమో నాచెవినివైచెదవా ?

దేవ—మోసమునకుఁ గారణమును నేనే. నా మాయపెండ్లియే యాతనిమరణమును దెచ్చెను. పెండ్లి పెండ్లియని మఱిమఱి పిలిపించి యా కటికవాఁడందఱిగొంతును కోయించినాఁడు. ప్రాణములు దక్కించుకొనక తప్పదని బలాత్కారమునఁ దండ్రిగారిచేత సంఘమరణశాలనుండి పైకిఁ ద్రోసివేయఁబడి యొక బ్రాహ్మణగృహమును బ్రవేశించి బ్రాహ్మణవేషమును ధరించి యాదంపతులచేఁ బుత్రునివలె నాదరింపఁబడి స్వరాష్ట్రమునకుఁ బోవలయునని యెంచి యిట్లువచ్చుచుండఁగా, అమ్మా! అమ్మా! నీవేమి చెప్పఁబోవుచున్నావు ?

శార—నీతండ్రిగారచ్చట మోసమున నెట్లు హరింపఁబడిరో నీ రాష్ట్రముగూడ నిచ్చట నట్లే హరింపఁబడినది నాయనా.

దేవ—రాష్ట్రముగూడఁ బోయినదా? పోనీ, యేమిచేయఁగలము ! తండ్రిగారి కంటె నది యెక్కువది కాదుగదా! బ్రతికియుండినయెడలఁ దిరిగి రాష్ట్రము రావచ్చును గాని తండ్రిగారు వత్తురా? పెండ్లి వంశవృద్ధికై యుండ నాకు వంశనాశనమునకైనది. కాని నారాజ్య మెట్లపహరింపఁబడినది ?

శార—ఆ దిక్కుమాలిన పెండ్లి రాత్రియే నాయనా! కోటను ముట్టడివైచి నిదురించుచున్న సేనాధిపతుల నాచండాలుఁడే చంపించినాఁడు. నేను నొక్కదాసియును పురుషవేషములతో గుఱ్ఱములెక్కి పారిపోయితిమి. దాసియు గుఱ్ఱములు దారిలో మృతినందెను. నే నీ యుదయముననే యిటకుఁ జేరితిని. అక్కడ భర్తగారు పరలోకగతులు కాగా నిక్కడ స్వరాష్ట్రము శత్రువులపాలుకాఁగఁ గన్నకొడుకును గాలికవదలినిచ్చటకై దొంగలవలె నేనిట్లు ప్రభుత్వమేడ్చుచున్నానురా తండ్రీ.

(ఏడ్చి మూర్ఛిల్లును)

దేవ— అమ్మా ! నిముసనిముసమునకు మూర్ఛిల్లి కొయ్యఁబారుచున్నావు. అమ్మా—అమ్మా—పలుకవేమి? (తనలో) మాయమ్మగారీదుఃఖమువలన మృతినొందుట నిశ్చయము—నేనింకఁ దల్లిలేనివాఁడనుగూడఁ గావలసియున్నది. దానితోఁ గష్టపూర్తియగునో మఱి యింక నేమైన నున్నదో—ఇఁక నేనుఁ జావవలయునుగాని చావఁ దగినవారు నాకింక నెవ్వరున్నారు. అంతఃపురములో హంసతూలికాతల్పమున దాసీకాపరామర్శితపాదజలజయగుచుఁ బవళింపవలసిన రాజ్ఞీమణి నట్టడవిలో దొంగలకోసలో ననాథయై నేలపైఁబడి యున్నది. సుఖపెట్టవలసిన నింత వయస్సుగల కొడుకనైన నేను బ్రతికియుండఁగానే యామె కీదురవస్థ వచ్చినది. హా—హతవిధీ—నీచర్యలకడ్డేమున్నది. నీవొకదారి, పద్ధతి ననుసరించిపోయెదవా—కాక నిరంకుశప్రభుఁడను నాకేమని పందెవు

క్రేటుగా వెఱ్ఱివానిచేతి విసరుగాఁ బోయెదవా—హా! భగవంతుఁడా! ఈమె క్షత్రియకాంతగదా—మహాభిమానధనకదా—ఎండకన్నెఱుఁగనిదికదా—అట్టియీమహారాజ్ఞిని నరహత్య వృత్తిగాఁగల దొంగలనడుమను మహారణ్యమధ్యమునఁ బాఱవైచితివే—ఈమె యం దేతప్పుఁ గనిపెట్టి యిట్లుచేసితివి! ఇంత యధమస్థితిలోని కీడ్వఁదలఁచినవాఁడవు ముందంతయామెగా నేలసృష్టించితివి? ఆపదలిచ్చునప్పుడు, శిక్షించునప్పుడు, కొంత వంశగౌరవమును జూడనక్కఱలేదా. సామాన్యబుద్ధియుక్తుఁడైన భూలోకరాజులే యట్లు చూతురే—సర్వజ్ఞుఁడైన నీకీ యసందర్భచర్యఁదగునా—ఛీ. ఛీ. తప్పుటూహములలోఁబడుచున్నాను కాఁబోలు—ఇట్టితల్లిని, నిట్టిపుత్త్రుని నిచ్చుట నన్యోన్యాశ్వాసమునకు సమావేశమొనర్చిన పరమాత్ముఁడు కరుణాళుఁడుకదా. సర్వజ్ఞుఁడుకదా. అతఁడేమి యూహించెనో. కాని (ప్రకాశముగా) అమ్మా-అమ్మా—కొంచెమూరడిల్లుము.

శార—కొంచెముగానేమి, పూర్తిగనే యూరడిల్లుదును నాయనా!

దేవ—(గడ్డముపట్టుకొని) తల్లీ! చెప్పినమాట విని యూరడిల్లుము. నీవు కంట నీరు బెట్టుకొనుచుండఁగా నేను జూడలేను. నాకడుపు దహించుకొని పోవుచున్నది. నాబాధను నివృత్తిచేయుటకైన నీవు విచారింపవలదు.

శార—నాయనా! నీవంతగాఁ జెప్పనక్కఱలేదు—నేనిఁకఁ గన్నీరు పెట్టుకొననులే. మీనాయనగారవసానదశలో నీకేమైన నానతిచ్చిరా?

దేవ—రెండాజ్ఞ లిచ్చినారు—మొదటిది వరాహరాజు హృదయరక్తముతోఁ దనకుఁ దర్పణమిమ్మని—రెండవది తల్లిగారిని భక్తితోఁ బూజించుచుండవలెనని.

శార—ఆరాజాధము నీవెట్లు చంపఁదలఁచితివి?

దేవ—నారాష్ట్రమున్నదికదా; అక్కడకుఁబోయి యెట్లో ప్రయత్నము చేయవలయునని యూహించితిని. అదికూడఁ బోయినదని యిప్పుడు తెలియుటచేత మనస్సు తుపానునందు సముద్రమధ్యమందలి యోడవలె—

శార—నాయనా! ఇంతనిరుపాధికుఁడవైన నీ వంత కార్యమెట్లొనర్పఁగలవు! శత్రుమారణము మీతండ్రిగారి కభిమతమైనను భగవంతుని కనిష్టమైనట్లు ప్రస్తుతస్థితి వలనఁ దెలియుచున్నది. పోనీ—నాయనా! ఈరక్తాశనవృత్తినివదలి సత్యదయాశౌచములు గలిగి బ్రాహ్మణవృత్తినిఁ బ్రచ్ఛన్నముగ నవలంబించి—

దేవ—అమ్మా—అమ్మా.

శార—క్షత్రియకాంతనైన నేనిట్లనఁగూడదని యెఱుఁగుదును. అందులో మీతండ్రిగారి ధర్మదారనైన నేనిట్లు బొత్తిగా ననఁగూడదు. కాని నీవుమాకొక్కఁడవు. నీవైన బ్రహ్మచారివిగా నున్నావు. నీకు వివాహమైన నయియుండినయెడల నేనిట్లనుదానను గాను.

దేవ—అమ్మా! శత్రుమారణమొనర్చి తండ్రిగారి ఋణమును దీర్చినవిమ్మట నీయిష్టానుసారముగాఁ బవిత్రమగు బ్రాహ్మణవృత్తి నవలంబించెదనులే.

శార—బ్రాహ్మణవృత్తియని దీనమగుమాట నే నేలపలుకవలసివచ్చినదనఁగ నిన్ను గర్భమునధరించి యుండునప్పుడు నవమమాసమున రాత్రి నొకమహాపురుషుఁడు,

శంకరదేవుఁడని నేననుకొంటిని. స్వప్నమున సాక్షాత్కరించి, అమ్మా ! నీగర్భమున నున్నవాఁడు బ్రాహ్మణాచారము నవలంబించును. అని చెప్పినాఁడు—ఇప్పటి నీ బ్రాహ్మణవేషమును జూడఁగానే నాకీపూర్వస్మృతికలిగినది. నీకేల చెప్పవలయునని యింతసేపూరకుంటిని. కాని యెందులకైన మంచిదేమోయని చెప్పితిని.

దేవ—నన్నుఁ బోషించిన బ్రాహ్మణదంపతులయొద్ద సెలవు తీసికొనినప్పు డాబ్రాహ్మణుఁడు నాతో నేమి చెప్పెనో విందువా ?

శార—అవశ్యము.

దేవ—'నీవు క్షత్రియుఁడవైనను నాభార్య నీకు యజ్ఞోపవీతధారణ మొనరించి నాదర్భముడియుంగరము నీచేతనుంచి నీకు బ్రాహ్మణత్వ మిప్పించినది. నీచేతిసిరముఁ గూడఁ ద్రాఁగినది. నీవు మాకుఁ బుత్రుఁడవు. అపద్వేళను నీకామెయిచ్చిన బ్రాహ్మణత్వమును—అసత్యమాడి నీకు నేనః స్థిరపఱచిన బ్రాహ్మణత్వమును—నీవు కాపాడుకొనుము' అని బ్రాహ్మణుఁడు చెప్పెను. బ్రాహ్మణుఁడనైయుండి శత్రుమారణ మెట్లు చేయఁగలనని వారినడిగితిని. క్షత్రియోచితవ్యాపారములన్నియుఁ జేసికొనుము. బ్రాహ్మణ వేషమునమాత్రముండుము.

శార—అందుల కంగీకరించితివికద !

దేవ—ఆ.

శార—నాయనా! మంచిపనిఁ జేసితివి. ప్రాణదాతయగు నామహానుభావునియాజ్ఞ నిర్వర్తింపఁబడునుగాక—సరే యింక నీవేమిచేయ దలఁచితివి?

దేవ—మీతల్లిగారిని భక్తితోఁ బూజింపవలయునని మాతండ్రిగారిచ్చిన రెండవ యాజ్ఞను దలఁదాల్చుటకంటె నేఁకఁజేయఁదగినదిలేదు.

శార—నాయనా ! బుద్ధిమంతుఁడవైన నీ వెప్పు డట్లు చేయుచునే యున్నావు. నే నడిగిన దది కాదు. ఇఁక శత్రుహత్యకు ముందు దారియేది యూహించితివని యడిగితిని.

దేవ—ఒకటి రెండు పూటలలో నాలోచించి మనవిచేసెదను.

శార—అట్లుకాదు నాయనా—నాకుఁ దొందరగానున్నది. నేను జెప్పునదేదో విను. ఇక్కడ దొంగలు దాదాపుగా నాలుగువందలవఱ కున్నారు. వీరు దృఢశరీరులు-బలాఢ్యులు—దురభ్యాసములు కొన్నికలవారైనను క్రమముగాఁ దగ్గించుకొనఁగలరు—ఏగుహలో దాచియుండిరో కాని వీరియొద్ద విశేష ధనమున్నదని నానమ్మకము—కావున నీవు వీరికి రాజుగానుండి వీరిని యుద్ధనిపుణులఁ జేసి సైన్యమునుగూర్చి కోటను బాగుగా వృద్ధిపఱచి బలిష్ఠమగు రాష్ట్రమిచ్చట స్థాపించి ప్రచ్ఛన్నుఁడవైయుండి తగు సమయమును గనిపట్టి శత్రుమూలవిచ్ఛేదమును జేయుదువుగాక.

దేవ—తల్లిగారి యాశీర్వాదము శిరమున ధరింపఁబడినది. కాని నీవే ప్రభ్విగా నుండుము—నేను సేనాధిపతిగానుండి వీరినందఱను గదనకళాన్వితులుగఁ జేసెదను.

శార— ఈ దిక్కుమాలిన పురుషవేష మింతవఱకు ధరించినందులకే నేను లోలోనఁ గ్రుళ్ళి చచ్చుచున్నాను—ఇదిగో యిప్పుడే తీసివచ్చెదను. (నిష్క్రమించును.)

దేవ—హా భగవంతుఁడా! ఎంత మహాకష్టములోనైన నేదో రవ్వంత యూఱఁ గలిగించుచుందువుకదా.

గీ. చిత్తమునఁబూర్ణశశి ప్రకా ♦ శించుచుండ,
దూరమున మొండిచేటంత ♦ తోయదంబు,
తూర్పురవగాలి విసరునఁ ♦ దోఁచె నెప్పు
పాటునను జిమ్మచీఁకటుల్ ♦ పర్వె దిశలఁ
బ్రబలపవనమువీచె రైఁ ♦ రయ్యిమనుచు
బారు మెఱపులు జరజరఁ ♦ బఱుగువాత్రె
పిడుగులెడమీఁక పడె బడ ♦ బడలతోడ
కుంభవృష్టిగ వర్షంబు ♦ గ్రుమ్మరించె
నిప్పటికిఁ గొంత శమియించి ♦ నప్పటికిని
మబ్బులెడనెడ కొంత త ♦ బ్బిబ్బుగాను
వచ్చుచునుబోవుఁ బెదచుక్క ♦ లచ్చటచటఁ
గనఁబడెఁ దుపాను రాకుండుఁ ♦ గాకమఱలఁ

శార—(స్త్రీవేషమునఁ బ్రవేశించి) నాయనా! ఇదివఱకే యాలస్యమైనది. ఒక్క ముఖ్యాంశము నీతోఁ జెప్పవలసి యున్నది.

దేవ—అమ్మా! నాకుఁ దొందరగా నున్నదని యిదివఱకంటివి. ఏమోయని యూరకుంటిని. ఇప్పుడిదివఱకే యాలస్యమైనదంటివి. నీ వేమిచెప్పుదువోయని భయముగా నున్నది.

శార—నాయనా! భయమేల? విజయరాజేంద్రుని కొడుకవు. నీకు భయముండఁ దగునా—అతని భార్యనైన నాకే భయములేదే — భయపడవలసినదికాదు— ఇదియొక్క నాతల నేపుట్టినా—ఎంద ఱుత్తమకాంత లట్లాచరింపలేదు?

దేవ—అయ్యో—అయ్యో—సహగమన మొనర్చెదవా?

శార— నాయనా! అట్లు చేయకపోవుట వింతకాని చేయుటలో వింత యేమున్నది?

దేవ—అమ్మా! వలదు — వలదు — నాయనగారే గతించిరని గుండెపగిలి యేడ్చుచుండఁగా నీవుగూడ నన్ను వదలిపోవుదువా?

శార—నాయనా! నాయొడిలోఁ గూరుచుండుము.

దేవ—(అట్లుచేయును)

శార—నాయొడిలో పాలుద్రాగిన యింతవాఁడవు నా చేయెత్తువాఁడవై తివిగదా-వీరపురుషుఁడవై తివిగదా—ఇప్పటికష్టము లేమి పీఁటలు పెట్టుకొని కూరుచుండుదునా?

నీవెంత యదృష్టవంతుఁడవు ; కావలసియున్నదో—తల్లియుఁ దండ్రియు నెల్లకాలము నుటికట్టుకొని యూఁగులాడుదురా నాయనా !

దేవ—అమ్మా ! యింతట వలదు—ఒక సంవత్సరమువఱకుండి యటుపైనఁ దండ్రిగారి యాబ్దికదినమున సహగమన మొనర్తువుగాని. అమ్మా—అమ్మా.

శార—అట్లు చేయుట సహగమనమనిపించుకొనదు—ఇదివఱకే యాలస్యమైనదని నేను దేవులాడుచుండఁగా నింక నొక సంవత్సరమని నీవనఁదగునా—నాయనా ! నీవింకఁ జంటిపిల్లవాఁడవని నేను గొంతకాలము నిరీక్షింపనా ? నేను గర్భవతినని నిరీక్షింపనా ? అకారణనిరీక్షణము దోషముగదా.

దేవ—అమ్మా! నీకు నేనేమి చెప్పఁగలను—ఇట్టి మహాదురవస్థలో నన్ను విడిచి పోవుతలంపు నీకుఁగల్గుట యేమనుకొనవలసినది. (నుదుటిపై గీఁతగీచి) హరహరా—హరహరా.

శార—నాయనా ! లోడితెడులోఁ దొంబదితొన్నులైన యీ యిహలోకజీవనములోని భాగ్యాభాగ్యముల లెక్కయేమి ? నాయనా ! మూర్ధాభిషిక్తుడు బ్రతుకుచున్నాఁడు. ముష్టివాఁడును బ్రతుకుచున్నాఁడు. వాఁడులేదని యేడ్చుచున్నాఁడు! వీఁడును లేదని యేడ్చుచున్నాఁడు ! ఇఁక భాగ్యమేమి, అభాగ్యమేమి? సుఖియెవ్వఁడు, దుఃఖియెవ్వఁడు! ఇక్కడిగతి గతికాదు—ఇక్కడిబ్రదుకు బ్రదుకుకాదు—నాయనా! వయసువచ్చిన బుద్ధిమంతుడవు కావున నాయుత్తరగతికి నిన్ను సాయపడుమంటిని.

దేవ—అమ్మా ! నీయిష్టము.

శార—నాయనా! నాయిష్టమేకాదు—నీవుకూడ నిష్టపడితివేని నామనసునకు శాంతిగానుండును.

దేవ—ఇష్టపడక నేను జేయవలసిన దేమున్నదో నీవే చెప్పు. నేనుకూడ నీవలెనే యగ్నిప్రవేశము చేయుటకు నాకు వీలులేదుకదా—శత్రుమారణ మొనర్చి తండ్రిగారి యాత్మకు శాంతిగలుగఁజేయకుండ నేనాత్మహత్య చేసికొనుట కపకారము లేదుగదా ! ఒక్క సంవత్సరములో నట్టిశత్రుమారణదీక్ష పూర్తియగునేమో! అటుపైన నీవును నేను నొక్కసారి ప్రాణపరిత్యాగమహోత్సవము సలుపుకొనవచ్చునని నేను నిన్ను నిరీక్షింపు మంటిని. అంతవఱకాఁగుటకు నీవంగీకరింపవైతివి. నేనేమిచేయఁగలను ?

శార—వెఱ్ఱివాఁడా శత్రుమారణమైనపిమ్మట నీకుఁ బ్రాణపరిత్యాగముతోఁ బనియేమున్నది ! నీరాష్ట్రము నీకువచ్చును. పరరాష్ట్రముకూడ రావచ్చును. వివాహము చేసికొని చినవిజయరాజేంద్రునిఁ గనవలసిన భాగ్యవంతుఁడవగుదువు. నీకేమి నాయనా—విచారింపకుము. కంటఁదడిపెట్టకుము. ఇఁక నీతోఁజెప్పవలసిన దింతకంటె నేమున్నది ? లే నాయనా !

దేవ—(లేచి) అమ్మా ! అప్పుడే పోవుచున్నావా? (ఏడ్చును.)

శార—నాతండ్రీ ! నీవు కంటనీరు పెట్టినయెడల నా కేడుపువచ్చును. సహగమన మొనర్చువారు కన్నీరు విడువఁదగదు. అందువలననే నేనింతసేపటినుండియు మొఱఁడునైయున్నాను. ఈప్రపంచమున సుఖపడవలసినవారికిఁగూడ నదియే సాధనము.

నాయనా ! ఇఁక దడయఁగూడదు—భటులను వెలుపల నింతసేపుంచితిని. బాగుగా నుండదు. వారిని లోనికిఁ బిలుతును. భటులారా! ఇటురండు.

(శత్రుంజయుఁడు, భీముఁడు, భైరవుఁడు, కేశవుఁడు, ప్రవేశింతురు)

శార—ఇంతలో నిచ్చటికి స్త్రీ యెచ్చటినుండివచ్చెనని మీరు వింతపడు చున్నారు. పురుషస్వరూపమున నేనే మీరాష్ట్రమునఁ బ్రవేశించితిని. నాయాపదలవలన నేను బురుషస్వరూపమును ధరించితిని గాని మిమ్ము మోసపుచ్చవలయుననికాదు. నేను గాంతనని యెఱుఁగక మీరు నన్ను రాజుగానుండుమని కోరినారు. నే నెన్నివిధముల వలదనినను మీరు వినలేదు. కొంతకాలముమాత్ర ముండుట కంగీకరించితిని. ఆకొంత కాల మిప్పటికిఁ బూర్తియైనది. కావున మీరు మఱియొక రాజును జూచుకొనవలసి యున్నది.

భీమ—అబ్బో! పెద్దచిక్కు తెచ్చిపెట్టినావమ్మా.

కేశ—చిక్కన్నచిక్కా !

శార—ఏమియుఁ జిక్కులేదు. ఈతఁడు నాకొడుకు.

భీమ—కొడుకే ? కొడుకే ?

శార—ఔను. కన్నకొడుకు. ఈతనిని మీరాజుగాఁ జేసికొనఁదగును.

కేశ—మమ్ముఁ జావగొట్టినయాతఁడు మాకు రాజా !

శార—అందువలననే రాజుగాఁ జేసికొనుటకు మఱింత యంగీకరింపవలెను. ఇఱువదియేండ్లైనను నిండని బాలుఁడు నిద్రాహారములులేని ప్రయాణముతో బడలియు న్నప్పుడు మిమ్ము నలుగుఱ నవలీలఁగ గెల్చినవాఁ డెంతపరాక్రమశాలియో యోజించు కొనలేరా—పరాక్రమవంతుఁడగు ప్రభుఁడుండవలయు నుగాదా.

భైర—ఆమాటనిజమే.

శత్రుం— ఆమాట నిజమేకాని నల్వురను గెల్చె యని మీరు చెప్పినమాట నిజముకాదు.

శార—నీ వప్పుడక్కడ లేవుకాఁబోలు క్షమింపుము.

భీమ—అందఱయంగీకారముతోఁ జేసినపనియమ్మా. మేము నల్వుర మొప్పు కొనినంతమాత్రమున సాగదు.

శార—మీరునల్వురు నారాజత్వమున కేలయంగీకరించితిరి ?

భీమ—ఈదినమున మొట్టమొదట నెవఁడు మారాష్ట్రములోనికి వచ్చునో యాత నిని రాజుగాఁ జేసికొందుమని మొదట నందఱుఁ గలసి తీరుమానము చేసికొంటిమి. దాని ననుసరించి—

శార—దాని ననుసరించియే యీతఁడు మీకు రాజని చెప్పుచున్నాను.

భీమ—ఎట్లు ?

శార—ఈతఁడే మీరాష్ట్రములోనికి మొట్టమొదట వచ్చిన పురుషుఁడు. కావున నీతఁడు మీకు రాజు.

భీమ—సరే. ఇది బాగుగనే యున్నది. ఈసారి నందఱు నొప్పుకొనంజేయ వచ్చును. సరే-యీబాబు మాకు రాజు. మీమాటయేమి ?

శార—చెప్పుచున్నాను వినుము. మీరాష్ట్రములోనికి వచ్చిన యాఁడుదానిని జంపవలయునని మీకు శాసనమున్నదని వింటిని నిజమా-కాదా?

భీమ—ఉన్నది.

శార—అందువలన నన్ను మీరు జంపవలయును.

భీమ—సరి సరి. అడుగనక్కరలేదు-చాలు.

శార—మీరు చంపకున్నను నేను మరణించుటకు సిద్ధముగా నున్నాను. మీరు దయయుంచి యెండుకట్టెలను బ్రోగుచేసి చితి నంటింపుడు. ఊ-భీమా ! కేశవా ! మీరిద్దఱు పొండు. కాళికమ్మ గుడివెనుక చితిని నిర్మింపుఁడు.

భీమ—(అప) మిత్రులారా ! ఈమెను మనచేతిమీఁదుగాఁ జంపుట బాగుగా నుండునా ?

భైర—(అప) నేనొక చిన్న కవిత్వకల్పన జేసెదను. ఆచమత్కారమును చూడుడు. (ప్రకాశముగా) అమ్మా ! నీవు మాకు రాజవు కావు. నీయాజ్ఞను విన వలసినపని మాకు లేదు. మాప్రభుఁడీతఁడు. ఈతఁడట్టియాజ్ఞ నిచ్చినయెడల—

భీమ—(తనలో) సెబాష్ ! గట్టిముండకొడుకే.

శార—రాజా ! ఏమందువు?

దేవ—(తనలో) 'నాయనా నీవు మరణింపుము-నేను బ్రదికి బాగుపడెద'నని యెంచి యవసానదశలోనున్న శౌర్యావతారమైన తండ్రిగారిని విడిచి పాఱిపోయి వచ్చిన పరమనిర్భాగ్యుఁడను—నన్నుఁగన్న మాతృదేవతను—ఒక్కకుమారునితోఁ దన బ్రతుకుఁ గడతేఱునని నమ్మియున్న కరుణాస్వరూపురాలగుతల్లిని—గాటిపైఁబెట్టి నిప్పంటింపవలసినదని నా ప్రజకు నే నాజ్ఞాపింపవలసినదా—నారాజత్వము కాలి పోను. నాతనయత్వము దగ్ధముకాను. ఇందుకొఱకేనా నేనుఁ బుట్టితిని! ఇంతమంద భాగ్యుఁడు ప్రపంచమునఁగలఁడా! అయ్యయ్యో—అయ్యయ్యో! ఈదిక్కుమాలిన బ్రతుకునాకేల ? ఛీ. ఛీ. తలఁగొట్టుకొని చావరాదా! చచ్చుప్రాణ మెంతసేపటిలోఁ బోవలయును. ఒక్క కైజారుపోటుతో నంతమెందునే! ఒకసంవత్సరమో, ఒకదినమో, ఒకమాసమో, దిక్కుమాలిన దౌర్భాగ్యపు బ్రతుకు బ్రదుకఁదలఁచి శాశ్వతాప్రతిష్ఠ నొందుదునా—మాతృహంత యనిపించుకొందునా—ఇదిగో (లోపలిదుస్తునుండి కైజారుతీసి) నాపెండ్లిముస్తాబులో మిగిలినది. ఏమైన నగుఁగాక. ఈ త్తరగతులుండనీ—ఊడనీ. హరహరా ! హరహరా! (అంతలో గడగడవడఁకుచు గద్గద స్వరమున) హా తండ్రిగారే! తండ్రిగారే ! ఆ-ఆ-ఆ-ఆ-ఆ-ఆ. (వెఱ్ఱికేకవైచి) మహాదేవశంభూ! మహా దేవశంభూ! (విఱుచుకొని నేలఁబడును)

శార—నాయనా ! అట్లు వడవడ వడఁకుచుంటివేమి? ఆదేమి ఆదేమి—వెఱ్ఱి చూపుఁజూచెదవేమి ? (వీఁపుపైఁ దట్టి) శ్రీరామరక్ష—శ్రీరామరక్ష—

దేవ—అమ్మా ! ఏమియుఁ దొందరలేదు. నాకిప్పుడు స్వస్థతగా నేయున్నది.

(తనలో) నేను జావఁబోవుచుండఁగాఁ దండ్రిగారగపడి చావవలదనునట్లుగాఁ జేయి యడ్డముగా నూపినారు. అలాగే యని యనఁదలఁచి అ-ఆ-అ-ఆ- యని మాత్రమే యని, పైన ననలేక గావుకేకవైచితిని. ఒడలు తెలిసియే యున్నది. అంతయుఁ గనఁ బడుచునేయున్నది. ఆ దేమినింతయో—శత్రుమారణ మొనరింపకుండ నేను మరణించుట తండ్రిగారి యభిమతముకాదు. కాకపోయిన నిప్పుడేని చేయవలసినది! మాతల్లిగారికిఁ జితిఁబేర్పుఁడని నాభటుల కాజ్ఞాపింపవలసినదే. పాషాణమున కైన, వజ్రమున కైన, గొంత మార్దవమున్నదికాని నానాలుకకు లేదే. హా! హా! ఎట్టిప్రాణిగానైనఁ బుట్టవచ్చునుగాని రాజై మాత్రము పుట్టఁగూడదు. తండ్రియనిలేదు. తల్లియనిలేదు. పిల్లయనిలేదు. ఊపిరి విడుచుటకు స్వతంత్రతయైనలేదు. ఎంతపగవానికైన నిట్టి దుర్దశ మువ్వాటికివలదు.

శార—నీకు స్తిమితతగానున్నది కావున నన్నుఁగూర్చి నీభటుల కాజ్ఞాపింపుము.

దేవ—నేనుబుట్టిన దండుకొలకేకదా—భటులారా! ఇచ్చటకువచ్చిన స్త్రీని జంపవలయుశాసన మింతటినుండి రద్దుపఱచితిని. ఇప్పటికీశాసనము తప్పక గౌర—వింపఁబడవలసినదే—

శార—సెబాస్! నీకుల దేవతలు నిన్ను రక్షింతురుగాక. నీపెద్దల శౌర్యసంపద నీయందుఁ బ్రకాశించుఁగాక! భూసురాశీర్వాదములు నిన్ననుసరించుగాక! భీమన్నా! కేశవా! మీరిఁకఁబోయి మహాసంతోషమున నగ్నిఁ బ్రజ్వలింపఁజేయుఁడు.

అందఱు—రాజా! సెలవు.

దేవ—(తలయూపును)

శార—నాతండ్రీ! విచారింపకుము. వీరిని బహుజాగరూకతతోఁ బరిపాలింపుము. బ్రాహ్మణదంపతులని చెప్పితివే, వారి నెట్లైన నిటకుఁ బిలిపింపుము.

దేవ—ఎందులకు?

శార—మొదటిది, వారుండిన నీకుఁ దల్లిదండ్రు లున్నట్లేయుండును. రెండవది, ఇంతటినుండి తల్లిదండ్రుల యుత్తరక్రియలొనర్పవలసినవాఁడవు కావున వారి సాహాయ్యము నీకుఁ గావలసియున్నది. నాయనా! మరియొక్కసంగతి. నీ వెట్లైన వరాహపురరాజుకూఁతునే చేసికొనవలయును సుమా.

దేవ—ఏల!

శార—అట్లుచేసినగాని యారాజునకు శృంగభంగముకాదు. అది నాయభిమతము.

దేవ—అమ్మా! అలాగే ప్రయత్నించెదను.

శార—చూడు నాయనా! అదిగో! ఆ యుదయించుచున్న పూర్ణచంద్రునివలె హవ్యవాహనుఁ డెంతహృదయంగమముగాఁ బ్రజ్వలించుచున్నాఁడో నాతండ్రీ! (కౌఁగిలించుకొని) దైవమును మఱువకుము. సత్యమును మఱువకుము. తల్లిదండ్రులను మఱువకుము. ఆపత్కాలమున రక్షించిన బ్రాహ్మణదంపతులను మఱువకుము. ప్రజల సౌఖ్యమును మఱువకుము.

దేవ—(తల్లికిఁ బ్రదక్షిణముచేసి) మాతృభ్యోన్నమః.

శార—చాలు మఱియొకసారి ప్రదక్షిణము చేయనక్కఱలేదు.

దేవ—తండ్రిగారు నన్ను వెలుపలికిఁ ద్రోచివైచుటచేత నాయనకు నమస్కరించు భాగ్యము లేకపోయినది. ఆలోపము నిప్పు డిక్కడఁ దీర్పవలసియున్నది.

(నేపథ్యమున) జయా దుర్గా—భవానీ! త్రిపురసుందరీ—

శార—వింటివా భటులెంత యుత్సాహమునఁ గేకలిడుచున్నారో? నాయనా! మనముగూడ శక్తినిఁ బ్రార్థించుచు నక్కడికిఁ బోవుదము రమ్ము. జయా దుర్గా శాంభవీ! బాలాత్రిపురసుందరీ!

దేవ—జయా సర్వమంగళా! జయా కాత్యాయనీ!

(ఇద్దఱు నిష్క్రమింతురు.)

ఇది తృతీయాంకము.

శ్రీ

# పూర్ణిమ

---

## చతుర్థాంకము.

---

ప్రదేశము—వరాహపురమున నుద్యానవనము.

ప్రవేశము—సర్వమంగళ, కాత్యాయని.

కాత్యా—సర్వమంగళా! గుట్టుగల నీమనస్సెంతదాఁచినను నేను గొన్నిమాసములక్రిందటనే యెఱుఁగకపోలేదు. కాని యిప్పుడు మఱింత స్పష్టముగఁ దెలిసినది.

సర్వ—కాత్యాయనీ! నేనుమాత్రము హృదయరసము లేనిదాననా! మాతండ్రిగారికి, వారికి విరోధముండిన నుండుఁగాక. రాజులలో నన్యోన్యమత్సరత లేనివారెవ్వరు! ఆశత్రుత్వమువలననే నాతఁడు వధ్యుఁడని చెప్పుదునా?

కాత్యా—అమ్మా! భర్తృదారికా! పోని, వధ్యుఁడే యనుకో. బహిరంగముగా భండనమున బ్రాణహరణము చేయవచ్చునుగదా.

సర్వ—ఈకాలమునఁ గేవలధర్మయుద్ధము లెచ్చటజరుగుచున్నవిలే. ఏదో—

కాత్యా—కూఁతుపెండ్లియని ప్రచురించి వైవాహిక సర్వసన్నాహములుచేయించి మంగళవాద్యముల నడుమను బవిత్ర వేదమంత్రఘోషములనడుమను వియ్యంకునిజంపి, కూఁతుమగని గొంతుకోయుట కూహించిన రాజుచరిత్రము మన రాజపుత్రాస్థానచరిత్రమునకు మచ్చకాదా! ఆర్యావర్తచరిత్రమున కప్రతిష్ఠావిషయముకాదా. ఆఁడుదాని మర్యాదయనఁగఁ దా నేమనుకొనినాఁడో అందులోఁ గడుపునఁబుట్టిన బిడ్డయే. మహాభిమానవతియే. సర్వసద్గుణసంపన్నయే.

సర్వ—అందుకొఱకే నేను విచారించుచున్నాను. నాపేరెత్తకుండినయెడల నాకీ చింత లేకుండునుగదా. ఎవ్వరినెవ్వరు చంపినను నాకుఁదెలియవలసిన యావశ్యకము లేదుగదా.

కాత్యా—అమ్మా! చింతయని సామాన్యముగా ననుచున్నావు. నావంటిదానికే కడుపుచుఱచుఱలాడుచున్నదే. హృదయము దహించుకొనిపోవుచున్నదే. బంగారమువంటి ప్రాయమువచ్చినదానవు; దివ్యమంగళ విగ్రహమవు. కల్యాణాపేక్షఁగలదానవు. శుభమో శుభమో యని కోటలోను బట్టణములోను మహోత్సాహము గాలివలె నెడములేకుండ వ్యాపించియుండఁగాఁ బెండ్లియరఁగుమీద భూశయనములా! సావిత్రీవిలాసములో శవకలాపములా! వియ్యంకుని రక్తముతో వేఁడుకవసంతములా!

సర్వ—కాత్యాయనీ! నాకొడలు జలదరించుచున్నది. పోనిమ్మా.

కాత్యా—అలాగేనమ్మా! పోనీయక పట్టుకొనినవారెవ్వరు? నాకుఁగలిగిన పెద్దపుట్టిమునక యేమనగా. నిది నీకేమియశుభప్రదమగునో యని—ఆసర్వమంగళాదేవియే,

నీవు సర్వమంగళప్రదాత్రియగుఁగాక. పురోహితుని భార్యనుగావున నిట్లు దీవులాడు చున్నాను. అమ్మా! మీగుమ్మానికిఁ బచ్చతోరణము గట్టుకొన్నప్పుడేకదాఁ గ్రొత్త పట్టుచీర నేను గట్టుకొనుట—

సర్వ—ఇప్పుడు జరుగుచున్న విజయోత్సవములలో నీవు మాయమ్మగారు మంచి చీరనీయలేదా ?

కాత్యా—ఇఁకముందిచ్చెదరేమో! కాని యీ విజయోత్సవములేమి ? ఈ యుద్యానవనమున నిన్నిదినములనుండి తెలిపిలేని సంతర్పణములేమి ? మంగళవాద్యము లేమి? కవినిర్భాగ్యుల కర్ణామృతశ్లోకములేమి. ఇదివఱకు జరిగించిన రహస్యవధమును గ్రమ్ముకొనక యీసంతసాటి వీరావేశములేమి; పైరాజపుత్రులు విందురేమో యను సంశయ మక్కఱలేదా !

సర్వ—చూడు కాత్యాయనీ! ఆరాజపుత్రుఁడు మరణించెనని కొందఱు చెప్పు దురు. సంఘమరణమును దప్పించుకొని పోటి పాఱిపోయెనని కొందఱు చెప్పుదురు. నిజమేది ?

కాత్యా—ఏరాజపుత్రుఁడు? నీ తండ్రిగారి యల్లుఁడేనా?

సర్వ—పరిహాసమేల ?

కాత్యా—అటులైన మీమామగారికొడుకా ? అతఁడు మరణింపలేదు; పాఱి పోయినాఁడు.

సర్వ—పాపము. సురక్షితుఁడైయున్నాఁడో_లేఁడో.

కాత్యా—అతనిని మీరు తడకచాటుననుండియైనఁజూచితిరా.

సర్వ—చూడవలయునని చూడలేదుసుమా. యథాలాభముగాఁ జూచుచుండఁగా నదిగో పెండ్లికొడుకని దగ్గఱనున్న వారెవ్వరో చెప్పినారు. ఆరాత్రి వారు కోటలోనికిఁ బ్రవేశించుచుండఁగానే చూచితిని.

కాత్యా—అంతమముం దాతనినుగుణగణ మనేకపర్యాయములు వినియేయుం టిని. ఇప్పుడు భర్తగారిని జూచుటకూడ సిద్ధించెను.

సర్వ—ఏమియులేనిదే యట్లనుట తప్పుకాదా?

కాత్యా—తప్పోయొప్పో నేనేమిచేయఁగలను. నేనుదెచ్చిపెట్టినదికాదు. మీ తండ్రిగారు పెండ్లివారికివ్రాయించిన శుభలేఖలున్నవి. పెండ్లివారు వారి బంధువులకు వ్రాయించిన శుభలేఖలున్నవి. ఉండక యెగిరిపోవునాయేమి? రాజపుత్రాస్థానమంతయు వెల్లడియైనది. పేకజువ్వలీవార్తను పైలోకమందుఁగూడ వ్యాపింపఁజేసినవి. ఇప్పుడిది జరుగలేదని యెవ్వరు చెప్పగలరు! చెప్పిన నెవ్వరునమ్ముదురు! పెండ్లియైనదనియే జనులం దఱునమ్మకము. కావున దేవరాజుభార్య సర్వమంగళయే యను పేరుమాత్రము తప్పదు. అట్లుకాదని చరిత్రకారుఁడెవ్వఁడైన ముందు వ్రాసినను వాని నవిమర్శకుఁడని యందుర్రు. కాక కవియెవ్వఁడైన నాటకమొకదానిని—

సర్వ—కవుల నాటకపు వ్రాతలనుబట్టి చరిత్రసత్యమెప్పుడు గ్రహించునులే.

కాత్యా—ఏదియెటులైనను నీవింకఁ జిన్నదానవగుటచేత నెఱుఁగవు. లోకము

మిక్కిలి చెడ్డది. ఎంతసేపు జబ్బుమాటలే వ్యాపింపఁజేయును. పెండ్లి యింకఁ గాకుండఁగనే పెండ్లివారినందఱను జంపినారో, పెండ్లిపూర్తియైనతరువాత గంకణాలమహోత్సవము కూడ నైనతరువాతఁ బెండ్లివారిని జంపినారో కాని ప్రజకు నిందావాక్యమునందు విశ్వాసమెక్కువ. నీవు దేవరాజుతో నగరుపెండ్లియైనదనియు నిన్ను వెంటనే యత్తవారింటికి దీసికొనిపోవుటకు నీమామగారు ప్రయత్నింపఁగా నీతండ్రి వీలులేదని యన్నాఁడనియు నందుపైఁ గలహము పెరిగినదనియు నింతమునిఁగినదనియు మనకు నాల్గుక్రోశముల దూరములోవారు చెప్పుకొనుచున్నట్లు నేను వింటిని.

సర్వ—అయ్యయ్యో! ఆలాగా?

కౌత్యా—కాదా—రాజులకువచ్చిన పెద్దయల్లరి యిదియేకదా. రాజుగారు తలయెత్తి—నవ్వనుగూడనక్కఱలేదుసుమా—దాసిదానితో మాటలాడగా నుత్తరక్షణమున మందబయటిలో, సంతపాటిలో, దేవాలయములో రాజుగారు పదునలుగురుదాసీల నుంచుకొన్నారనియు, భార్యను వదలివైచినారనియు, రాజ్యము దాసీలకుఁ బంచియిచ్చుట కాలోచించుచున్నారనియు జనులు గుసగుసలు, వెకవెకలు, చొఁచొఁ చొఁలు. అయినను పురుషులే యదృష్టవంతులమ్మా — పురుషులమర్యాదలోఁ గొంచెము పెంకితనము, సాఁగుడు నున్నది కాని యాఁడుదానిమర్యాదమాత్రము—హరహరా—అంత అసాధ్యవస్తువు ప్రపంచమున మఱియొకటి లేదు. ఉఫ్ మనుసరికి టఫ్. పెండ్లికొడుకని పెండ్లికూఁతురని దేవరాజు నీవు కోటలో నున్నప్పుడు—ఈసంగతి హిమాలయము మొదలు సింహళమువఱకు వ్యాపించినప్పుడు—వెఱ్ఱిదానా! లోకమునకింకఁ దరువాయి యేమి యుండును?

సర్వ—పోనీ, నాకింకఁ బెండ్లియే యక్కఱలేదు.

కౌత్యా—అక్కఱలేకేమి? చంద్రబింబమువంటి దేవరాజు దాటిపోయినప్పుడు మంచిచెడ్డలెఱుఁగని, పేరుప్రతిష్ఠలేని, ప్రేలుచెవుల, చొల్లునోటి డూ డూ బసవన్న దొరప్రక్కలోనికి సిద్ధమైన వినియోగమేమున్నది?

సర్వ—కౌత్యాయని! ఆమాటయెందులకుగాని—నీవు దేవరాజును జూచితివా?

కౌత్యా—ఆతనిని నే నెఱుఁగుదును.

సర్వ—ఎట్లు?

కౌత్యా—ఆతఁడు నాకొడుకగుటచే.

సర్వ—మఱింత తెలియనిమాటఁ జెప్పినావు.

కౌత్యా—నీకాతనియందుగల యనురాగ మవ్యాజమని యెఱిఁగియుండుటచే యథార్థమును జెప్పుచున్నాను. ఆతఁడు పాఱిపోవుచు మాయింటఁ బ్రవేశించినాఁడు. నీకొఱకే యాతనికి నేనభయమిచ్చితిని.

సర్వ—నీవే యభయమిచ్చితివా! నిజముగానే!! నీభర్త యెఱుఁగునా?

కౌత్యా—ఎఱుఁగును. ఆతఁడుకూడ దేవరాజునాదరించి యాతిథ్యమిచ్చినాఁడు.

సర్వ—ఈయంశము మాతండ్రిగారికిఁ దెలియునెడల మీ కుపద్రవము కలుగదా?

కౌత్స్యా—కలుగవలసి యుండునెడలఁ గలుగును. నీవు మాయెడల నభిమానము గలదానవైనచో నట్టి యాపద తొలఁగిపోఁగూడదా—

సర్వ—అయ్యయ్యో! ఇంతకంటెఁ గావలసినదేమి? నే నేమైన సాహాయ్యము మీకుఁ జేయగలిగియుందునా?

కౌత్స్యా—చేయగలిగియుండునెడలఁ జేయుదువుగద.

సర్వ—నాకది సంతోషప్రదమే కాదా—కాని మాతండ్రిగా రొకవేళ మిమ్ము వెడలఁగొట్టునెడల మీ రెచ్చటికైనఁ బోవలసివచ్చును గాఁబోలు!

కౌత్స్యా—పోక తప్పునా.

సర్వ—ఎచ్చటికి?

కౌత్స్యా— దేవరాజున్నచోటికే పోవలయుననుకొందును. కాని స్వామిగారి యూహ యెట్లుండునో తెలియదు.

సర్వ—దేవరా జెక్కడ నున్నాఁడో నీకుఁ దెలియునా?

కౌత్స్యా—ఇప్పటివఱకుఁ దెలియదు.

సర్వ—నాతండ్రిగారు చండశాసనుఁడు. ఏమిచేయుదురో! చూడు! అదిగో! మాటలోనే ఆయన సేనాధిపతితో మాటలాడుచు నిటకే వచ్చుచున్నాఁడు కాఁబోలును. మన మోసరిల్లిపోవుదమురా. (ఇద్దఱు నొకప్రక్కనుండి నిష్క్రమింపఁగా సోమనాథేశ్వరుఁడు శ్రీకంఠదాసుఁడు మఱియొకప్రక్కనుండి వెంటనే ప్రవేశింతురు)

సోమ—శ్రీకంఠదాసా! నా కప్పుడే యేల చెప్పకపోయితివి?

శ్రీకం— ఏదీ—ఆసాయంకాలముననేకదా విజయరావు రాజ్యస్థానమునకుఁ దమ యత్యంతావశ్యాజ్ఞ ననుసరించి పోయితిని. అచ్చటి వ్యవహారములు చక్కఁబెట్టుకొని యిప్పుడేకదా వచ్చితిని. ఇప్పుడు చెప్పితిని కాదా.

సోమ—ఎంతతొందరతో నీవు పోవువాఁడవైనను దేవరాజువంటివాఁడు పురోహితునింటిలో నున్నాఁడని నాచెవిని రవంత వేయుటకు నీ కవకాశము లేకుండెనా? నీవు వచ్చుటకు వీలులేకుండినయెడల నెవ్వరిచేనైనను వార్తనంపింపవచ్చునే. వార్తనంపఁదగని యంశమని నీకుఁ దోఁచినయెడలఁ జిన్ని లేఖఁ బంపవచ్చునే. వీనిలో నేదియుఁ జేయకుండఁ దుట్టున బరుగెత్తితివా—మనకుఁ బ్రబలశత్రుఁడు మన పురోహితనిర్భాగ్యునింటిలో నుండఁగా నింతకంటె ముఖ్యతరమైన రాజవ్యవహారము మఱియేమియున్నది.

శ్రీకం—ప్రభునితో సత్యము మనవిచేయుచున్నాను. అతఁడు దేవరాజను సందేహము నాకుఁ బూర్ణముగా నశించిన హేతువుచే లక్ష్యము చేయలేదు. అందుచే మీతో జెప్పలేదు.

సోమ—పోనీ. చెప్పనివాఁడ వూరకుండక యిప్పు డెవ్వరడిగినారని చెప్పితివి?

శ్రీకం—ఆ దినచర్యానివేదనము మీకింక బాకీయుండుటచేత నిప్పుడుచెప్పవలసి వచ్చినది.

సోమ—ఓమందబుద్ధీ! ఇప్పుడు చెప్పిన వినియోగమేమి? ఇప్పుడేడ్చిన లాభమేమున్నది? మొత్తుకొనిన వినియోగ మేమున్నది? నీమూలమున నా విజయసంపూర్ణ

తవ భంగము కలిగినదికదా. ఇందులకు నీవేల శిక్షాపాత్రుఁడవు కావో చెప్పవలసి యున్నది. అయ్యయ్యో! చేతఁ జిక్కినవాఁడు చేయిదాఁటి పోయినాఁడే. ఇదివఱ కాతనిని మోసపెట్టితిని. కాని యిఁక మోసపెట్టఁగలనా! తిరుగ నాతఁడు నాకెట్లు దొరకును? దొరకకుండనున్నంతకాల మీక్షోభము నొందుచుండవలసినదేనా?

శ్రీకం—క్షమింపవేఁడుచున్నాను. తొందరలో నేనింత యాలోచింపలేదు.

సోమ—క్షమింపుమని యెంతసులభముగాఁ జెప్పినావు. క్షమాపణతోఁ బరిశుద్ధపత్రిక నొందఁదలఁచితివి కాఁబోలు. తిరుగ యుద్ధమగునెడల నీబుద్ధిహీనతచే నారాజ్యమున కెన్నిలక్షల పైకము దండుగ వచ్చునో చూడు. ఎంతప్రాణహాని తిరుగఁగావలసి యున్నదో చూడు. నేను క్షమించినను తిరుగ నంతసొమ్ము సమకూర్పవలసిన రైతులు నిన్నువధింతురుగాని క్షమింతురా! యుద్ధములోఁ జావవలసిన యనేక యోధులు బంధుసహితముగ నిన్నేనుఁగుకాలిక్రింద ద్రొక్కింతురు కాని క్షమింతురా? నా గొంతుకకురిత్రాడుదగిల్చి నన్ను క్షమింపుమని వేఁడుచుంటివా! అయ్యయ్యో! ఇప్పుడా చెప్పితివి. అప్పుడే చెప్పినయెడలఁ బురోహితరాక్షసు నింటిలోనే శివార్చనపు టరుఁగు మీదనే దేవరాజును ముక్కలక్రిందఁ గోసియుందునే. పురోహితునిఁ దలక్రిందుగ వ్రేలాడఁగట్టించి క్రిందమంటలుపెట్టించియుందునే. హా! ఎంతపనిచేసితివి. మూర్ఖా! నాసొమ్మదినుచు నాకొంపఁగూల్చితివే. నీవును బురోహితుఁడును గలిసియే దేవరాజు నచ్చట దాచిరేమో! నాకట్టిసందేహమున్నది. నీవేమి ప్రత్యుత్తరమిచ్చెదవు.

శ్రీకం—తొందరపడకుఁడు. అట్లు నేను జేసినవాఁడనై యుండునెడల నీసంగతి మీతో నేల చెప్పియుందును?

సోమ—చెప్పితివి.—అబ్బా—చెప్పితివి. మిగుల గొప్పపనిఁ జేసితివి. నాసొమ్ము చిరకాల మనుభవించినందుల కీమాత్రపుమహోపకార మొనర్చితివి. ఈవార్తకై నీపై దేవతలు పుష్పవృష్టిగురియవలసినది. ఈసంగతి నేనేల చెప్పియుందునని తిరుగనన్నుఁ బ్రశ్నింతువా? నీకు వానికిఁ దర్వాత నేమిచెడినదో—ఎందులకుమీకు భేదబుద్ధియంకురించినదో—ఈసంగతి యేలాగునైన నాకుఁ దెలియక తప్పదుకదాయని యెంచి నేరమంతయు నాతనిపై మోపుటకు నీవిట్లు చెప్పుచున్నావేమో! నీవు ధారాళబుద్ధిగలవాఁడవైయుండినయెడల నీకీసంగతి తెలిసినతోడనే నీవాతనిని దీసికొని నాయొద్దకుఁ బరుగెత్తుకొనివచ్చియుందువు. అట్లు నీవు చేయలేదు. ఆ యుపేక్షయే సర్వసందేహములకుఁ దావలమై యున్నది. ఏమిచెప్పెదువు?

శ్రీకం—హరహరా! నేనుజేసిన యుపేక్ష యేదియులేదు. నాపనియేదో నేనాచరించుకొనుచు మీకార్యమునం దలక్ష్యముగ నుండలేదు. మీపనియే చేసితినికాదా.

సోమ—ఊఁ. ఆసంగతి తిరుగ నేలచెప్పెదవు? వదఱుపోఁతా! అవిధేయుఁడా! జాగ్రత్త.

శ్రీకం—జాగ్రత్తయనెదరేమి? మీకధికారమున్నది కావున—నేను నేరము జేసినట్లు మీకుఁ దోఁచినది. కావున—శిక్షింపుఁడు. అంతేకాని యూరక నిందావాక్యములేల?

సోమ—ఊరకయా! ఊరకయా! నాశత్రువు నొకబ్రాహ్మణాధమునితోఁ

గుట్టచేసి రక్షించినప్పటికి నూరకయే—ఊ. నాశత్రువును మీ మిత్రునిగ భావించి యాతనిని దిరుగ నాపైదండెత్తునట్లు చేసినప్పటికి నూరకయే—నారాజ్యమిట్లు విశ్వాస ద్రోహముతో శత్రుపీడాకరమగునట్లు చేసినప్పటికి నూరకయే—కృతఘ్నుఁడవై నాగొంతు నీవిట్లు కోసినప్పటి కూరకయే. ఇదియేనీకూరకగాఁ గానబడునప్పుడు నీకుపద్రవముగా దోఁచునదేదీ ! నాయాపద నీకుఁ బరమలఘువుగా నున్నదా! నాసొమ్ము నీకు విషమైనది. నీవు రాజద్రోహివి. శిక్షార్హుఁడవు.

శ్రీకం—అందుకొఱకే శిక్షింపుఁడు. ఇంతకాలము సేవించిన నాతత్త్వమును గని పట్టఁజాలని మీయొద్దనింతవఱకున్నందులకు నాకుఁ బ్రాయశ్చిత్తము కావలసినది కాదా. నేను మఱియొకసారి చెప్పుచున్నాను. మీరు తప్పుటభిప్రాయము నొందుచున్నారు. నేను బురోహితునితోఁగలసి మీశత్రురక్షణ మొనర్పలేదు. భవానీపాదములతోడు—మీరు నమ్మినసరే; నమ్మకున్నసరే.

సోమ—నేను నీప్రమాణముల నమ్మను. నాయోగ్యతచే నమ్మితినే యనుకో. నాశత్రువున కభయమిచ్చిన బ్రాహ్మణవిశ్వాసఘాతకునికంటె దద్రహస్యమెఱిఁగియుం డియు శత్రుమారణ ముపేక్షించిన నీవెట్లు యోగ్యుఁడవు ! అంతకంటెదుష్టుఁడెవ్వఁడు. దొంగ యని యెఱిఁగియుండి, పట్టుకొనుట కవకాశముండియు నూరకుండిన రక్షకభటుఁడు దొంగకంటె దుష్టుఁడు కాఁడా. నీకు శిక్ష కావలసినదే. భటులారా ! రండు.

(ఇద్దఱుభటులు కత్తులతోఁ బ్రవేశింతురు.)

సోమ—భటులారా ! ఈతనిఁ జెఱసాలలో నుంపుఁడు; నీతోఁ జెప్పుచున్నాను వినుము. దేవరాజును నాకప్పఁజెప్పు భారము నీపై నున్నది. ఇప్పటికైన నిన్ను క్షమింతును. ఆతఁ డెక్కడనున్నాఁడో నీవెఱిఁగియుండినయెడలఁ జెప్పుము. ఆతఁడు నీకాళులపైఁ బడుటచేతనో, తండ్రిచచ్చి యేడ్చుచున్న బాలునిపై నీకు దయగలిగియో యాతనిని నీ వుపేక్షించియుందువు. కాదాచిత్కముగ నట్టికరుణ నీరసహృదయులకు శత్రువులపైఁ గలుగుట యచ్చటచ్చట నుండవచ్చును.

శ్రీకం— నేను నీరసహృదయుఁడనా! ఎన్నియుద్ధములందు నీకు విజయముఁ జేకూర్పలేదు. నీరసహృదయుఁడనా—మొన్నజరిగిన మహాలయకళ్యాణములో రెండు వందల జనమునకుఁ దక్క వగా నేను జంపలేదే! నేను నీరసహృదయుఁడనా? వెనుక చేసిన సేవలన్నియు దిగదుడుచుకొని పోయినవా ? దగ్ధమైపోయినవా ? అంతంత మహాకార్యములు చేసినప్పుడు బహుమానము లేదేమి? సంతోషపూర్వకమైన శిరఃకంపనమైన లేదేమి ? ఇప్పుడుతిట్లా ? శిక్షలా ? చెఱసాలలా ? ఏదో గవ్వంతలోపము కలిగినదనియా ? ముందుఁ జెప్పవలసినది వెనుకఁ జెప్పితిననియా ? ఏమిసరసుఁడవు ! ఏమి యింగితజ్ఞుఁడవు ! ఏమిప్రభుఁడవు.

సోమ—చంపెదను. జాగ్రత్త !

శ్రీకం—అంత ప్రయోజకుఁడవగునెడలఁగాని—వలదన్నవారెవ్వరు. చావునకు భయపడినవాఁడనైనయెడల సేనాధిపత్యమేల చేయుచుంటిని. అనేకపర్యాయములు శత్రుకరములఁ జిక్కఁబోయిన నిన్ను ఫిరంగిగుండ్లకుజంకక యేలరక్షించియుంటిని. నేను

చావునకు భయపడినవాఁడవై యుండినయెడల నీవిప్పుడిట్లనుట తటస్థించియుండదే. నేను నిన్నుఁ జంపనక్కఱలేదు. నీవు నన్ను జంపనక్కఱలేదు. సేవకుల శక్తియోగ్యతల నెఱుఁగని నీవంటిప్రభుని సృష్టించినందులకు నిట్టివానియొద్ద నావంటివానిని సేవకునిగాఁ గూర్చినందులకుఁ జేతనైనయెడల బ్రహ్మదేవునిఁ జంపవలసినది. నీవంటివారు నావంటివారెందఱుజచ్చిన లోకమునకు నష్టము! ఇప్పటిబ్రహ్మను జంపినయెడల భవిష్యద్బ్రహ్మ విశ్వాసవంతులైన రాజులను సృష్టించునేమో. భటులారా! ముందునడువుఁడు. నన్నుఁ జెఱసాలలోనికిఁగొనిపోవుఁడు. (శ్రీకంఠదాసుఁడు భటులతో నిష్క్రమించును.)

సోమ — పో. నిర్భాగ్యపు ముండకొడుక — చావు. కారాగృహములోనే చావు. మేమే సమర్థులము. రాజునకుఁ బ్రతిష్ఠఁ దెచ్చుచున్నామనియును, మేమే శౌర్యవంతులము. రాజునకు విజయము చేకూర్చుచున్నామనియును, మేమే వ్యవహారజ్ఞులము. రాజునకు రాజకార్యనిర్వహణ మొనర్చుచున్నామనియును దెగనీలుగు పెద్దయుద్యోగుల నప్పుడప్పుడు సాగఁదీసి పరాభవించుచుండినయెడలఁగాని మిగిలినవారికి బుద్ధిరాదు. నావలననే పనిజరుగుచున్నదని బానిసవానికైన గనులు నెత్తిమీఁదికి రానీయఁగూడదు. తలతిరుగు డారంభమగుసరికి 'పెడీ'మని బ్రహ్మరంధ్రస్థానమునఁ బైజారు దీసికొని బజాయింపవలసినదే. రాజతంత్రమున నొకనివలననే యంతపనియు జరుగుచున్నదన్నమాటయేమి? గడియారమునఁ జిన్నమరమేకెంతో పెద్దచక్రము నంతే. చక్రము తిరుగుటకై మరమేకును సర్దవలెను. మరమేకుబిగికై చక్రమును సర్దవలెను. ఆస్థానతంత్రమున ప్రధానుఁ డొక్కటియే; బానిసయు నొక్కటియే. ప్రధానునకు బుద్ధి వచ్చుట కొకప్పుడు బానిసను దన్నవలయును. బానిసకుఁ బుద్ధివచ్చుటకై ప్రధానునొకప్పుడు తన్నవలయును. మొత్తముమీఁద కొఱడా చేతఁబుచ్చుకొన్నగాని వ్యవహారము కళకుగా నుండదు. కోతిముండకొడుకులు! పక్షప్రాయశ్చిత్తమని, వారప్రాయశ్చిత్తమని, మాసప్రాయశ్చిత్తమని పదేపదే తగిలించుచుండవలెను. రాజు కఠినత వదలినయెడల మాత్రము కార్యమేమియు లేదు. కొండెమాడిన తేలు కుమ్మరిపురుగు. పండ్లూడిన పాము పలుపుత్రాడు. మా యోగ్యతను భటులు యోగ్యతగా భావింతురా! ఊహూ. చేతఁగానితనముగా భావింతురు. మా శాంతిని చచ్చుఁదనముగాఁ భావింతురు. మేము వట్టి మట్టిముద్దలమని యెంచి మాయొఱగులు దిద్దుట కారంభింతురు. మావంకలు సరిచేయఁబూనుదురు. మామాటలకుఁ దమకూఁతలతో రసపుష్టి కలుఁగజేయుటకు మొదలిడుదురు. మానవ్వులను వారే నవ్వుదురు. మే మీయవలసిన యాజ్ఞలను దామే యిచ్చుట కుపక్రమింతురు. మే మూరక నైవేద్యనష్టవిగ్రహములని యెంచి యొకవంకఁ జెవిత్రిప్పి యొకవంకఁ బృష్ఠము ద్రిప్ప సాహసింతురు. వీఁపుమీఁద రామరావణ యుద్ధము జరిగింతురు. వేరులేని వృక్షములకు గింజలేని పండు పుట్టించి నోరులేని చిలుకచేతఁ గొఱికింతురు. అబ్బ-అబ్బ ఎవ్వరిని నమ్మఁదగదు. ఎంతసేపు బడితెబాజా చాణక్యనీతి దీనికందదు. దీనికిఁజాలిన రాజనీతిశాస్త్రము మఱియొకటి లేదు. కాకపోయిన నాపురోహితుఁడెక్కడ! నా ప్రబలశత్రుఁడైన దేవరాజును దన యింట దాఁచుటెక్కడ! ఎవఁడురా అక్కడ?

(నేపథ్యమున) మహాప్రభూ ! సేనాధిపతి చెఱసాలలోఁ బ్రవేశించినాఁడు. తిరుగ నేమిసెలవు ?

సోమ—పురోహితు నిట్లుఁ బంపుము.

(నేపథ్యమున) చిత్తము.

సోమ—ఈసేనాపతి లేనంతమాత్రమున నిప్పుడువచ్చిన నష్టమేమున్నది. ఆతని స్థానమున మఱియొకని నియమింపవచ్చును. అదిగాక మిగిలినవారింక నలుగురున్నారు కదా—రాజ్యముపోయి, తండ్రిపోయిన దేవరాజు బ్రతికియుండినయెడలఁ దిరుగ నెంత కాలమునకోగాని యింతటఁ దలయెత్తఁగలఁడా. అప్పటి కేదైన నొక మాయాతంత్రము జతపడక యుండునా.

(చంద్రశేఖరస్వామి ప్రవేశించును.)

సోమ—(లేచి) ఓమ్ గురుభ్యోనమః—శ్రీపరమగురుభ్యోనమః హె - హె - హె- (వికటముగా నవ్వును)

చంద్ర—(తనలో)

గీ. చుంబనముసేయఁ గరువంగఁ, ♦ జూచుఁ ద్రాఁచు
చెవులు నికిలించుఁ దన్ననెం ♦ చినహయంబు
సాపడఁగనున్న మొసలి ♦ బాష్పముల విడుచుఁ
గొట్టుటకుముందు నవ్వును ♦ గోపనుండు.

ఈపూట నాకు దేవాదేవేషుతప్పదు. కాని-కానున్నది కాకమానునా!

గీ. ధరణిపతియన్నమెట్టులో ♦ తన్ను నల్లె
ప్రభునిబట్టయెట్టిదో చేతి ♦ బడితే యల్లె
కువలయేశుని పెట్టెట్లొ ♦ కొట్టునల్లె
అద్ది గ్రహియించి యిది వల ♦ దనుటతగునె!

సోమ—శ్రీమచ్ఛంద్రశేఖరభగవాత్పాదాచార్యేభ్యోనమః—ఏదీ ఒక్క ఆశీర్వాచనపుఁబనస ! శతంజీవే-ఏదీ.

చంద్ర—'శతంజీవే' [అని చదువును]

సోమ—ఎవఁడురా శతంజీవే—నేనా, దేవరాజా ? ఓిగొంతుకగొయ్య. ఆఁ! ఎవఁడురా అక్కడ. (ఇద్దరుఊభటులు ప్రవేశింతురు) భటులారా ! వానిచెవులు పట్టుకొనుడు.

(ఇద్దఱు చెఱియొక చెవి పట్టుకొందురు)

సోమ—జోకొయించుఁడు. వెనుకకు ముందున కీడ్చుఁడు. అలాగున-అదిగో అలాగున-భటులారా! వానిచెవుల కుండలముల లాగివేయుఁడు. సీలలు త్రిప్పుటకాదు- చెవులఁ ద్రెంపుఁడు.

చంద్ర—హరహరా—హరహరా (చెవుల సీలలు త్రిప్పి కుండలములుతీసి) బ్రాహ్మణమేధములో సోమయాజివగు నీకా కుండలములు తగినవి ! రాజేంద్రా ! ధరింపుము— (అని రాజునెదుటఁ బెట్టును.)

సోమ—బ్రాహ్మణమేధ మింకనేది? నిన్నెవఁగు చేతఁ ద్రొక్కింపక మానుదునా. నీమాంసమును వండించి నావేఁటకుక్కలకు పెట్టింపనివేళయైనదా—ఏదీ, ఆశ్లోకము—విశ్వాసఘాతుకుని మాంసము కుక్కలైన స్పృశింపవనుశ్లోకము నిజమగునో కాదో చూడక మానుదునా—నీకు నాచేతిలోఁ జావు నిశ్చయము. సేనాధిపతియంతవానికే లెక్కలేదు కాని—

చంద్ర—హరహరా—సేనాధిపతిని జంపించితివాయేమి ?

సోమ—శిరఃఖండన మహోత్సవమునకు ముహూర్త ముంచుటకే నిన్ను రమ్మంటిని. తారాబలచంద్రబలములు కుదిరినయెడల నీశుభకార్యముకూడఁ బనిలోపని జరిగింపఁ దలంచితిని. నేను వెఱ్ఱిపడితిని గాని నీకు దారామైత్రి కుదురనియెడల మీరిద్దఱు గలిసి కుట్రచేసి దేవరాజున కభయమిచ్చి యేలరక్షించియుందురు! మీయిద్దఱ కొక్కముహూర్తము చాలు—భటులారా ! యీకుండలములు చెఱియొకటి దీసికొనుఁడు- నేను రమ్మన్నప్పుడు రావచ్చును పొండు.

భటులు—(నిష్క్రమింతురు.)

చంద్ర—ఇప్పుడు మీరన్న నేరమునకే సేనాపతిని చెఱసాలలో నుంచినయెడల నాతనిని వెంటనే విముక్తునిగాఁ జేయుఁడు.

సోమ—నీకుఁ బ్రధానత్వముకూడ నీయనక్కరలేదేమి ? నీవు మంత్రిపదవి నేడ్తువు. ఆతఁడు సేనాపతిత్వము వెలిఁగించును—నర్మదా శాణతీర్థములో నాభికలిపి నాకిచ్చి నాసింహాసనముమీఁద దేవరాజును సింగారింతురు. మీరింతవారు కాకపోరు—జోడుగుండ్ల తుపాకితో మిమ్మిద్దఱ నొక్కవ్రేటుతోఁ జంపకుందునా.

చంద్ర—మహాప్రభూ ! నన్ను మీబుద్ధికిఁదోచిన చిత్రవిచిత్ర కల్పన ననుసరించి శిక్షింపవచ్చును—కాని సేనాధిపతి నేమియుఁ జేయఁదగదు—దేవరాజు మాయింటికి వచ్చుట యాతఁ డెఱుఁగనే యెఱుఁగఁడు. నే నభయమిచ్చుట అంతకంటె నెఱుఁగడు. ఆతఁడు దేవరాజని మొదట సేనాధిపతి సందేహించినమాట సత్యము—ముమ్మాటికి సత్యము—ఆతఁడు నాబావ యని చెప్పి నే నాతని మోసపెట్టితిని. నేనే రాజద్రోహిని. ఆతఁడు కాఁడు—ఆతనికి శిక్ష తగదు. శిక్షకుఁ దగినవారిని శిక్షింపకపోవుటకంటె శిక్షకుఁ దగనివారిని శిక్షించుట రాజ్యకల్లోలమునకుఁ బ్రబలతరకారణము.

సోమ—నీగొంతుక గొయ్య—రాజనీతులు నీవే నాకుఁ జెప్పుచుంటివఁటరా ! సోమనాథదేవుని యన్నము దేవరాజుపదమే కాదఁటరా ! నీరాజనీతి, నీబుద్ధి కాలిపోను. ప్రభుద్రోహి—పరాభిమాని—పశువా—

చంద్ర—అయ్యా! వాక్పారుష్యము కూడదు—అది ప్రభువులకు బొత్తిగాకూడదు.

# పూర్ణిమ

మూఁడువైపులందు ♦ మున్నీటి చలువయుఁ
బైన మంచుకొండ ♦ బారుచలువ
గంగతల్లి మొదలు ♦ కావేరివఱకును
నడుమనున్న పుణ్య ♦ నదులచలువ
మట్టిపురుగు మొదలు ♦ మహిపతివఱకొక్క-
పూతతత్త్వమనుచుఁ ♦ బూవునైన
జిదుమఁ బాపమనుచుఁ ♦ జెప్పిన బుద్ధుని
ప్రేమమతపుసుధల ♦ వెల్లిచలువ
అన్యతారణమున ♦ కాత్మ దుర్గతిజూడ
నట్టి యోగి సుద్ద ♦ బొట్టు చలువ
రామతారకమును ♦ బ్రజలెల్లఁ బాడిన
పుట్టతేనె కవిత ♦ పొలుపుచలువ
ఇంతచలువ యుర్వి ♦ యెల్ల వ్యాపించిన
యింతచలువఁగలుగు ♦ నిటనుబుట్టి
అగ్గిపలుకు లెట్టు ♦ లాడెదవకటా
సహజమైనప్రేమ ♦ చలువవిడిచి.

సోమ—అబ్బ! అబ్బ! మాకిప్పుడు వేదాంతోపదేశ మొనర్చుచుంటివఁటరా, చండాలుఁడా! నాకడుపుగాల్చిన నీ నెత్తిపైఁ బన్నీరు చల్లుమందువా! నా ప్రక్కను శూలమున బొడిచిన నిన్ను బుగ్గపై ముద్దుపెట్టుకొనుమందువా! మండుచున్న యగ్నిపర్వతమునుండి మలయమారుతము వచ్చునఁటరా!

చంద్ర—కఠినవాక్యములేల! మీ చేత నధికారమున్నది. మహాప్రభూ! నేను రాజద్రోహ మొనర్చితిని. అట్లొప్పుకొనుచున్నాను. పరుషవాక్యము రానీయకుండ నన్ను శిక్షింప వేడుచున్నాను.

గీ. కత్తిచేత జనునికాయంబు ♦ దెగుఁగాని
నోటిచేత మనసు ♦ తూటుపడును
దారుఘాతమునను ♦ దలభగ్నమగుఁగాని
తిట్టుచేత మనసు ♦ దెగుట నిజము.

సోమ—కృతఘ్నతచే నాత్మను దగులఁబెట్టుకొనిన యధమాధముఁడవే; ఇప్పుడు మనసు దెగునని తెలుపుచ్చెదవేమిరా?

చంద్ర—మహారాజా ! కృతఘ్నత దోషమని యెఱుఁగకపోలేదు కాని, యాపన్నుఁడగు నతిథికి బ్రాహ్మణవిధి ననుసరించి యిచ్చిన యభయవాక్యమును మీఱుట యంతకంటె దోషమని నేను దేవరాజునెడల నట్లాచరింపవలసి వచ్చెను.

సోమ—అనఁగాఁ గృతఘ్నతకంటె నసత్యకథనము దోషతరమని యట్లొనర్చితివి. ఆమాట స్పష్టముగా నేలనువరాదా ! అంతేకాదా!

చంద్ర—(సందేహించుచు) ఆ. అంతే.

సోమ—అట్లయిన దేవరాజు నీ బావయని యేల దొంగగడ్డి దింటివి?

చంద్ర—ఆపన్నుఁడగు ద్విజుని రక్షణమున నసత్యమాడవచ్చునని యట్లు చేసితిని.

సోమ—ఎక్కడికక్కడను విశేషసూత్రములు-ఎక్కడికక్కడను విఱుపులు-దాసిదానిగృహములో దాఁచుటా ! 'ఎవఁడైనఁ గనిపట్టినచో నీమె మాపినతల్లిగారనిబొంకుటా? దాసిదానినిఁ దల్లి చెల్లెలనెదవేమిరా బ్రాహ్మణ దౌర్భాగ్యుఁడా యని యెవ్వఁడైననడుగ 'వారిజాక్షులం' దసత్యమాడ వచ్చునని వైశేషికసూత్రమును జెప్పుటా! ఇదేనా బ్రాహ్మణత్వము ! కల్లు త్రాగఁగూడదని శాసించితివికదా నీవేల త్రాగితివిరా ద్విజపశువా యని యడుగ శక్తిపూజలో నది సమ్మతమేయని సాధించుటా ! మాంసమును దినఁగూడదని శాసించితివిగదా మాంసమేల తింటివిరా బాపనపిశాచీయని యడుగ యజ్ఞకార్యములం దది విధియని నిర్వచించుటా !

చంద్ర—మహారాజా ! అట్టె నోరుచేసికొనక యింకఁజాలించు.

సోమ—(లేచి) నేను జాలించుటకాదు. నిన్నుఁ జంపెదను. చావుము చండాలుఁడా ! చావుము. (జుట్టుపట్టుకొని కత్తితో నఱుకఁబోవును.)

కాత్యాయని—(పటాక్షేపమున బ్రవేశించి) హా! రాజేంద్రా! నన్నుఁజంపుము నన్నుఁజంపుము. దేవరాజును నాయింటఁజేర్చినది నేను. దేవరాజని తెలియక యాతని రక్షింతునని మంగళసూత్రముతోఁ బ్రమాణముచేసియుంటిని. ఈతఁ డప్పటికింకఁ గోటలోనే యుండుటచేత నీ సంగతి నేమియు నెఱుఁగఁడు. తరువాత దెలిసి నన్ను బహుభంగుల దూషించినాఁడు. నీ యెడలఁ గృతఘ్నతజూపుట కెంతమాత్ర మిష్టపడలేదు. తుదకు ఆపన్నుఁడైన యతిథినిఁ బొమ్మన నోరురాక భార్యమాటఁ ద్రోసివైచుటకు మనసురాక, అభయవాక్యమును మీరలేక యట్లాచరించినాఁడు. దీనికంతకును మూలమను నేను; నన్ను శిక్షింపుఁడు. మహారాజా ! ఆతనిని వదలివేయుము.

చంద్ర—కాత్యాయనీ ! హా ! ఎంతపనిచేసితివి. నరకలోకమున యమునిచే శిక్షనొందనక్కఱలేకుండ నిక్కడ రాజుచే శిక్షనొందుచుంటినని మహానంద మొందుచున్న నాకుఁ దిరుగ సంతాపమును గలుగఁ జేసితివా ?

సోమ—కాత్యాయనీ! ఆఁడుదాని యవకతవకల కన్నిటికిఁ దలయూఁచు మగవానిని జంపవలసినదే. సాధారణముగా నాఁడుదానికి నీతిలేదు. మగవానికి బుద్ధిలేదు.

కాత్యా—అట్లయిన నిద్దఱినుగూడఁ జంపుము. అహితులను బహిరంగముగాఁ జంపలేక పురోహితదంపతులను స్వయముగాఁ దలారివలెఁ జంపుటకు సిద్ధపడిన మహా

రాజీ దేశమునకుఁ బ్రభుఁడైనప్పుడు దేశాదృష్టమింకఁ జెప్పవలసినదేమి ? కాని— ఇంతకును దేవరాజు మాకర్మముజాలక యాదృచ్ఛికముగాఁ దలుపుతీసియుండుటచేత మా యింటఁ బ్రవేశించినందులకేగదా మాకీశిక్ష ! సామాన్యనరప్రకృతి ననుసరించి మే మాతనికిచ్చిన యాతిథ్యమునకే కదా మాకీగొంతుకోత ! సెబాస్! సెబాస్! నీవు శౌర్యవంతుఁడవేయైనయెడల మేముచేసిన ఈపనికి నీవు శిరఃకంపనమొనర్పవలసినదే ! శత్రువు ప్రబలవ్యాధిలో నున్నాఁడని తెలిసి వైద్యవేషము వేసికొని యాతని ప్రాణము కాపాడి యాతనిని దృఢగాత్రసంపన్నునిగఁజేసి తరువాత నాతనితోఁ బోరాడిన మహాశూరుల ముందు నీవెట్టివాఁడవో. నిదురఁబోవుచుండ గొంతు నులిమిరియో, అన్నములో విసము పెట్టించిరియో, కూఁతుప్రక్కలోని కాకర్షించి, గుమ్మములో త్రాఁచుబామును గరపించిరియో శత్రువులను జంపుటయే మహాపౌరుషమనుకొనుచుంటివి కాఁబోలు. డేగ కన్నెత్తి తెఱచి చూచుసరికి మిగిలిన పక్షులన్నియు ఱెపఱెపలాడి క్రింద బడినట్లు ప్రతాపశాలి పేరు వినుసరికే శత్రువులు చైతన్యముఁ దక్కియుండవలసినదే. దేవరాజు నీ బారి పడకుండ మేము తప్పించినందులకు మాపై నాగ్రహించితివా ? లోకమంతయు దేవరాజు పక్షమున జేరి నీపై దాడివెడలినను నీవు చెక్కు చెదఱక యుండవలసినదే. ఆఁడుదాననైన నేను దేవరాజు నెట్లు రక్షింపఁగలను ? పురోహిత బ్రాహ్మణుఁడైన యాతఁడాతని కెట్లు సాహాయ్యమాచరింపఁగలఁడు? అట్టిచో మామూలముననే నీవు దేవరాజు స్వాధీనుఁడు కాకపోయెనని తీవఱపడుచుండుట తగునా ! నీవు బెదరించుటవలన నీ పక్షిని నేను గొట్టలేకపోయితినని కూఁతును గొట్టువాఁ డేమంతగుఱికలవాఁడు. నీవు మాయింటిలో నుంటచేత నాభార్య నాకు స్వాధీనురాలు కాకుండనున్నదని యత్తగారి బోడి తలపై టాయివేయునట్లు డేమంతమగవాఁడు !

సోమ—చాలు. ఇఁకఁజాలించు. ఇఁకఁజాలించు. భటులారా! రండు. (ఇద్దఱు భటులు ప్రవేశింతురు) మీరు వీరి నిద్దఱను జెరియొక గోతిలో గొంతువఱకుఁ బూడ్చుఁడు. పూర్తిగాఁ బూడ్చినయెడల వెంటనే చత్తురు. అది నాకిష్టములేదు. గోతులను శీఘ్రముగా ద్రవ్వుఁడు. వీరిని బ్రాతించిగాని నేను గోటలోనికిఁ బోను.

భటుఁడు—గంజివాన్పుకై త్రవ్విన నిలువుగోతులలో వట్టివి రెండుమూఁడున్నవి.

సోమ—అటులైన మఱింతమంచిది. కానిండు.

కాత్యా—రాజా ! మాయిద్దఱ నొక్కగోతిలోనే పూడ్చి పుణ్యమును గట్టుకొనుము.

సోమ—అందులకు నాయాక్షేపణలేదు. భటులారా! ఒకగోత నిద్దఱనుంచుఁడు. భటులారా ! కాపక్కఱలేదుగాని అయినను మీరీ ప్రక్కలనే గాపుండుట మంచిది.

(భటులు వారిని గోతిలో గొంతువఱకుఁ బూడ్తురు.)

చంద్ర—రాజా ! నిర్దోషుఁడైన సేనాధిపతికి మాత్రము శిక్ష తప్పింపుము.

కాత్యా—రాజాధమా ! బ్రహ్మహత్యాపాపము శీఘ్రముగ నీకుఫలించునుగాక.

సోమ—(నిష్క్రమించును.)

కౌత్యా—నాథా! పరమదుర్మార్గుఁ డెంతపనిఁ జేసినాఁడు. హా! హా! హా!

చంద్ర—ఆతఁడేమి చేసినాఁడు?

గీ. మనకుఁ గష్టము రాజిచ్చు ♦ ననుకొని
యద్ది రాజరా జిచ్చినాఁ ♦ డనుట తగును
మనకు సౌఖ్యము రాజిచ్చు ♦ ననుకొని
యద్ది రాజరా జిచ్చినాఁ ♦ డనుట తగును
అశనిమేఘుఁడు పడవైచె ♦ ననుకొని
వానిపైవారు పడవైచి ♦ దాని నిలను
వర్షమును మేఘుఁడొసఁగు న ♦ న్పలుకకాని,
వాని పైవాఁడొసంగును ♦ దాని మనకు
మనకు సుఖమును రాజిచ్చు ♦ మాటయైన
నతఁడు సుఖముకై చెడదేవు ♦ లాడుటేల!
మనకుఁ గష్టము రాజిచ్చు ♦ మాటయైనఁ
బ్రభుఁడు మనకంటెఁ గష్టముల్ ♦ పడయనేల?
ప్రాకృతియె సౌఖ్య దుఃఖకా ♦ రణము వినుమి,
ఈశ్వరుఁడు తత్ఫలము పంచి ♦ యిచ్చువాఁడు,
గాని యీశ్వరునిందింపఁ ♦ గలుష మగును
మనము మనలనె నిందించు ♦ కొనుట తగును
మనుజపతిని దిట్ట ♦ మఱియింత దోషంబు
మోఁతకూలి యతఁడు ♦ దాతకాఁడు
వెట్టిపనికి నతని ♦ దిట్టుటకూడనా,
ఇకను రాజుమాట ♦ నెత్తవలదు.

కౌత్యా—మీరు పురుషులు-బ్రహ్మనిష్ఠాసంపన్నులు-మీరెట్లైనను దరింతురు-నేనాఁడుదానను-నాగతియేమి? నాకు సుగతిసాధన మేదైన నూపిరి యింక నాడుచుండఁగనే బోధింపరా.

చంద్ర—

గీ. మానవతికి నైన ♦ మగవానికైనను
దర్భశయ్యనైనఁ ♦ దలిరుసెజ్జ,

నైన నెల్లయప్పు ♦ డర్వ్మసాధనము పం
చాక్షరీజపంబె ♦ యగునుగాదె.

'ఓం-నమశ్శివాయ' యని యనుము.

కాత్యా—ఓం నమశ్శివాయ-ఓం నమశ్శివాయ-ఓం నమశ్శివాయ.

చంద్ర—హర! ఓంహర-హర-మహాదేవశంభూ!' అని ఊపిరి బాగుగానున్నంత సేపు గట్టిగా నప్పుడప్పు డఱచి లోనఁ బంచాక్షరిని నిశ్చలముగ జపించుకొనుము.

కాత్యా—హర! ఓం-హర-హర-మహాదేవశంభూ—

చంద్ర—హర-ఓం-హర-హర-మహాదేవశంభూ—ఇఁక మాటలాడక జపము చేసికొనుము.

కాత్యా—నాథ గొంతు బిగిసికొని పోవుచున్నట్లున్నది. భయమువైచుచున్నది.

చంద్ర—ననుఁ జంపు. నన్ను జంపుమని రాజుతో మొట్టమొదట ధైర్యమున దీవరించితివే-ఇప్పుడు భయమేల ?

కాత్యా—అప్పుడు నాకేమో యావేశము వచ్చినట్లయ్యెను. అదిగాక స్త్రీని జంపఁడనుకొంటిని. నాథా! ఇఁకనేమిగతి. ఎంతో ఘనతతో బ్రదికి యిప్పుడింత నీచముగాఁ జావవలసినదేనా.

చంద్ర—హెచ్చుతగ్గు లనుకొనినవి బ్రతుకులో కాని చావులోలేవు.

గీ. పండుటాకు చెట్టు ♦ నుండి రాలుటలోను
బైనినుండి చుక్క ♦ పడుటలోను
గలుగుభేదమేమి ♦ కాలచక్రావేగ
మునను జారునన్ని ♦ ముందు వెనుక.

చంద్ర—కాత్యాయనీ! అత్యంతస్వల్పమగు కాలము శుష్కసందేహములతో వృథపోనియక మృతికి సర్వసన్నద్ధురాలవై యుండుము. మనుజున కింతకంటె మంచి సమయము లేదుసుమా!

కాత్యా—నాథ మతిలేదు. మీరెక్కడకుఁ బోవుదురో నన్నుగూడ నక్కడకుఁ దీసికొనిపొండు-నేనుఁ ద్రికరణశుద్ధిగా మీ ధర్మపత్నిని. మహాత్మా! ఇక్కడ నొక్క గోతిలోనున్న ట్లేయొక్కడనో అక్కడగూడ నొకచోటనుండునట్లు చేయుఁడు.

చంద్ర—అబ్బ-పోనిమ్ము-మాటలాడకుండ నుండలేవా?

కాత్యా—నేనుండలేను-తలయటుపెట్టకుండా నావంక పెట్టుఁడు (ఏడ్చును.)

(నేపథ్యమున) అమ్మా! ఏడువకుము-వచ్చుచున్నాను.

కాత్యా—నాథా! ఎవ్వరో మనల రక్షించుటకు కాఁబోలు వచ్చుచున్నారు.

(పద్మిని ప్రవేశించును.)

పద్మి—అమ్మా! స్వామిగారు, మీరు నెట్లున్నారో చూచి మీకుఁ జేతనైన సాయమును జేయుమని మాయమ్మ సర్వమంగళమ్మగారు నన్నుఁ బంపినారు.

కౌత్యా—భగవంతుఁ డామెకు మేలొసంగుఁగాక! నీ వొక్కతెవే వచ్చితివి గదా, మాకెట్టిసాయముఁ జేయ గలవు ? కాని అప్రక్కను భటులు లేరా ?

పద్మి—వారు దూరమున నిద్రించుచున్నారు.

కౌత్యా—ఇప్పుడేకాదా-అప్పుడే నిద్రించుచున్నారా ?

పద్మి—విందులలోఁ జెడద్రాగిన ముండకొడుకులకు నిద్రగాక మ ఱేమున్నది? అమ్మా! మిమ్ముఁ జెట్లకు విఱిచికట్టినారని తెలిసి బంధములు గోయుటకు కత్తినిచ్చి యామె నన్నుఁ బంపినది. తిరుగఁ బోయి యామెతోఁ జెప్పి తగిన సహాయులను దీసి కొని వత్తును. భయపడవలదు. ఒక్కపరుగున వత్తును. (పోవును)

కౌత్యా—నాథా! బ్రతుకఁగలమని తోఁచుచున్నది. ఇదిగో మీరింతసేపటి నుండియు మాటలాడలేదేమి ? మ ఱేమియుఁ దొందరలేదుకద.

చంద్ర—తొందర లేదు.

(నేపథ్యమున) తొందరలేదు—తొందరలేదు—పరుగెత్తకు—మేము నీకు హాని చేయము.

(మఱియొక కంఠరవమున) అమ్మయ్యో! అమ్మయ్యో! (కేకలు)

కౌత్యా—అయ్యయ్యో! అయ్యయ్యో! అదేమి?

(భీమన్న, భైరవన్న, కేశవన్న, శత్రుంజయుఁడు, పద్మినియుఁ బ్రవేశింతురు.)

భైర—నేనుఁ గవిని. రసగ్రహణములో నాయంతవాఁడు లేఁడు. అందఱికంటె మొదటిముద్దు నాది. షోడశమహారాజులు పెట్టుకొన్న ముద్దులకంటె నొక్కకవి పెట్టు కన్న ముద్దున్నదే అది నిక్షేపతత్వసామంతము.

భీమ—నిక్షేపతత్వసామంతమేమి, నీ మొగము! అర్థములేనిమాట—

భైర—(అప) అర్థము చూచినయెడలఁ గవిత్వము చెప్పినావే—

కేశ—(అప) భైరవన్నా! ఉండు-మనము వచ్చినపని యేదో చూచుకొనవల యునుగాని లేనిపోని గొడవలలో దిగఁగూడదు. మనదొర యెంత చండశాసనుఁడో యెఱుఁగుదువుకద.

శత్రు—(అప) ఎంతచండశాసనుఁడు గానియెడల నేను గల్లు మానివేయుదునా! జలగ రక్తముపీల్చుట మానెనని వినియుంటివా?

భీమ—(అప) ఆఁడుదానితగవులలో బడినయెడల నందఱ మిక్కడ జచ్చిన బారమే. కావున మనపనితప్ప మన కింకొకటి తగదు. అమ్మా! ఈయూరఁ బురో హితుఁ డెవరు?

పద్మిని—ఆయనతో మీకేమిపనియున్నది ?

భైర—కవిగారికి గర్భాదాన ముహూర్తము పెట్టవలయునుగాదా ?

పద్మి—ఆయన చంద్రశేఖరస్వామిగారు.

భీమ—ఆయనకొక భార్యయున్నదా?

పద్మి—ఆమె పేరు కాత్యాయని.

భీమ—సరేకాని వా రిక్కెక్కడ?

పద్మి—దోచుకొందురాయేమి?

భీమ—ఊఁహు—వారితోఁ బనియున్నది. ఇదివఱకు విస్నవైఖరిననుసరించి వారి యింటికి వెళ్ళియుంటిమి. ఇంటికిఁ దాళము వైచియున్నది. వారిద్ద రెచ్చటనున్నారో చెప్పినయెడల నీకేమైన నిచ్చెదము.

పద్మి—వారిని మీరు హింసింపమని ప్రమాణముచేసినయెడలను, నన్ను బాధింప కుండ వదలివేచునెడలను, వారిని మీకుఁ గనఁబఱతును. వారు మీసాహాయ్యమును గోరఁదగినస్థితిలో నున్నారు.

భీమ—కాళికమ్మ పాదాలతోడు. ఆయన కాళుల నెత్తినిబెట్టుకొందుము. నిన్ను వదలిపెట్టుదుము.

పద్మి—అటులైన రండు. (వారు చంద్రశేఖరస్వామియొద్దకుఁ బోవుదురు.)

పద్మి—అదిగో చూడుఁడు. రాజశిక్షితులై వా రిట్లున్నారు. ఇప్పటివఱకు బ్రదికియున్నారు.

భీమ—చూచెదవేమిరా? మన్ను తీసివేయుము. చేతులతో లాగివేయుము.

శత్రుం—ఇక్కడ బడితె లున్నవి. వంటకట్టెలుకొఁబోలురా—త్రవ్వరా.

కేశ—కానీ–కానీ–త్వరగా–త్వరగా.

(చంద్రశేఖరస్వామిని దొంగలు పైకిఁదీయుదురు. కాత్యాయనిని బద్మినితీయును.)

ఖైర—చంద్రశేఖరస్వామిగారు! దండాలు. కాత్యాయనమ్మగారు! దండాలు. పద్మినీ నీవింకఁబొమ్ము.

పద్మి—(అప) వీరు మీకపకృతిచేయరు; భయములేదు. నేనుబోయి మాయమ్మ గారితో నేమి చెప్పుదును?

కాత్యా—(రహస్యముగఁ బద్మినితో) మీదయను సంతసించితిననియు, దైవ కటాక్షమున్న ముందు గలసికొందుమనియుఁ జెప్పుము. చూడుపద్మినీ నీవు సర్వమంగ ళమ్మకుఁ బ్రియదాసివికావున నంతవారమై మేమేమైన లేఖవ్రాయునెడల నది నీవ ముందుగాఁ బంపుదును. నీవామెకుఁ గనఁబఱచి యామెజాబును నాకుఁబంపుచుండవలెను. నీసామర్థ్యస్వభావమున మాసఖ్యమింక నభివృద్ధినిఁబొందుఁగాక.

పద్మి—అట్లే. పోయెదను స్వామిగారూ!

ఖైర—(అప) నక్షత్రము తిరిగిరావలెండు, నిన్ను ముదుపెట్టుకొందునో లేదో. నాతమాషా. (పద్మిని నిష్క్రమించును)

చంద్ర—నాయనలారా! మీరెవ్వరు?

భీమ—ఎవ్వరైననేమి ? మీ మిత్రులము.

చంద్ర—మీరుచేసినయుపకారమే యీసంగతి చెప్పుచున్నది. మేము మీకుఁ బ్రత్యుపకారమెట్లుచేయవలసినదో చెప్పునెడల నట్లు చేయుటకు సిద్ధముగా నున్నాము.

భీమ—మీరు మేము చెప్పినట్లు మాతో వచ్చుటయే మాకుఁ బ్రత్యుపకారము.

చంద్ర—మీతో మేమేల రావలయును ?

భీమ—మారాజుగారు మిమ్ములను దీసికొనిరమ్మని యాజ్ఞాపించుటచే వచ్చినాను.

చంద్ర—మీరాజుగారెవ్వరు ?

భీమ—ఆసంగతులేమియుఁ జెప్పవీలులేదు. నడువుఁడు.

కాత్యా—(అప) నాథా! సందేహమక్కఱలేదు. వీరెట్టివారైనను మనయెడల మంచివారు. ఈరాజునొద్ద మనమింక నుండువారము కాముగదా !

చంద్ర—మేమురానియెడల మీరేమి చేసెదరు ?

భీమ—బలాత్కారముదక్క నంతకంటె నేమున్నది ?

చంద్ర—ఎటులైన మమ్ము దీసికొని వెళ్ళుటకే నిశ్చయించుకొనినారా?

భీమ—మానిశ్చయమెంతె బాబూ; మాప్రభువుగారి యాజ్ఞయది.

కాత్యా—(తనలో) వీరిప్రభువు దేవరాజై యుండుట కవకాశము కనఁబడదు. ఆతనిరాజ్యముకూడ యీరాజునకు స్వాధీనమైనట్లు తెలియుచున్నది. (ప్రకాశముగా) నాయనా ! మీప్రభువులెవరో చెప్పకున్నను మీరాజు దేశమేదియో చెప్పెదవా ?

భీమ—అమ్మా! క్షమింపుము; త్వరగరండు.

చంద్ర—సరే నడువుఁడు. వచ్చుచున్నాము. (తనలో) హరహరా—ఏమిది? కొలది దినముల క్రిందటివఱకు కట్టిడిక్కులు లేకుండెనే—ఉన్న దేదియోఁ దినుచు నెవరికిని హానికొరక యసత్యమునకుఁ బోవక ప్రచ్ఛన్నముగ నొక పంచను గాలక్షేపముఁ జేయుచుంటినే. ఎన్నిమార్పులెంతలో వచ్చినవి. ఇవియన్నియు నేనే దెచ్చుకొన్నవా—నా యిష్టమే కనఁబడదే. నాబుద్ధికి బనియే కనఁబడదే. దేవరాజును నాయింటికి రమ్మంటినా ! అతనిని జేర్చుమని నాభార్యతో మాటయొసఁగంటినా. లేదే. అతఁడేల రావలయును! వచ్చినాఁడు. ఆతనిని నాభార్యయేల చేర్పవలెను! ఆతనిని వదలుకొనవలయునని మొదటినుండియు దేవులాడితినే! ఎంతయో పట్టుపట్టితినే. ఏదీ—నాబుద్ధి యక్కడ నేమిపనిచేయఁగలిగినది ? ఆతనికొఱకు కసత్యమాడితినే! కులభ్రష్టతనొందితినే—ఇంతకంటె మహాపతన మున్నదా. ఇన్నియేండ్లవాఁడనైన నేను బుద్ధిపూర్వకముగనే యిట్లు పతితుఁడనైతినా. ఏవిషయభోగము నపేక్షించి నేనిట్లయితిని. ఇచ్చుటఁగూడ భగవంతుఁడిచ్చిన బుద్ధికి వినియోగములేకపోయెనే. కులదేవతగానుండవలసిన నన్ను రాజు గోఁతిలోఁ బూడ్చిపెట్టించెనే. పోనీ. బాగుగానేజరిగినది. ఆగోఁతిలోనే ప్రాణములు విడువవలయునని దృఢనిశ్చయుండనై యుండఁగా యిట్లగుటయేల? నాయూహయేమి—తుదకుజరిగినదేమి ? పోనీ. గోఁతినుండివిముక్తియైనవెంటనే యిఁక రాజనుశబ్దమైన నుచ్ఛరింపకుండ వారు కాశీక్షేత్రమునకుఁబోయి యక్కడఁ బ్రాణములు విడువ బలిష్ఠ

సంకల్పమును బూనియుంటినే. ఏదీ—అట్లు చేయఁగలిగితినా. ఈబుద్ధియుండి నాకేమి పనిచేయుచున్నది. పాపాత్ముఁడనైన నేనెక్కడ. వారణాసియెక్కడ; ఏకాండగుహ లోనో ప్రచ్ఛన్నముగ హరనామస్మరణ మొనర్చుకొనుచుఁ గాలక్షేపమైనఁ జేయకుండ యిప్పుడు వీరితోఁ దగుదునమ్మాయని ప్రయాణమా! ఎక్కడకు? దొంగలరాజ్యమునకుఁ గాఁబోలు. ఎందులకు—వారిప్రభువును సేవించుటకు. ఏమీయీపాపము—హరహరా! పనిచేయని యీబుద్ధిని నరులకేలప్రసాదించితివి. వారిని బాధించుటకై యిచ్చినట్లా—సుఖ పెట్టుటకై యిచ్చినట్లా—కొడిగట్టి కునుకుచున్న యీచచ్చు దీపము లేకుండినయెడల గాఢాంధకారములో మొండితోపుక్రిందఁ ద్రోసికొనిపోయి యుందుమేమో! ఎత్తుపల్లము గాను, పల్లము లెత్తుగాను, నడ్డముగానున్నది బయలుగాను, బయలుగానున్నది యడ్డము గాను గనబడుచును నీ భాగ్యములో సర్వదా గాలికి చెదరుచున్న యీకొఱవిదయ్యపు వెలుతురుచే గాలిలోఁబడువరకుఁ దెలియకున్నదే. బ్రహ్మరంధ్రస్థానమున టంగుమని చెట్టుకొమ్మయో కొండయంచో తగులువఱకుఁ దెలియకున్నదే. హరహరా! ఈప్రపంచ పదార్థస్థితిని దెలిసికొనుటకే యక్కఱకురాని యీమసకమెల్లకంటితో నిన్నుఁ గూడఁ జూడవలసినదనియేనా నీయభిప్రాయము ?

భీమ—అయ్యా! ,రారేను? మాకాలస్యమగుచున్నది. దగ్గఱదారియైనను జాల దూరమగుచున్నది.

చంద్ర—నీ వీడ్చుకొనిపోవుచుండఁగా రాకపోవుట యేల ?

గీ. ఇతని నతఁడీడ్చు వేఱొకఁ ♦ డతనినీడ్చు
అంద ఱందఱనీడ్చు ♦ కయ్యంబె జగతి
అందఱు స్వతంత్రరాజు లూ ♦ హములయందు
బానిసలకంటె బానిసల్ ♦ పనులయందు.

(అందఱు నిష్క్రమింతురు)

ఇది చతుర్థాంకము.

---

శ్రీ

# పూర్ణిమ

## పంచమాంకము.

ప్రదేశము—వరాహపురాంతఃపుర బహిఃప్రదేశము.

(ప్రవేశము—భైరవన్న-(పూర్వము దేవరాజు తప్పించుకొని వచ్చిన పారాజవాను దుస్తులతో డవాలితో పద్మిని.)

పద్మిని—నీ వెవఁడవు?

భైర—రాజభటుఁడనని దుస్తులు చెప్పుచున్నవి; ఇదిగో డవాలి చెప్పుచున్నది.

పద్మి—అసంగతి నెఱుఁగకపోలేదు. నాతో నేమిపనియుండి నగరులోనికి వార్త నంపితివి?

భైర—నీతో పనిలేనివారుందురా! కోటతో సంబంధ మున్నవారికి దాసితోఁ బని లేకుండఁ దప్పునా?

పద్మి—చాలు. అధికప్రసంగమేల! నాతో నేమిపనియున్నదో వేగముగాఁ జెప్పుము.

భైర—చెప్పుటకై వచ్చి మానివేయనుగాని, నా మొగమువంక బాగుగాఁ జూచి మఱిమాటలాడుము.

పద్మి—భటుఁడవైన నీవంక బాగుగాఁ జూడవలయునా?

భైర—ప్రధానుఁడుగారివంకఁ జూడవచ్చునుగాఁబోలు — ఆయనమాత్రము నా కంటె నెక్కువెక్కువ? కూటికిఁ దక్కువైనంతమాత్రమునఁ గుణములలోఁ దక్కువయనుకొంటివా? మనుష్యునకుఁ గావలసినది సరసతకాని చచ్చుసొమ్మా? నీవు దాసివి, నేను బానిసవాఁడను. బ్రహ్మ నిన్ను నాకుఁ గుదిర్చినాఁడుగాని, ప్రధానునికి నిన్నుఁ గుదిర్చినాఁడా? ప్రధానత్వ మెప్పుడో యొకప్పు డూడునదిగాని, నా బానిసతనము పరమపదించువరకు నిలిచియుండునదికాదా!

పద్మి—ఛీ. ఒడలు తెలిసికొని మఱిమాటలాడుము.

భైర—ఒడలు తెలియకపోవుట నీకా నాకా? ఒడలు తెలియకుండ మాటలాడుటయే తప్పైనప్పు డొడలు తెలియక చేష్టలొనర్చుట తప్పుకాదు కాఁబోలు. అందులో రాజద్రోహపుఁజేష్టలు.

పద్మి—(అదరిపడి) ఆఁ-ఆఁ-అట్లనెదవేల?

భైర—అనకపోవుటయేమి? విజయోత్సవములలోఁ గడపటిరాత్రియందుఁ బురోహితుని, వాని భార్యను గోఁతినుండి—

పద్మి—(కెవ్వుమని కేకవైచి) ఆ-ఆ.

భైర—నలువుర దొంగముండకొడుకులచే నూడలాగించుట రాజద్రోహము కాదు కాఁబోలు.

పద్మి—ఆ-ఆ. నిన్నిట్టు దొంగమాటలాడుమని యెవ్వరుచెప్పినారు? నాపై దొంగనేరములు కల్పింపుమని యెవరు బోధించినారు? ఏది చిన్నమ్మగారితోఁ జెప్పక మానుదునా; జాగ్రత్త.

భైర—తొందరపడకు. చిన్నమ్మగారి తక్కువయేమి? చిన్నమ్మగారు తలఁగదలుపకపోయినయెడల పెద్దదాసమ్మగారు కొలుగదుపునా. ఉండు-మఱియొకసంగతి-క్షమింపవలయును. నేను దప్పుచెప్పితిని. కొత్యాయనమ్మను బైకీడ్చినది నీవుకాని దొంగలలోవాఁడుకాఁడు.

పద్మిని—(తనలో) అమ్మయ్యో! కొంపమునిఁగిపోయినదికదా. (ప్రకాశముగా) నీవేమి, కంటితోఁ జూచినట్లే మాట్లాడుచుంటివే!

భైర—చూపలేదామఱి; ప్రక్కలనున్న యిద్దఱు పారాజవానులలో నేను మేలుకొని యుండలేదా?

పద్మి—సరే. ఏదో యొకటి కల్పించినావు. నీబుద్ధికి సంతసించితిని. నీకేమైన బారితోషిక మిప్పించెదనుగాని యీవార్త నింతటితో సంహరించెదవా వ్యాప్తిఁ జేయుదువా?

భై—పారితోషికమనఁగాఁ బైసయైనయెడల నాకక్కఱలేదు. అదిగాక నీవీయవలయునుగాని మఱియొకరిచే నిప్పింపనక్కఱలేదు.

పద్మి—ఇంతటితో నిది యడఁగిపోవునుగద.

భైర—ఒక్కముద్దుతో నంతయు నిర్మూలమగును. ఒకటి_ఏదీ.

పద్మి—అబ్బే-కోటలో ముద్దు పెట్టుకోఁగూడదు.

భైర—అట్లు ధర్మశాస్త్ర మున్నదా! కవిసమయమున్నదా!

పద్మి—అవి లేకపోవచ్చునుగాని, అట్టి యాచారమువూత్రము లేదు.

భైర—నక్షత్రము తిరిగి రాకుండ నిన్ను ముద్దుపెట్టుకొందునని నేను నాఁటిరాత్రి శపథము చేసితిని జ్ఞప్తియున్నదా?

పద్మి—ఆ-ఆ_నీవెవఁడవు?

భైర—నేను భైరవన్నకవిని. ఆనల్వురు దొంగలలో నేనొకఁడను.

పద్మి—అయ్యయ్యో! ఘోరాజవానుచేత ముద్దు పెట్టుకొనఁబడుటకుఁ గోరఁబడి నందులకే యేడ్చుచుండగా పైఁగఁ బచ్చిదొంగవుకూడనా-నీగొంతుక గోయ-ఓడలుజలదరించుచున్నదిరా.

ఖైర—ఆజలదరించుటే సంచారిభావము.

పద్మి—నీసంచారిభావము చట్టుబండలైనట్లే యున్నది.

ఖైర—కాని యొకముద్దు.

పద్మి—ఇప్పుడుకాదు-తరువాత నింటికి వత్తువుకానిలే-చూడు-రహస్యము బయలైనదేమో యని నాగుండెలు తల్లడిల్లిపోయినవినుమా-కాని, నీవు మాయాస్థానపుభటునిదుస్తును ఆపేరు ఆపేరుగల డవాలియు నెక్కడినుండి వచ్చినవి?

ఖైర—భగవంతుఁ డిచ్చినాఁడు. (తనలో) ఈయూరి వెలుపలనున్న పెద్ద మఱ్ఱిచెట్టుక్రిందఁ దూర్పువైపుగాఁ ద్రవ్వి యీదుస్తును డవాలిని దీసికొనుమని మాదొర సెలవిచ్చినాఁడు_అతఁడు వాని నక్కడ నెందులకు ద్రాతిపెట్టెనో తెలియదు.

పద్మి—ఇప్పుడు నీవిటకు వచ్చుటకుఁ గారణమేమి?

ఖైర—పురోహితునిభార్య నీకొక యుత్తరమిచ్చినది. ఒక చిన్నపెట్టె నిచిన్నది. ఇదిగో తీసికొనుము. (ఇచ్చును.)

పద్మి—సంతోషమే-నే నిఁక నాలసింపఁగూడదు. లోనికిఁ బోవలెను—నీవు తిరుగ నెప్పుడు వచ్చెదవు?

ఖైర—నీయష్టము.

పద్మి—నేను వచ్చువఱకు నీవు కోటముందే యుండుము.

ఖైర—సరే. (నిష్క్రమించును.)

పద్మి—(పరిక్రమించి) లోనికిఁ బోవుదును.

[వెనుకఁ దెరయెత్తగ నంతఃపురము—సర్వమంగళ కూర్చుండి ప్రవేశించును.]

సర్వ—పద్మినీ! నీకొఱకు వచ్చినవా రెవరు?

పద్మి—ఈలేఖయు, నీపెట్టెయుఁ దెచ్చినవారే. (సర్వమంగళ కిచ్చును.)

సర్వ—ఈయుత్తరముపై నీపేరున్నదే!

పద్మి—పేరు నాదేకాని, వ్యవహారమంతయు మీదైయుండును.

సర్వ—అటులైనఁ జింపనా?

పద్మి—అభ్యంతరమేమి?

సర్వ—(అట్లుచేసి తాను జదువుకొనుట నభినయించును.)

పద్మి—ఇదుగోనమ్మా-ఉత్తరమునుండి జారిన దీపెట్టెతాళము కాఁబోలు.

సర్వ—ఔను. ఆపెట్టె తెఱువుము.

పద్మి—(అట్లుచేసి దానిలోనున్న ముత్యాలహారమును దీయును.) ఇదిగోనమ్మా—ముత్యాలహారము.

సర్వ—అబ్బా ! ఎంతపెద్దముత్యములు !

పద్మి—మాయము త్తెములుకావు కాంబోలు ! అమ్మా ! అద్దము తెచ్చెదను. మెడలో నుంచుకొనుఁడు.

సర్వ—అక్కఱలే దట్లేయుంచుము. కాని—పద్మినీ ! ఉచ్చు గొంతునకు దిన దినము బిగియుచున్న ట్లగపడుచున్నది. నీ నిజమైన యభిప్రాయము స్పష్టముగా నొక్కసారియైనను జెప్పలేదు. నాకావైపున దృష్టి పాఱినదికదాయని యెంచి నీవు నా తలపులకు వెనుక యంగుచేయవలదు. సాధారణముగా దాసు లమ్మగారికిఁ బ్రతిధ్వనులుగనుందురు. నేను మఱియెవ్వరితోడను విచారింపఁదగిన యంశముకాదు. దైవముఖమునుజూచి చెప్ప వలెను. ఏదోయొకటి శీఘ్రముగఁ దెంపుఁజేసి కొనినఁగాని మిగుల బాధగానున్నది.

పద్మి—అమ్మా ! ఎవ్వరుచెప్పుట కేమున్నది ? మీకా దేవరాజుపైనున్న వలపును బట్టి చూచుకొనవలసినదే కాని—

సర్వ—వలపున్నదనియే నిశ్చయపఱుపుము. మాకుఁ బరమశత్రుఁడైన యాతనిని నేను బెండ్లాడుటఁ దల్లిదండ్రుల శిరచ్ఛేదమువంటిదగునా కాదా ! వారికిఁ బుట్టి వారి నంత బాధపెట్టిన నాబ్రతుకేల కాల్పనా ! లోకమేమందురో చూడవలయునుగాదా !

పద్మి—ఔనమ్మా ! తల్లిదండ్రుల పరాభవమునుగూర్చి ముఖ్యముగాఁ జూడఁ దగినదే! అమ్మా! చిన్నదానవు; లోకమును గురించి మాత్రమాలోచింప నక్కఱలేదా!

సర్వ—అటులైన నిఁకముందు ప్రయత్నము మానుకొనుటయే మంచిదికాదా !

పద్మి—ఏమో ! అలాగే కనఁబడుచున్నదమ్మా !

సర్వ—అటులైన మఱి—ఊ—నాకు వివాహమే యక్కఱలేదనఁగా నీ కేవఁడో నిర్భాగ్యపుముండకొడుకు వచ్చునని కాత్యాయనమ్మ బెదరించినదే ! అది యింతకంటెఁ జిక్కేమో ?

పద్మి—చిక్కన్న చిక్కా ! అమ్మా ! నిక్షేపమువంటివాఁడే కాని నిర్భాగ్యపు ముండకొడుకు మాత్రము వలదమ్మా ! నూఱేండ్లు బ్రతుకవలసిన బ్రతుకమ్మా! చేత వాతగాని పెద్దమ్మవారు దాపురించిన యెడల నిఁకఁ జెప్పనక్కఱలేదు. ఆఁడుదాని బ్రతుకు మగవానికోసరమా ! మఱి యొకందులకా ! అందులోఁ జిదిపి దీపముఁ బెట్టఁ దగిన కాంతిగలదానవు.

సర్వ—అటులైన దేవరాజును జేసికోవలసినట్లే కనఁబడుచున్నదే ?

పద్మి—సందేహమేమి ? అట్లే నాకును గనఁబడుచున్నదమ్మా !

సర్వ—చూడు పద్మినీ ! మనశక్తులెంత ! మనబుద్ధులెంత ! భగవంతుఁడేలాగున యోజించెనో యాలాగుననే జరుగును. ఊరక యీ త్రోపక్కులాటలేల ? తటస్థముగా నోరుమూసికొని యూరకుండిన యెడల బాగుగానుండునేమో ?

పద్మి—అది సర్వోత్తమమైన మార్గమేనమ్మా!

సర్వ—సర్వోత్తమమైనమార్గమే. మాటలలోనే—కాని—యంతనిర్లిప్తతగా నాచరణలోనుండ వశమా? కాషాయధరులు సహితము కడుపాత్రమున దేవులాడుచుందురు గాని యూరకుందురా? అట్టిచో సంసారిణులమైన మనము—

పద్మి—అందులోఁ బరమనుకుమారివైన నీవు నేనెఱుఁగుదునమ్మా నీవాలాగున నుండలేవమ్మా! దానిపై-అయ్యో—పండెపుగుజ్జమువంటి ప్రాయము వచ్చినది. అది యూరకుండనిచ్చునా! అమ్మా! అదిగాక పెండ్లిపీటలమీఁదవఱకు వచ్చినవ్యాపారములో కష్టమమ్మా! అనుభవించుదానికిఁదప్ప నెవ్వరికిఁ దెలియదమ్మా! నా మాట నేను జెప్పుచున్నాను. నాలుగుమాసములనుండి గడపద్రొక్కిన గాడిదెకొడుకు గనఁబడఁడమ్మా! వారందఱ కేపెద్దపాముకఱచినదో నేనేమి విసము పెట్టితినో నెల కొక్కమారైన నా మొగానఁ గాసంత నిప్పుపెట్టకపోయినప్పు డేలాగమ్మా!

సర్వ—చూడు పద్మినీ! భగవంతుని తరువాత భగవంతుఁడంతవారు తండ్రిగారున్నారుకదా! ఈ బాధ్యత సర్వము నాయనపైఁ బడవైచినయెడల బాగుగా నుండునేమో? ఆయనయే తగిన సంబంధము నాలోచించి కళ్యాణము చేయును.

పద్మి—అది లోకములోనున్న యాచారమేనమ్మా! దానికి విరోధముగా నడచుటమాత్ర మేమంత మంచిపని! ఒక్కగానొక్కకూఁతురు; ఆయన మహారాజు. నీకీ చింతయెందులకు? నీకుఁ దగిన వరునిఁ దీసికొనిరాలేకుండునా! తలిదండ్రులు గలవానిని, జిన్నవానిని, రూపవంతుని, శౌర్యవంతుని, భార్యయం దనురాగము కలవానిని, నెవనినైన మహావైభవముతో, దాసదాసీజనముతో నింటికిఁ బిలిపించి సీతాకళ్యాణమువలెఁ జేయకుండునా?

సర్వ—కాని, యక్కడనేయున్నది గొప్పచిక్కు. వెనుకటి పెండ్లివానివలెనే యీ పెండ్లివారినిగూడ గొంతులు గోయించునేమో యని యెవ్వఁడును రాఁడేమో!

పద్మి—ఆమాటమాత్రము నిజమమ్మా! ప్రాణమున్న ప్రాణులాడనివా రెవ్వరుందురమ్మా! అందులో నిండుప్రాణాలను మందలక్రిందఁ బెట్టి—

సర్వ—ఆదేమిమాటలే; శత్రువులను ముద్దుపెట్టుకొందురా యేమి? సమయము వచ్చినప్పుడు శత్రుమారణము చేయనివా రెవరులే.

పద్మి—నాకు నచ్చినమాట చెప్పినావు మా అమ్మా! నాయనుభవములో నున్న మాటను చెప్పినావు మాతల్లీ!

సర్వ—పద్మినీ! నే నేమాటయంటినో నీ వామాటను జెప్పుచున్నావు.

పద్మి—మీ యన్న మింతకాలమునుండి తినుచు వ్యతిరేకపుమాట నెట్లు చెప్పఁగలను.

సర్వ—పోనీ! ఈయుత్తరమును విను!

"శిష్యురాలికి సకలశుభప్రాప్తియగుఁగాక"

పద్మి—అమ్మా! కాత్యాయనమ్మ వ్రాసినదేకదా?

సర్వ—ఔను. (చదువును) నీకటాక్షమున నిప్పటివఱకు బ్రదికియుంటిమి. సర్వదా యనుగ్రహ ముంచవలెను. మరల మనము కలిసికొనుభాగ్యము సర్వేశ్వరుఁడు శీఘ్రముగా లభింపఁజేయుఁగాక! నాకొడుకిచ్చట గొప్పకోట కట్టించుచున్నాఁడు. గొప్పసైన్యమును సిద్ధపఱచినాఁడు. లెక్కలేనిధనమున కధికారియై యున్నాఁడు. ఈ పర్వతదుర్గములందు నిరంకుశప్రభుఁడై యున్నాఁడు. కాని యాతని శరీరము మాత్రమే యిచ్చటనున్నది. ప్రాణములన్నియు నీపై నున్నవి. నేనిచటికి వచ్చినతరువాత శకునము లెన్నియైన నడిగియుంటిని. ఎంతసేపు చెప్పినను నెవ్వరుచెప్పినను ఆవెనుకటిదేకాని క్రొత్తదిఁ బనికిరాదని చెప్పినారు. అదిగాక క్రొత్తది చూచుకొన్నయెడల నైదువతనము దక్కదని యొక లోపున్నెపుటెఱుకసాని స్పష్టముగాఁ జెప్పినది. అదియే మఱియొక సంగతి చెప్పినది. నీతండ్రివలన నీకు గొప్పహాని శీఘ్రముగా రానైయున్నదని చెప్పినది. ఆమాట వినినప్పటినుండియు మతిలేక యున్నాము. నీవు మఱుమాట చెప్పక రావలయును. రావలయును. ఈ యవకాశము దాఁటిపోనీయకుము. పోనీయకుము. నిన్ను విడిచి యుండుట మాతరముకాదు. కాదు. భర్తపంపిన ముత్యాలహారము నంగీకరింపవలయును. బయలుదేరుటకు నీ యంగీకారమును దెలిపినవెంటనే నిన్నిటకుఁ దెచ్చుటకు నేనే వచ్చెదను. నా కోడలిని నాయింటికిఁ దెచ్చుకొనుట నాకుఁ దప్పుకాదు. గ్రహింపవలెను.

పద్మిని! తెలిసినదా!

పద్మి—తెలియకేమమ్మా!

సర్వ—తెలిసిన దంటివికదా! మాతండ్రిగారివలన నాకు రాఁదగిన గొప్పహాని యేమైయుండునో?

పద్మి—అదే తెలియదమ్మా! కాని నాకిప్పుడు మీతండ్రిగారిచేతిచావు తప్పినట్లు సంతోషింపవలసి వచ్చినది.

సర్వ—ఆ! ఆ! అదేమి?

పద్మి—నల్వురుదొంగలని చెప్పితినే, వారిలో నొక్కనిచేతి కీ యుత్తరమిచ్చి కాత్యాయనమ్మ పంపినది. ఆతఁడొక కోరికకై యొక చిత్రమైన పద్ధతిగా సంభాషణ మారంభించినాఁడు.

సర్వ—నా కేమియుఁ దెలియలేదు.

పద్మి—నేనుఁ బైకిఁ జెప్పఁజాలను. చెవిలోఁ జెప్పెదను. (అట్లుచేయును)

సర్వ—అప్పుడు నీగుండె నీరువిడిచినది కాఁబోలు నేమి?

పద్మి—అమ్మా! చచ్చియే పోయితిని.

సర్వ—చూడు. పురోహిత దంపతులను గోఁతఁబెట్టిన రాత్రి ప్రక్కనుగావున్న ఘారాజవాను లాదంపతులను విడిపించుట చూడలేదని స్పష్టముగా నెట్లుచెప్పఁగలము?

పద్మి—చెప్పలేము. మొదటజూచినప్పుడు వారు నిద్రించుచునే యున్నారు. దొంగలువచ్చినతరువాత మాత్ర మలికిడివలన మేల్కొనిరేమో తెలియదు.

సర్వ—మన మిాప్రయత్నము చేసితిమని వారివలననే మాతండ్రిగారి కెప్పటికైన నేల తెలియకపోగలదు ?

పద్మి—సరిగా అదేనమ్మ నాభయమును.

సర్వ—మాతండ్రిగారు మనలఁజంపుదురు. ఇప్పు డుపద్రవమేదో తెలిసినది. ఉత్తరములో నుపద్రవము రానై యున్నదని యున్నదా ? శీఘ్రముగాననికూడ నున్నదా !

పద్మి—(చూచి) ఇదిగో శీఘ్రముగా రానై యున్నది.

సర్వ—ఇంత క్రోధముతో నున్న మాతండ్రిగారు మనలఁ జంపక మానుదురా ?

పద్మి—చంపుటకంటె నెక్కువదైననున్న నదికూడఁజేయును.

సర్వ—ఇఁక బ్రయాణసన్నాహమున నుండవలసినదే ?

పద్మి—అమ్మా ! యింకను సందేహమా ?

సర్వ—నీవు నాతోకూడ వచ్చెదవా ?

పద్మి—మీా యిష్ట మమ్మా !

సర్వ—నా యిష్టము కానియెడల ?

పద్మి—ఇక్కడనున్నయెడల మాతండ్రిగారు నన్ను వధింపరా ? మఱియొక యాస్థానమునకుఁ బోవలయునుగాని కులవృత్తిచేతమాత్ర మీదినములలోఁ గడుపదమ్మా!

సర్వ—నే నూరక యడిగితినిగాని, నీవు రాకుండ నేను బోవుదునా ?

పద్మి—నేను మఱియొకచోటికి మాత్రము మిమ్ము విడిచిపోఁగలనా ?

సర్వ—ప్రయాణప్రయత్నమున నుందము.

పద్మి—నా కేమియుఁ బ్రయత్నమక్కఱలేదు.

సర్వ—సరే ! నిద్దురవేళయైనది పోవుదము. మనలఁ దీసికొని పోవుటకుఁ దానే వచ్చునఁట ! ఎట్లువచ్చునో, యెట్లు దీసికొనిపోవునో, తెలియదు.

పద్మి—మాకే తెలియనప్పుడు నా కెట్లు తెలియునమ్మా !

సర్వ—నీవు కాత్యాయనమ్మకు లేఖ వ్రాయుము. మా రెప్పుడు వచ్చిన సరే! అప్పుడే బయలుదేరుటకు సిద్ధముగా నున్నాము.

పద్మి—అట్లే వ్రాసి యాతనిచేఁ బంపింతును. రెండుముక్కలెంత సేపమ్మా (వ్రాయుట నభినయించును.)

సర్వ—సరే ! యెవ్వరో కొందఱు శీఘ్రముగా దేవరాజువద్దనుండి వత్తురుకదా! అప్పుడేమిజరుగునో చూచుకొందము; నాకు నిద్దురవచ్చుచున్నది. పండుకొనెదను.

పద్మి—అమ్మా ! యీలేఖ నతనికిచ్చి నేనుకూడ నిప్పుడే వత్తును.

(ఇద్దఱు నిష్క్రమింతురు)

ఇది పంచమాంకము.

---

శ్రీ

# పూర్ణిమ.

---

## షష్ఠాంకము.

---

ప్రదేశము—వరాహపుర రాజసభ.

ప్రవేశము—సోమనాథదేవుఁడు, భ్రమరసింగు, సుబ్బారెడ్డి.

---

సోమ—ఆహాహా ! ఎట్లు భ్రమరసింగూ ? మఱియొకసారి మీ దొరగారి లేఖను చదువుము.

భ్రమ—శ్రీమన్మహామండలాధీశ్వర—

సోమ—ఆబిరుదావళినంతయు నెందులకులే. లోనియంశములను చదువుము.

భ్రమ—(చదువును) మీవరాహపురరాజ్యమువారు, మీ శత్రువులగు భట్టిరాజ్యమువారు, నన్యోన్యవిజిగీషాతత్పరులగుటచేత, మాకు మీవలనఁగాని మీశత్రువులవలనఁగాని యిదివఱకు కొత్తుడు లేకుండెను. మీరు భట్టిరాజవధ మొనర్చి వారిరాజ్యము నవలీలగ స్వాధీనముఁ జేసికొనుటఁబట్టి మాకిప్పుడు పూర్వశాంతియుండుట కవకాశము లేకపోయినది. మేము సామాన్యపుఁ గొండదొరలము. మీరు మూర్ధాభిషిక్తులు. మాతో స్నేహభావము నెఱపుఁడని మిమ్ముఁగోరుట మాకు గర్వోక్తిగానుండునని భయపడుచున్నాము. ఇంతటినుండి మీకు విధేయులమై మీపోషణలో నుండుటకు నిశ్చయించుకొనినాము. వినయపూర్వకముగా మేమొసఁగు కప్పములను గ్రహించి మమ్మాదరించుచుండవలయును. మీదయఁగోరి మీకు సంతోషకరములగు రెండు పనులను మేము చేసియుంటిమి. వానిని వ్రాయుట స్వప్రశంసగానుండును. కావున మాసేనాధిపతివలన మీరు విందురుగాక.

చిత్తగించవలయును.
విధేయుఁడు శంకరదాసుఁడు.

సోమ—ఆ చెప్పవలసిన రెండుపనులేవి?

భ్రమ—కప్పము దాఖలుచేసుకొనినపిమ్మట మనవిచేసెదము.

సోమ—భ్రమరసింగు ! సుబ్బారెడ్డి ! ఆలాగే తొందరలేదు. మీదొరగారి యోగ్యతకు విధేయతకు మిగుల సంతసించితిమి. మేము భట్టిరాజ్యమున బట్టాభిషేకము

నకుఁ బోవునప్పుడా దారినే మీదొరనుగలసికొని యాతనినిగూడ మాపట్టాభిషేకమునకుఁ దీసికొనిపోవుదుమని యాతనితోఁ జెప్పవలయును. సరే! మీకప్పమేదో యిక్కడకుఁ దెప్పించితిరా?

భ్రమ—ప్రక్కనున్న సేవకుఁ డడ్డగించినాఁడు.

సోమ—ఓరీ! ఎవఁడురా—అక్కడ?

(నేపథ్య)—చిత్తము.

సోమ—అడ్డుపెట్టకుండఁ గప్పమిచ్చువారిని సామానుతో లోనికి రానిమ్ము.

(నేపథ్య) చిత్తము.

(ఆడువేసముతోనున్న భైరవన్న, పెద్దపాణకతోఁ బండ్లు భటుని నెత్తిపైఁ బెట్టించుకొని ప్రవేశించును.)

సుబ్బా—ప్రభూత్తమా! ఇది యొకదాసి. దీనిని గానుకగా మాదొరగారు మీకర్పించినారు. ఆపాణకలోని వడవిపండ్లు, దుంపలు. మాయొద్ద నింక బంగారు వస్తువులున్నవి.

సోమ—(దాసిపంకఁజూచి) ప్రధానుఁడా—సుబ్బారెడ్డీ!

గీ. కాకమును గయావాలకుఁ ♦ గానుకేల?
కపిని గిష్కింధవానికిఁ ♦ గప్పమేల?
దాసితండాలతలమార్పు ♦ తంత్రములను
దల్లడించెడు మాకేల ♦ దాసి మరల!

ఇచ్చిన కప్పము దీసికొనక తప్పదుకావున—ఎవఁడురా! అక్కడ?

(నేపథ్యమున) ఏమిసెలవు?

సోమ—పద్మిని నిటు పంపుము.

(నేపథ్య) చిత్తము.

భ్రమ—ప్రభూత్తమా! ఆపండ్లు తిరుగఁబోయించి పరీక్షింపఁ దగును.

సోమ—భ్రమరసింగూ! నిన్నును సుబ్బారెడ్డిని బాగుగాఁ బరీక్షించి యాయుధములు మీయొద్ద నెచ్చటనైన నున్నవేమోయని శోధించినందులకు నీ వన్యథా యనుకొనవలదు. కాలము బహుకల్లోలముగానుండుటచేత నట్టిజాగరూకతను దీసికొనుచున్నాము నాగరకతరోజులలోనున్నమాయ లా అరణ్యవాసులగు మీకుఁ దెలియకపోవచ్చును. ఎందులకైన మంచిదని యంత జాగరూకతతో నుంటిమి. మన్నింపవలెను.

సుబ్బా—మహాప్రభూ! ఎంతమాట. ఎన్నికోటులప్రాణము లొక్క మీప్రాణములో నిమిడియున్నవి! వేయిబంట్లొక సేనాధిపతిలో నుందురు. వేయిసేనాధిపతు లొక్కరాజులో నుందురు. కాని, యనాగరికుల మగుటచేత మాకింతజాగ్రత్తలేదు.

మాలో మాయలేకపోవుటయే నిర్భయతకుఁ గారణము. మాకెంత సేపు నడవిజంతువుల బాధకాని మఱియొక్క బాధలేదు.

(పద్మిని ప్రవేశించును.)

పద్మి—మహారాజా! ఏమి సెలవు.

సోమ— అదిగో దానివంకఁ జూడుము. దానిని గొండదొరగారొకగు మాకుఁ గానుకగా నర్పించినారు. దానిని దీసికొనిపోయి సర్వమంగళకు నర్పింపుము. అడవి కోఁతిని బెంచినట్లు వినోదముగా నుండును. (అప) నీవు దానిని బాగుగా నొడలంతయు బరీక్షించి లోనికిఁ దీసికొనిపొమ్ము. ఎవ్వరిని నమ్మవీలులేదు. ఏమియట్లులికి పడెదవేల?

పద్మి—(అప) బాబూ ! ఒడలు సలసలగానున్నది.

సోమ—(అప) ఆపానకలోనివి పండ్లు అవికూడ బాగుగాఁ దిరుగవేయించి మఱి యమ్మాయికర్పింపుము.

పద్మి—చిత్తము. (భైరవన్నయొద్దకుఁబోయి) ఇటురా. ఈ పానక నెత్తిపై నెత్తుకొనగలవా ?

అబ్బీ నీవు వెలుపలకుఁ బోవచ్చును. (వాఁడు పోవును)

భైరవ—ఆఁడుదాననుగదా, ఇంతబరువెత్తఁగలనా ?

పద్మి—సరే ! నేనుగూడ సాయముచేసెదను. (తనలో) ఒడలు తడిమి దీనిని బాగుగా శోధింపవలెను. (ఇద్దఱు పానకనుబట్టి కొంత ముందునకు వత్తురు పానక యచ్చటఁబెట్టి పద్మిని ఆతనియొడలు తడుమును) (అపవారించి) ఏమే నీయొడలు మా యొడలివలె మెత్తగాలేదే అడవివారగుటచేఁ గాఁబోలు.

భైర—(అప) కోటలో ముద్దుపెట్టుకొనుట తప్పని మునుపంటివే. రాజుగారట నుండగాఁ గౌఁగిలించుకొనవచ్చునుగాఁబోలు.

పద్మి—అ–ఆ–భైరవన్నవే ?

భైర—కాదామఱి.

పద్మి—ఆనవాలు దెలియకుండఁగ నెంతక్రమ్మఱదలగ వేషము వేసినావురా.

భైర—మొదలేదొంగ–దానిమీఁదఁగవి. అటుపైన ధాసిదాని మగఁడు. రసపుష్టికి లోపమేమి ?

పద్మి—కాని నీ విప్పుడు లోనికెందులకు ?

భైర—ఈపండ్లబుట్టలోఁ బ్రశస్తమైన త్రాటినిచ్చెన యున్నది. . చప్పున నూడి రాకుండ పానకబుగ్గలలో గట్టిగ దాని నల్లి బిగించితిని. అది పెండ్లికూఁతురుగారి మేడ మీఁద నెక్కడగట్టినయెడల దిగుటకు వీలుగానుండునో యక్కడచూచి కట్టెదను. దాని వెంట రాత్రి మీరు దిగవలెను. మీకొఱకుఁ గ్రింద నేను గనిపెట్టియుందును.

పద్మి—పాపము. సర్వమంగళ యట్లు దిగఁగలదా ?

భైర—కాత్యాయనమ్మ నిచ్చెనవెంట యంతఃపురములోనికెక్కి యామెను దింపును-పిమ్మట ప్రక్క-ప్రక్కలను గనిపెట్టియున్న భ్రమరసింగు, సుబ్బారెడ్డి మొదలగు వారితోఁ గలసి బహిరంగముగా వీధిలోనికిఁ బోవచ్చును. నిచ్చెనను కట్టి నేనుబోయి యూరువెలపల నున్న కాత్యాయనమ్మను దీసికొనిరావలెను. నడు—నడులోనికి.

(వారిద్దఱు పాణకనుసాయపడి లోనికి దీసికొని పోవుదురు.)

సోమ—భ్రమరసింగూ ! ఇంతసేపును మీరు మాటలాడకుండ నేమియాలోచించుచున్నారు ?

భ్రమ—నిదర్శనమునకై తమకుఁ జూపవలసిన బంగారువస్తువులు మొదలగునవి యున్నవి. అవితీయుచున్నాము.

సోమ—బంగారువస్తువులైన మాకక్కఱలేదు. కప్పమిచ్చినారు కావునఁ జెప్పఁ దగిన రెండుపనులేవో చెప్పుఁడు.

భ్రమ—అవి చెప్పిరయే చూపింతును. ఆపనులే యన్నిటికంటెఁ ముఖ్యములు గావున శ్రద్ధతో వినఁగోరుచున్నాను.

సోమ—ఇప్పుడు నాకేమియుఁ బనిలేదు. సావకాశుఁడనై యున్నాను. సాయంకాలమగువఱకుఁ గావలసినంత తెలుపి. అటుపైన నేఁటఁబోవలెను. తిరుగ మూడు దినములవఱకు రాను. ఈదినమున మీరువచ్చుటవలన మిమ్ముఁజూడఁగంటిని. లేనియెడల మీరీయూర నేనువచ్చువఱకుఁ గనిపెట్టుకొని యుండవలసివచ్చియుండును.

సుబ్బా—మహాప్రభూ ! అటులైన మేమదృష్టవంతులము. మేముగూడ నీసాయంకాలమునందే సెలవుదీసికొనిపోయెదము.

సోమ—అలాగుననే.

భ్రమ—ఆరెండుపను లేవనఁగా-మొదటిది-భట్టిరాజుగారి భార్యను బట్టుకొని యామెయొడలిమీఁది వస్తువులను దీసికొని మీకుఁ బంపుట.

సోమ—ఆ-ఆ. మీదొర మాయందెంత విశ్వాసమును గనఁబఱచినాఁడు. ఏవి యావస్తువులు?

భ్రమ—ఇవిగో చూడుఁడు.

సోమ—(చూచి) ఇదుగో! ప్రతివస్తువుమీఁదను శారద యని పేరున్నది. చాల సంతోషించితిని.

భ్రమ—(తనలో) ఇవి నిజముగా దేవరాజు తల్లిగారి వస్తువులు కావు. అవియే యగునెడల వాని సీతనియొద్ద కాతఁడేల పంపియుండును? (ప్రకాశముగా) ఇంతకంటె సంతోషవార్త యేమనఁగా మారాజుగారు దేవరాజునుబట్టుకొని చెఱసాలలోనుంచినారు.

సోమ—ఇంత నాలస్యముగా నేలఁజెప్పితివి?

భ్రమ—భక్ష్యములలో మంచిదానిని గడపటివఱకు నుంతుముకాదా.

సోమ—వానిరాజ్యము మాకు స్వాధీనమైనట్లే. ఇఁక వాఁడున్నసరే, యీడిన సరే. కాని, అతఁడు మీయొద్దనేల? మీదొర మాయొద్దకే పంపలేకపోయినాఁడా? ఈ దొంగమొగవు దాసిదానినిఁ బంపుటకంటె వానినే మాకుఁ గానుకగాఁ బంపినయెడల మిగుల బాగుగనుండునే!

భ్రమ—అతఁడు దేవరాజేయని నిశ్చయముగాఁ దెలియకపోవుటచేతఁ బంపలేదు. ఆనిదర్శనము కలుగగానే బంపించెదము.

సోమ—ఆనిదర్శన మెట్లుకలుగును?

భ్రమ—ఇదిగో తీయుచున్నానుకాదా. (మఱియొకమూటవిప్పును) మహాప్రభూ! యీబాకెవనిది?

సోమ—ఏదీ? (చూచి) ఇది దేవరాజుదనియే నానమ్మకము.

భ్రమ—ఇట్టిబాకులు మఱియొకరి కుండఁగూడదా?

సోమ—ఉండవచ్చునులే. మఱియొకనిదర్శన మేదియు లేదా?

భ్రమ—తీయుచున్నానుగాదా. ఇదిగో! దర్భముడియుంగరము. ఇది తనకుఁ బురోహితుఁ డిచ్చినాఁడని దేవరాజు చెప్పినాఁడు.

సోమ—నాకది యానవాలు తెలియదు. ఎవఁడురా అక్కడ?

(నేపథ్యమున) చిత్తము.

సోమ—కారలోనున్న సేనాధిపతి నిటకుఁబంపుమని ప్రధానునితో నాసెలవుగాఁ జెప్పుము.

(నేపథ్యమున) చిత్తము.

సుబ్బా—అతఁ డెందులకు?

సోమ—అతఁడా దేవరాజు నొక్కసారి బాగుగాఁ బరీక్షింపవలసివచ్చెను. కాని మీదొరకు నాయందుగల యనురాగమునకు మిగుల సంతసించితినని పదేపదే నీవు చెప్పవలెను.

సుబ్బా—ఇది యాత్మాపేక్షగాని యనురాగము కాదు. తమకటాక్షము సంపాదించుకొనకున్న మాయాస్థానము నిల్చుమార్గములేదు. అందుచేత—

సోమ—ఆసందేహము తనకక్కఱలేదని చెప్పుము.

(శ్రీకంఠదాసుఁడు ప్రవేశించును.)

సోమ—శ్రీకంఠదాసా! ఈదర్భముడియుంగరము నీవెచ్చటనైనఁ జూచితివా?

శ్రీకం—(చూచి) ఇది పురోహితునింటిలో దేవరాజువంటివాని వ్రేలినిజూచితిని. అతఁడు బ్రాహ్మణుఁడని నేననుకొనుట కిదియే ప్రబలహేతువు.

సోమ—ఆదర్భముడియుంగరమే యిదియని నీవు స్పష్టముగఁ జెప్పఁగలవా?

శ్రీకం—ఆ—నడుమనున్న జవలో ఱాయి సగముమాత్రమేయున్నది.

సోమ—సరే! నీవు పొమ్ము.

శ్రీకం—(నిష్క్రమించును.)

సోమ—సుబ్బారెడ్డీ ! భ్రమరసింగూ ! పురోహితుఁడు, నతని భార్యయుఁగూడ మాయమైనారు. వారిజాడ యేమైన మీకుఁ దెలిసినదా ?

భ్రమ—ఇప్పటివఱ కేమియుఁ దెలియలేదు.

సోమ—అదికూడ కనిపెట్టవలయునని మీ దొరతోఁజెప్పుము.

సుబ్బా—చిత్తము. చిత్తము.

సోమ—కాని, యదేమి; దాసులిద్దఱు తిరుగవచ్చుచున్నారేల ?

(పద్మిని, నెత్తిపై పాణకపెట్టుకొని యాడువేసముతో భైరవన్న ప్రవేశింతురు)

సోమ—పద్మినీ ! ఇటురా! దాసి నేల యమ్మాయి కీయలేదు.?

పద్మి—ఇచ్చితిని. ఇది యే యూరనుండి వచ్చినదో, మాయింటియొద్ద స్నానము చేయించి మంచిబట్టలుకట్టించి సాయంకాలమైనతరువాతఁ దీసికొనిరమ్మని చెప్పినది.

సోమ—బుద్ధిమంతురాలు ! పండ్లుతీసికొనినదా ?

పద్మి—ఆ.

సోమ—అట్లైన నది నెత్తిమీఁదఁ బెట్టుకొనినది పట్టిపాణకకదా, నెత్తిమీద నేల పెట్టుకొనవలెను?

పద్మి—పెద్దదగుటచేతఁ జేతితోఁ బట్టుకొనినయెడలఁ గాలికడ్డము వచ్చునని నెత్తిపైఁబెట్టుకొన్నది.

సోమ—దానిమీఁద లంగా కనఁబడుచున్నదేమి ?

పద్మి—స్నానానంతరము ధరించుటకు సర్వమంగళమ్మగారు క్రొత్తదాని కిచ్చినారు.

సోమ—సరే ! (తనలో) మనసు సందేహించుచున్నదేమి చెప్పుమా. ఏదీ. ఏదీ. అదియొకసారి తీసికొనిరమ్ము. (భైరవన్న పాణక నెదుటఁ బెట్టును.)

సోమ—(తనలో) పట్టిభ్రమ మెుందితిని (ప్రకాశముగా) పద్మినీ క్రొత్తదాసికి మీయమ్మ మంచిగాగరాయే యిచ్చినదే !

పద్మి—చిత్తము.

సోమ—సరే ! అమ్మాయి యేమిచేయుచున్నది ?

పద్మి—ఇప్పుడే యభ్యంగన మారంభించినది.

సోమ—అబ్బో ! ఇంకొకజామువఱకుఁ దెమలదుకాఁబోలు నేమి ? నేను వేఁటకుఁబోవులోపల నామెను జూచుటకువీలులేదు—నేను వేఁటకుఁబోయితిననియు మూఁడురోజులలో వత్తుననియు నీవామెతో జెప్పుము.

పద్మి—చిత్తము. నేనుపోవచ్చునా ?

సోమ—(అప) ఆదాసినిమాత్రము నీవు బాగుగాఁ గనిపెట్టి యుండవలెనుసుమా.

పద్మి—(అప) చిత్తము.

సోమ—సరే ! నీవు పొమ్ము.

భీమ—సాయంకాలము కావచ్చినది మేముకూడ సెలవు తీసికొందుమా ?

సోమ—ఈదినము నాకు నూతన మిత్రలాభము కలిగినది.

సుబ్బా—సామంతలాభమని సెలవిచ్చెదరుగాక.

సోమ—ఘోరామీఁదనుంచిన మీ యాయుధములను దీసికొనుఁడు. అట్లు శోధించి నందులకు మీ రన్యథా యెంచకుండవలెను.

భీమ—ఆసందేహ మెంతమాత్రము వలదు.

సోమ—సరే! సంతోషము. నేనిప్పుడే పోవలసియున్నది. కాని క్షమింపుడు. కాని కోట యావరణములోనున్న మీ బసలో నీరాత్రి నేనుజేయించిన విం దారగించి కొంచెముసేపు శయనించి మఱి పోవలెను.

సుబ్బా—చిత్తము. ఇంతటినుండి మేము తినునది మీయన్నమే. ఇద్దఱు ముగ్గురు స్త్రీలతోడను నల్గు రైదుగురు సేవకులతోడను వచ్చియుంటిమి. మేము వెడలి పోవువఱకు మావారి రాకపోకల కభ్యంతరపెట్టకుండునట్లు మీభటుల కాజ్ఞాపించినఁ జాలును.

సోమ—మాబసలోనికి రాకపోకల కభ్యంతరములు కూడనా! మాసేవకులు కొందఱు మీయొద్దనుండి మీకుఁ దగిన సేవ చేయుచుందురు.

భీమ—అక్కఱలేదు. మాకుఁగావలసిన సేవకులు మాయొద్దనున్నారు. మీసేవ కులకు శ్రమమియ్యము. ఒక్కకునుకు గానిచ్చుకొని యేరాత్రియో వెడలిపోవుదుము. ఇదిగో! మేము కొండదొరగారి సేవకులమని చెప్పుసరికి మాకుఁ గోటగుమ్మమునుండి వెలుపలికి దారినిచ్చినఁ జాలు.

సోమ—నే నిప్పుడే యాజ్ఞాపించి పోయెదను. రామ్. రామ్.

సుబ్బా & భీమ—రామ్. రామ్. (అందఱు నిష్క్రమింతురు.)

ఇది షష్ఠాంకము.

---

శ్రీ

# పూర్ణిమ.

---

## సప్తమాంకము.

---

ప్రదేశము—దేవరాజు దుర్గమున అమ్మవారి (కాళికేశ్వరి గుడిముందు)

ప్రవేశము—కేశవన్న.

కేశ—జయా! కాళికేశ్వరికి జయ! జయా! కాళికేశ్వరికి జయ! శత్రుంజయా! శత్రుంజయా!

శత్రుం—(ప్రవేశించి) జయా! కాళికేశ్వరికి జయ! ఓరీ! కేశవ! యుద్ధమైన లేకుండ నెంతజనము చచ్చినదిరా?

కేశ—అదేరా మనదొర తెలివి! "మేమీదుర్గమును గాపాడుకొనలేము. మాకింత భుక్తికేమైన నేర్పఱచి దుర్గమును స్వాధీనపఱచుకొనవచ్చు"నని మనరాజు శత్రురాజులకు వార్తనంపఁగా నాతఁడంత తెలివితక్కువపని చేయుచున్నాఁడేమిరా యనుకొంటిని. సోమనాథుఁ డిద్దఱుముగ్గురు సేనాధిపతులతోఁ గొంత పరివారముతో లోనికిరాఁగానే ఇఁకనంతే_మిగిలిన సేనయంతయు నేమయ్యెనో కాని మాయమయ్యెను.

శత్రుం—ఏమగుట కేమున్నది? పాతాళలోకమంత గోఁతిలోఁ బడి చచ్చినది. మైలున్నరపొడుగున చందురు వంకగా మనరాజు పెద్దగోఁతి త్రవ్వించెనో యనుకొంటిమి. అది యిందులకు.

కేశ—రాజు కొలది పరివారముతో లోనికిరాఁగానే యాగోఁతిపైఁ గప్పినకప్పు లన్నియుఁ గ్రిందికిఁ బడిపోయినవా?

శత్రుం—అవి యూడిపోవునట్లుగా నేమిూఁటలెక్కడ మనరాజు పెట్టినాడో యెవ్వరికిని దెలియదు. ముందుపఙ్క్తివారందఱు సందెచీకటిని గోఁతిలోఁబడఁగా నాసంగతి దెలియక వెనుక వఱుసవారు పడిరి. ఇట్లూరకే వేలకొలఁది యుద్ధభటులు డిబుకు-డిబుకు-మంచితమాషా జరిగినదిరా ? నీ వింతవరకు నెక్కడనుంటివి?

కేశ—ఆపెద్దబురుజుక్రిందఁ గొందఱుయుద్ధభటులుచేరి తుపాకిమందుతోఁగాఁ బోలు దానినిఁ బగులఁగొట్టఁ బ్రయత్నింపఁగా భ్రమరసింగు సెలవు ననుసరించి యటుకు నూర్గురు జనులతోఁ బోయి క్రిందివారిపై రాలవర్షము గురిపించితిమి.

శత్రుం—మంచిపని చేసితివి. ఇదిగాక తొత్తుకొడుకులు మన్నెపుజ్వరముల చేత నెందఱు కడతేరిరిరా ?

కేశ—చావరా ? ఇదివఱకుఁ బదమూఁడు మాసములనుండి యొక్కటే ముట్టడి. మన కేకొండ కాకొండయే దుర్గము. ఏమెట్టకామెట్టయే కోట. ఎండలుచావనిదే ఏమైనది! బయటి యుద్ధాలనుకొన్నారు కాఁబోలు ముండకొడుకులు; తోలుజోళ్ళు దొడిగికొని టక్కుటిక్కుమని వెనుకకు ముందునకు నడచుచు గిఱ్ఱునదిరుగుచు గులుకుటకు. మనకెక్కడి కక్కడికే గోయి; ఎక్కడికక్కడకే గుట్ట. ఎక్కడి కక్కడికే దొంగ యూబి. అడుగడుగున కొక్క కొండపాము. నాభిలోపురుగుల లాగున మనమున్నాము కాని యీ పెద్దమ్మల తరమా ! ఇంతమహత్తుకూడ మన కాళికమ్మతల్లిది. ఆచల్లనితల్లి కటాక్షము.

(నేపథ్యమున) జయా! కాళికేశ్వరికిజయ! జయా! కాళికేశ్వరికిజయ !

శత్రుం—అది భైరవన్న గొంతువలెనున్నది. అచ్చట నెవ్వరో మూఁగియున్నట్లున్నారు. మనమక్కడకుఁ బోవుదమురా !

(ఇద్దఱు నిష్క్రమింతురు.)

ఇది విష్కంభము.

---

## సప్తమాంకము

---

ప్రదేశము—దేవరాజు దుర్గములోపలిభాగము.

ప్రవేశము—భైరవన్న.

---

భైర—సోదరులారా ? యుద్ధభటులను గొట్టుఁడు. పొడుముగాఁజేయుఁడు. కత్తి కంటెఁ గవిత్వముగట్టిది. కత్తితో నొక్కసారి యొక్కనిసే చంపవచ్చునుగాని కవిత్వముతో వందవందలను జంపవచ్చును. కొట్టుఁడు కొట్టుడు. ఏదీ యుద్ధగీతమును బాడెదను వినుఁడు. ఆవేశము దెచ్చుకొనుఁడు; వీరోత్సాహమును బూరించుకొనుఁడు (పాడును)

బేహాగ్—ఏకతాళము.

పగవారి—బిరాన—జంపుమోరీ—(పగవారి—)
లేరా—చేపాటికత్తిఁదేరా—నెత్తురుకాల్వబార-నెత్తిని వేయవేర-
లేలేరా—జాగేర—రా—రార—(పగవారి—)
(నేపథ్యమున) రా—వెనుకచూడక రా—రా-వెనుకచూడక రా

భైర—సెబాస్—సెబాస్ మాయోధులుత్సాహమున శత్రువులమీఁదికిఁ బోవుచున్నారు.

జుట్టు—క్రిందికివంచిపట్టు—గట్టిగలెంపపెట్టు—నెత్తినినేలగొట్టు
పెంజెట్టు—పడ్డట్టు—పడగొట్టు—(పగవారి)
(నేపథ్యమున)కొట్టు—ఊ—ఊ—కొట్టు (పెద్దధ్వనులు)

భైర—వహ్వా! రణోత్సాహులై మావారు శత్రువులను గొట్టుచున్నారు.

వేయి-తట్టులు దేరవేయి-నేలనుబెట్టిరాయి - కత్తిని నఱికివేయి
కొఱికేయి బఱికెయి నలిపేయి ॥పగవారి॥

(నేపథ్యమున) వేయి-వేయి-వేయి.

భైర—భైరవేశన్నకవిదార-కూర్చిన తేనెధార-జల్లున చొంగ
లూర-నాకార-తారిగార-మ్రింగారా॥పగ॥

(నేపథ్యమున) జయా-కాళికేశ్వరీ-జయా కాళికేశ్వరీ.

భైర—జయాకాళికేశ్వరీ! సెబాస్-సెబాస్. మాకొండవారే వరాహాపుర భటులను గెలిచినారు.

(నేపథ్యమున) అయ్యయ్యో-మెుఱ్ఱో-బాబో-మెుఱ్ఱో-చచ్చితిమిరో. మోటగాడే దెకొడుకులు.

భైర—వహావ్వా! వహావ్వా! శత్రుభటులు పరుగెత్తుచున్నారు. అన్నలారా! వారిని దెల్లమద్దిచెట్లవఱకు తఱుముఁడు తఱుముఁడు.

(నేపథ్యమున) ఓవరాహాపురీభటులారా! ఆగుఁడు. ఆగుఁడు. ఆమద్దిచెట్లయొద్ద దొంగగోతు లున్నవి. వానిలోఁ బడిపోవుదురు. జాగ్రత్త. జాగ్రత్త.

గీ. తిరుగుడీ, తిరుగుడి యుద్ధ ♦ ధీరులార
కొండదొరనిప్పుడే యీడ్చి ♦ కొట్టుచుంటి
సోమనాథు ప్రాభవమైన ♦ జూడవలదె
హరహరా మీరు కొజ్జాలొ! ♦ ఆఁడువారొ!

భైర—వరాహాపురసేనాధీశుఁడు, మారాజు నొకరి నొకరు కొట్టుకొనుచు నిక్కడికే వచ్చుచున్నట్లున్నారు. ఈప్రక్కనుండి మఱియొక్క యుద్ధగీతము పాడెదను.

(అని ప్రక్కను నిలుచును)

(దేవరాజు, కుమారసింగు ప్రవేశింతురు.)

కుమా—ఛీ! దేవరాజా! నీపౌరుషము!

గీ. కొండచరియలనుండిరాల్ ♦ గుప్పిస్మరించి
కొఱవిదయ్యంపువెలుతురుల్ ♦ కూర్పఁజేసి

కోటిపాతాళగుహలైనఁ ♦ గుస్తరించి
కోలఁకులంతటి దొంగయూ ♦ బుల రచించి
సేనసంతనుమ్రింగితి ♦ చీ! దురాత్మ!
గోఁతియుద్ధంబు నీనాఁడు ♦ జాతమందె
యూబియుద్ధంబు నీనాఁడె ♦ యుద్భవించె
పృథివి వీరాధివీరుఁడ ♦ వీవెకావె
శస్త్రశాస్త్రీయసాహితీ ♦ శక్తిలేక
పాఱితోఁ దొళ్ళితో గడ్డ ♦ పాఱితోడఁ
గూలి దౌర్భాగ్యముగుదిక్కు ♦ మాలినట్టి
పోకడలుగల్గు రణముల ♦ బూనితహహా!

దేవ—సేనాధిపతీ! మే మాటవినలము. బీదవారము కావున మాకు యుద్ధసాధనములు పారలు, గునపములకంటె నెక్కువయుండుట కవకాశము లేదు. కాని, పౌరుషము మాకు లేదనుట తప్పు. మాకును పౌరుషమున్నది కాని, నీమాటవలన నీకుఁ బూర్వస్మృతియే లేనట్టు స్పష్టమగుచున్న దేల?

గీ. నవ్యనారి కేళంపు బొం ♦ డ్లములతోడ
మామిడాకులతోరణ ♦ మాలతోడ
బుగబుగలఁజిమ్ము పన్నీటి ♦ బుడ్లతోడఁ
దొపురాణివాసపుఘుటా ♦ టోపుతోడ
కంకణపుఁబోరొనర్చిరి ♦ గాదె మీరు
గడ్డపాఱల రణములఁ ♦ గలదెతప్పు
మీదు పౌరుష మెంతయో ♦ మాది యంతె
స్థితిగతులభేదమే భేద ♦ గతికిఁగతము.

ఇప్పుడు మీకు బ్రహ్మరంధ్రి మంటినది. కావున, నట్లనుచున్నారు. ఫిరంగికత్తులిండ్లలోపలఁబెట్టి ఈఁదుపత్తులు చేతఁబట్టిన మాయోధులను—ఇనుపకవచము లూడఁదీసి బంగారుజలతారు బట్టల ధరించిన యోధులను—నెనిమిదివందలను గిక్కురుమననీయకుండ, నీరైన నడుగనీయకుండ మీరు చంపలేదా! భీష్మసన్నిభుఁడగు తండ్రిగారిని—హరహరా—అప్పుడు నేను విచారించితిని. ఇప్పుడు మీరు విచారింపవలసినదే కాని, మాది తప్పని యధిక్షేపింపనేల ? మీరు చేసినపని మంచిదా ? అదియే మేముచేసినదప్పా. ఇది యేటిన్యాయము ? గుణదోషగణనమునకు మీబాధయేనా కొలపాత్రము. మీదియుఁదప్పే. మాదియుఁదప్పే. శస్త్రసాహిత్యము నాకులేదనికదా యధిక్షేపించితివి?

సమా—ఔను. అధిక్షేపించితిని. మఱియొక్కమా టిప్పు డధిక్షేపించుచుంటిని.

దేవ—సరే ! నాకదిలేదనియే యనుకొనుము. నీకది యున్నదని చెప్పఁగలవా? కత్తులు, కటారులు, తుపాకులు, ఫిరంగు లుపయోగపఱచి యుద్ధముచేయుటమాత్ర మేమంతగొప్పపని! నీవట్లుజయింతువేనినీజయము నీకత్తిగుణమా! నీగుణమా? కత్తి మెండి దైననీబ్రతుకుకూడనంతటిదేకద. గ్రుడ్డియాఁడు దైనను దడుముకొనుచు ఫిరంగికి నిప్పంటింప లేఁడా ! దానికి విజయబిరుద మీయవచ్చునా? శత్రుమారకత నీబలమా? ఫిరంగిబలమా? నీభుజబలమే నీది. నీబుద్ధియే నీది. నీపౌరుషమే నీది. ఇతరసాధనములన్నియు మాయలే. మగవాఁడవైనయెడలఁ గత్తినిబాఱవేయుము; రమ్ము. నీకుసందేహమక్కఱలేకుండ నిదిగో నేను బాఱవైచితిని. (పాఱవైచును.)

గీ. కత్తివిడనివాని ♦ ఘనుఁడందురదికాదు
కత్తివిడుచువాఁడె ♦ ఘనుఁడుసుమ్ము
కత్తి యోధవరుని ♦ ఖ్యాతినిహరియించు
కలియఁబడుటలోనె ♦ గలదుయశము.
పరిబలజీవన్మహోదగ్ర ♦ బాహువులకె
తగుయశము చచ్చుకత్తికిఁ ♦ దార్పఁదగునె
దేవుఁడు మహాత్ముఁ డొసఁగిన ♦ దేహములనె
భండనమునందు సార్థక ♦ పఱుతమింక.

సమా—నీవు మతియున్నట్లు గానఁబడదే—

దేవ—వెఱ్ఱివానికి లోకమంతయు నట్లే.

సమా—అదేమి కత్తిపాఱవైచినావు? సాధనములన్ని మాయలే యనుచున్నావు. కలము నా ఖ్యాతి హరించుచున్నదని కవి దాని బాఱవైచునా ! పాఱవైచి దేవుఁ డిచ్చిన చేతితో వ్రాయునా ?

దేవ—నీయసందర్భప్రశ్నమున కుత్తరమీయకుండిన నీవు చిన్నబుచ్చుకొందువని చెప్పుచున్నాను. కలముతోఁ గవి వ్రాయుట లోక సంగ్రహార్థముకొఱకేకాని తనకేల ? అట్టి యావేశము కలిగినప్పుడు గాలి స్తంభించి వినున ట్లాతఁడు గానమొనర్చును. వేదము లెవరువ్రాసిరి? అవినిల్చినవా, లేదా ! యథార్థకవిత కాకాశమే పుస్తకము. కన్నున్నవానికిఁ జుక్కలవలెఁ దేజోమయాక్షరము లందులో గనుపించును. కత్తుల ప్రసంగములోఁ గవిత్వపు గొడవయేల ? నీవు కత్తినిబాఱవేయకుండ నున్నావు. కత్తిని వదలినయెడల గాత్రము నిలువదని భయమున్నవాఁడవు కావున, నీవు వదలవలదు. నేను రక్తహస్తుఁడనై నీతోఁ బోరెదను. రమ్ము.

సమా—నీవంటిమూఢుఁడను నేనుగాను—కాచికో. (అనికత్తియెత్తును.)

దేవ—(లాఘవమున వెనుకవైపునను వచ్చి యాతని చేయిబట్టుకొని కత్తి నవతల బారవైచి) గుర్రిద్ది నేనుఁగునైనఁ జంపఁగల యీ ముష్టితోఁ గ్రుద్దుచున్నాను కాచికో.
(ఊ-ఊ అని గ్రుద్దును.)

సమా—హా-హా. (నేలఁ గ్రాలును.)

భైర—(ప్రవేశించి) భళిర-భళిరా దేవరాజా! భళిర-భళిరా-దేవరాజా.

దేవ—భైరవకవీ!

భైర— ఒక్క-గ్రుద్దుతోడ వీని నుక్కడంచినావు నీవు ||భళిర||
మీదుశౌర్యమునకుఁ గాలిమెచ్చి తాండవించుచుండె.
భళిర-భళిర-భళిర దేవరాజ!||

దేవ—భైరవకవీ! స్తోత్రములు నలుచు. కాని, యాతఁ డెట్లున్నాడో చూడు—

భైర—(చూచి పాడును)

గుండెమీఁద గ్రుద్దు దగుల గుండెలవిసి పోయెనయ్యా-భళిర—భళిర-

దేవ—వాని నటుల నిమ్మళముగాఁ దొలఁగింపుము—

భైర—(వానిని లోనికిఁ దీసికొనిపోవును.)

(నేపథ్యమున) రే! దేవరాజా! దేవరాజా-సేనాధిపతి నవలీలఁ జయించితివఁటరా!

దేవ—చావని సేనాధిపతివి నీ వొక్కఁడ వున్నావా-కాని-కాని. నేనే లోప లికి వచ్చెదను. నీ విచ్చటి కేల?

(నేపథ్యమున) ఏమీ! నే నొక్కఁడనే చావక మిగిలితినా!

దేవ—తప్పాడితిని క్షమింపుము.

(నేపథ్యమున) నాచావో నీచావో యిప్పుడే తేలనైయున్నది. ఇదిగో వచ్చుచున్నాను.

దేవ—నీవు రావలదు. నీ సోదరుని రక్తముతో నీస్థల మపవిత్రమైనది. నేనే వచ్చుచున్నాను—నేనే వచ్చుచున్నాను. (దేవరాజు నిష్క్రమించును.)

పద్మి—(తొందరతోఁ బ్రవేశించి) అమ్మయ్యో-అమ్మయ్యో నేను రాను-రాజా! నాతోఁగూడ రావుము. (పరుగెత్తుకొని పోవును.)

సోమనాథుఁడు—(ప్రవేశించి) పోకు-పోకు. (పరుగెత్తి పట్టుకొనును.) భయ మేల పద్మినీ! తొందరపడకుము. నిన్ను నేను వృథగఁ జంపువాఁడను గాను. నాకుఁ దెలియవలసిన యంశము లన్నియుఁ దెలిసినవి. నీవు దాఁచిన వినియోగము లేదు. నిజ మేదో చెప్పు. నిన్ను వదలి వైచెదను. ఏమియు దాఁపకుము.

పద్మి—దాఁచుటకుఁగాని, వెల్లడించుటకుఁగాని, నాకు రహస్యము లేమియు లేవు. నావలనఁ దప్పేమియు లేదు.

సోమ—తప్పులేనియెడలఁ బిలుచుచున్నప్పటికిని నేను రాను రానని యిట్లు మొగము చాటువేసికొని రేల పరుగెత్తుచుంటివి? మీరు యథార్థముగ బలాత్కారము

ననే దొంగలచే దేవరాజుప్రోత్సాహమున హరింపఁబడి యిట నుంపఁబడినవారైనయెడల నీవు నన్నుఁ జూచుటతోడనే మహాప్రభూ! మాగతి యిట్టులైనది. అంతఃపురములలో నుండవలసినవార మడవులలో నున్నాము. మేము మీకొఱకు బెంగపెట్టుకొని యున్నామని యేడువవలసినది కాదా- అట్లు చేసితివా-చేయలేదు. పిలిచినఁగూడ రాకుండఁ బరుగెత్తుచుండఁగా నీయిందు దోషము లేదని బుద్ధిహీనుఁడైన నమ్మునా-నీవేల పరుగెత్తితివి?

పద్మి—నీతో మాటలాడుచుండఁగా దేవరాజు చూచినయెడల నాతలఁ బగులఁగొట్టునేమో యని పరుగెత్తితిని.

సోమ—(తనలో) సత్యమేయై యుండవచ్చును. దీనివలనగాని నాబిడ్డవలనఁగాని దోషమేమియు లేకయుండవచ్చును. అయినను మఱికొంత చూచెదను. (ప్రకాశముగా) దేవరాజు చూచినయెడల నీతలఁ బగులగొట్టునేమో యని భయపడుచుంటివా? దేవరాజిప్పుడు నీకు నాకంటె నెక్కువవాఁ డయ్యెనా? ఆతనియెడల భయమా? నాయందు నిర్లక్ష్యమా? లాఁడితెడుముండవైనప్పుడు కోటలోఁ బ్రవేశించితివే నాసొమ్ముమూలమున నింతదానవైతివే- ఇప్పుడు నన్ను గడ్డిపరకకంటె నీచముగఁ జూచెదవా- నీసిగదఱుగ- నీగొంతుకోయ్య. (వీపుపైఁ గొట్టును.)

పద్మిని—అమ్మయ్యో-అమ్మయ్యో-నన్నుఁ జంపుచున్నారు. బాబూ-బాబూ. (ఏడ్చును)

సోమ—గట్టిగ నేడువకు-ధ్వనియైనయెడల దౌడ విఱుగఁగొట్టెదను. (దౌడపైఁ గొట్టును)

పద్మి—బాబూ ! రక్షించు-రక్షించు.

సోమ—రక్షింతును. ఏల పరుగెత్తితివో చెప్పు.

పద్మి—చెప్పలేదా.

సోమ—దేవరాజు కొట్టుననియేనా-అది వట్టి అసత్యము-మరి యొకకారణమేదైనఁ జెప్పుము.

పద్మి—అంతకంటె మంచికారణము మఱియేదియు లేదు.

సోమ—లేకపోవుట యేల ? అది యేలాగు స్ఫురించినది ? ఆలోచించి మఱియొకటి చెప్పుము.

పద్మి—ఆలోచించుటకు బుద్ధియెక్కడనున్నది బాబూ !

సోమ—(తన్నుచు) బుద్ధిలేనిపనిఁ జేసితివనుట స్పష్టము. అది యేదో చెప్పెదవా లేదా? (రెండుచెవులు పట్టుకొనును.)

పద్మి—తప్పుజరిగినమాట నిజమే-బాబూ-రక్షించు-రక్షించు. కాని నావలన మాత్రము జరుగలేదు.

సోమ—ఆలాగుననా-దారిలోనికిరా- నిన్నేమియు నే ననను. నీవు దాసివి. నీ చిన్నరాణి యెట్లానతిచ్చునో యట్లు చేయవలసినదానవు. నీది తప్పనిచెప్పువానిది తప్పుకాని నీదికాదు.

పద్మి—బాబూ ! నేను మంచియుఁ జెప్పలేదు-చెడ్డయుఁ జెప్పలేదు_ పురోహితునిభార్య యొకయుత్తరముఁవ్రాసి దొంగలలో నొకనిచే చిన్నమ్మకు నాద్వారమునఁ బంపినది. ఆయుత్తరముఁ జూచుకొని చిన్నమ్మ యిచ్చుటకు వచ్చుటకు అంగీకరించి కాత్యాయనమ్మకు జాబుఁవ్రాసినది. ఆమె త్రాటినిచ్చెనమీఁద నంతఃపురములోనికెక్కి చిన్నమ్మను క్రిందికి దింపి యాచెగుట్టములమీఁద నిటకుఁ దెచ్చినది.

సోమ—(తనలో) హా-హా- ఎంతమాటవినుటకు బ్రతికియుంటిని! ఓపర్జన్యుఁడా నోరులేని యెన్నిచెట్లను బగులగొట్టిన వినియోగమేమి? ఒక్కపిడుగురాల్చి నాతలను సహస్రధా భిన్నమగునట్లు చేయరాదా- బ్రదుకీ వార్తతో సంపూర్తియైనది. కాని. యొకటిరెండు పనులు తరువాయిగ నున్నవి. అవి వేగ తీర్చెదను. (ప్రకాశముగ) పద్మినీ! నేను వినినదే చెప్పితివికాని క్రొత్తది కాదుసుమా. గోఁత పెట్టఁబడిన పురోహితుని నతనిభార్యను నిటకుఁ దీసికొనివచ్చుట ఎట్లు జరిగినదో చెప్పలేదేమి?

పద్మి—వారినెటులైన విడుపింపుమని సర్వమంగళమ్మ నన్నటకుఁ బంపినది. వారు గోఁతఁబెట్టఁబడిన ట్లామెయు నెఱుఁగదు. చెట్టునకుఁ గట్టఁబడినట్లుమాత్రము వినియుంటిమి. నే నటకుఁ బోయి వారికి సాహాయ్యము చేయలేక యల్లాడుచుండఁగా నింతలో దొంగ లటకు వచ్చిరి. వారినిఁ బైకిఁ దీసి యిటకుఁ దీసికొనివచ్చిరి. సర్వమంగళమ్మ సెలవును మీరలేక—రక్షించు బాబూ !

సోమ —(తనలో) సర్వమంగళమ్మకాదు_మాకోటకు శుద్ధమోత్కమ్మ దాపురించినది. ఇట్టిదగుననియే తెలిసినయెడల నొక్క వడ్లగింజతో నన్నియుఁ దీరియుండును నే. ఓభగవంతుఁడా! క్షత్రియుల కొట్టియాపదలనైనఁ గటాక్షింపుముగాని, ఆడుపిల్లలను మాత్రము కటాక్షింపకుము. ఒక్కపిల్లతోఁ గొండనెక్కవలయునని యుబ్బూటలూరితిని. అది యిట్లు చేసినది. ఇంకఁ జచ్చుటతప్ప వేఱుగతిలేదు. ఇప్పుడు తిరిగి చచ్చుటయేల? దానికి శీర్షోదయ మెప్పుడైనదో యప్పుడే నాశిరచ్ఛేదనమైనది. (ప్రకాశము) పద్మినీ! ఇదియు సరిగనే చెప్పినావు. సంతసించితిని. నీవును నదియు నిచ్చుటకు వచ్చి యెన్ని మాసము లైనదో జ్ఞప్తియున్నదా?

పద్మి—పదునైదు మాసములు కావచ్చినది. ఏదీ, వచ్చిన మూఁడుమాసముల లోపుననే యామె నీరు మోసికొనినది. నిండుగాఁ దొమ్మిదినెలలుమోసి యిద్దఱుపిల్లలఁ గనినది. ఇద్దఱును మగపిల్లలే.

సోమ—(తనలో) ఆ నిర్భాగ్యురాలి చావుతోనైన నీయమంగళత తెగటాఱునదికాదా! ఇఁక నొక్కతరముపఱకు సాగనున్నదా! (ప్రకాశముగా) చూడు పద్మినీ! ఇటురా. వసయనిచెప్పి రవంత వత్సనాభి దెచ్చి యరుగఁదీసి యాపిల్లల గొంతులలోఁ బోయఁగలవా?

పద్మి—బాబూ! నోరెఱుఁగని శిశువులు మీకేమి యపకార మొనర్చినారు?

సోమ—పద్మినీ! నిజమేసుమా! కోపముఁ బట్టలేక యట్లంటిని. క్షమింపుము. కాని పురోహితుఁను గనఁబడఁడేమి?

పద్మి—అతఁడెప్పు డా పశ్చిమపుగది విడచి యీవలకు రాడు.

సోమ—పోనీ! బ్రాహ్మణుఁడు. వానిజోలి మనకేల? చూడు పద్మినీ! మఱి యొక్కమాట; నీవుగుప్పాలనుండియుఁ గోటలోఁ బెరుగుటచేత నిన్ను నేను కన్నబిడ్డ వలెఁ జూచుకొంటినిగదా; అందువలననేగదా నిన్ను నాపిల్లనొద్ద నుంచితిని. ఇట్టి నీవే యట్లు చేసితివా? నేనెవ్వతెను నమ్మక నిన్నొక్కతెనే నమ్మియుంటినే! చూడు! పురోహితదంపతులను విడిపింపుమని అది నీతోఁ జెప్పినప్పుడు నీవు రవ్వంత నాచెవిని వైచిన యెడల నింత యుపద్రవము వచ్చియుండదుసుమా! తగుదీతిని సర్వమంగళను దిద్దుబాటు చేసియుందుము. దేవరాజశరణప్రదాత యగు పురోహితుఁ డిక్కడకు వచ్చియుండడు. ఈ తంత్రమే జరిగియుండదు. కావున సర్వమహోత్పాతమునకు నీవు కారణముగాఁ గనఁబడుచున్నావు. నావంకఁ జూడు. నిన్నేల చంపఁగూడదు? ధరణీనాథులకు నీవంటి దాసివలన రానిముప్పేమైన నున్నదా? అదిగాక నాతోడనే యీరహస్యము చెప్పినదానవు మఱియొకనితోఁ జెప్పకుందువా? కావున నిన్నుఁ జంపక తప్పదు. సంవత్సరమున కొక్కదాసిని గొంతు నులిమి చంపినయెడలఁ బైసంవత్సరమువఱకు మఱియుఁ దొందరయుండదు. అటుపైన వీలువెంబడిని మఱియొకదానిని ప్రభువులందఱు నాచరింపవలసినపద్ధతి యదిగా నా కగపడుచున్నది. ఈ నూతనాచారమునకు నేను మార్గదర్శిగా నుండవలసివచ్చినందులకు విచారించుచున్నాను. కావున—(వెనుకనుండివచ్చి గొంతు గట్టిగఁ బట్టుకొనును.)

పద్మి—ఉ. ఉ. (క్రిందపడి కొట్టుకొని చచ్చును)

సోమ—చచ్చినట్లేకద—చచ్చినట్లేకద!

(నేపథ్యమున) ఆ! చావకేమి! చావకేమి!

సోమ—(అదరిపడుచు) వారెవ్వరు? వారెవ్వరు?

(నేపథ్యమున)

**బిళహరి—ఆది.**

**సేనాధిపతి చచ్చినాఁడు-మన-దేవరాజుని చేతిలోను**

సోమ—(అటునిటుబరుగెత్తుచు) మిగిలిన యొకసేనాధిపతికూడచచ్చెనా?హా!హా!

**భైరవన్న—(ప్రవేశించి) ఏనాఁడు వినవట్టి యిట్టి ప్రతాపము మానాథునకుఁ గల్గె మాపుణ్యమహిమను ॥సేనా॥ (పాడును.)**

హా సోమనాథవర్మా-సోమనాథవర్మా-ఇదిగో వచ్చుచుంటిని. (పరుగెత్తును)

సోమ—(నిష్క్రమించును)

భైర—(పరుగెత్తుచుఁగాలికిఁబద్మినితగుల బోరగిలఁబడిపోవును.) హరహరా—యిదియేమి—కాలి కేదో యడ్డుతగులుటచేఁ బడిపోయితిని. దేవరాజా! దేవరాజా! సోమనాథవర్మ యటుఁ బరుగెత్తుచున్నాఁడు. పట్టుకో! పట్టుకో. హా! హా! ఇదియేమి?

పద్మిని చచ్చిబడియున్న దే ! అయ్యయ్యో ! ఎందుచేతనో యెక్కడను దెబ్బతగిలి నట్లగపడదే ?

దేవరాజు—(ప్రవేశించి) ఏఁడీ ! ఏఁడీ !

భైర—రాజేంద్రా ! పద్మిని యిక్కడఁబడి మృతినొందినది.

దేవ—ఏదీ-ఏదీ.

భైర—ఇదుగో చూడుఁడు. దెబ్బ యెక్కడ నగుపడదు.

దేవ—ఆతఁడు గొంతుపిసికి చంపియుండును. భైరవా ! దానినిటనుండి తీసి వేసి వెంటనే మామామగారిజాడ కనుపట్టుము. నేనుగూడ వెదకెదను. భ్రమరసింగు, సుబ్బారెడ్డి, మొదలగువారందఱు పోవుటచే నీకు శ్రమమిచ్చుచుంటిని క్షమింపుము.

భైర—పద్మినీ ! కవినిగట్టుకొని నీవు సుఖపడలేదు. నిన్ను గట్టుకొని కవి సుఖ పడలేదు. (ఎత్తుకొని నిష్క్రమించును)

(వెంటనే తెరయెత్తఁబడును. చంద్రశేఖరుఁడు జపముచేసికొనుచు ప్రవేశించును.)

(నేపథ్యమున) సోమనాథవర్మ యచ్చట నున్నాఁడా ! (మఱియొక కంఠరవ ముతో) లేఁడు లేఁడు. ఆతనికొఱకే వెదకుచున్నాము.

(అంతముసుఁగుతో సోమనాథవర్మ తొందరగాఁ బ్రవేశించును.)

సోమ—దాహము; దాహము. రవంతమంచినీరిచ్చి పుణ్యము కట్టుకొనవా? మహాత్మా ! రక్షించు. రక్షించు. (చంద్రశేఖరస్వామి కాళులపైఁ బడును.)

చంద్ర—నీమొగము నాకగపడుటలేదు. ఎవరవు నీవు ?

సోమ—ఎవఁడనైననేమి? నీపాదములమీఁదఁబడితిని. దాహమిమ్ము. రక్షింపుము.

చంద్ర—సోమనాథవర్మా! నీవేనా ?

సోమ—అట్లు చెప్పుకొనుటకు సిగ్గగుచున్నది. రక్షించు. రక్షించు.

చంద్ర—రక్షించితిని లెమ్ము. ఇదిగో ! తీర్థమును దీసికొనుము.

సోమ—(పుచ్చుకొని) నేను మీకభాగ్యగతుఁడనేకాక శరణార్థినిగూడను. మీరు నన్నెట్లు కాపాడుదురో! వెనుకటియంశము లేమియు మదిలోనుంపక రక్షించితినని యభయమిచ్చితి రదియే చాలును. కృతార్థుఁడనగుదునను ధైర్యముతో నుండవలసినదే కాని తీవ్రశాసనుఁడైన దేవరాజు నన్నుఁ జంపుటకై తఱుముకొనివచ్చుటచేతఁ బ్రాణము తహ తహ లాడుచున్నది. ఈ తలుపునకు లోన గొళ్లెము వేయనా?

చంద్ర—మరేమియుఁ దొందరలేదు. శాంతచిత్తుఁడవై కూరుచుండుము.

సోమ—తనకు విరోధియైననాకు మీ రభయ మిచ్చినందులకు మిమ్ము దేవరాజు శిక్షించునేమో.

చంద్ర—ఆతని కభయమిచ్చినందులకు నీవు నన్ను గోఁతిలోఁ బూడ్పింపలేదా. అట్లే యాతఁడును చేయునుగాక ! అయినను పరిసమాప్తియగువఱకు మీరెంతచేసినను మృతినొందనుగదా.

దేవరాజు—(ప్రవేశించి) మహాత్మా ! నమస్కారము. మామగారూ ! మీ రిటురండు.

చంద్ర—ఆతనికి నేనభయ మిచ్చితిని. కాన క్షమించి యాతనిని వదలిపెట్టుము.

దేవ—ఇదియేమి మహాత్మా!

చంద్ర—ఆతఁడు మహారాజు; నాకుఁ బూర్వప్రభుఁడు. ఇప్పుడు దీనుఁడై యున్నాఁడు. రక్షింపుమని వేడఁగ శరణమిచ్చితిని.

దేవ—అయ్యో! నేనాతని జంపుదునని నిశ్చయపఱుచుకొని యుంటినిగదా మహాత్మా !

చంద్ర—నేనాతని గాపాడుటకు సంకల్పించుకొని యుంటినిగదా నాయనా!

దేవ—స్వామీ! అట్లైన నన్నేమి చేయుమంటిరి?

చంద్ర—ఆతనిని రక్షింపుమంటిని.

దేవ—అట్లు జరుగుట కవకాశము లేనియెడల—

చంద్ర—నన్ను ముందుగాఁజంపి తరువాత నీ యిష్టానుసార మాచరించుకొను మందును.

దేవ—ఇట్లుచేయుట న్యాయమా మహాత్మా!

చంద్ర—ఈసోమనాథవర్మకుఁ బ్రబలశత్రుఁడవైన నీవు నే నభయమీయలేదా• నిన్నుఁ జంపుటకై వచ్చిన సేనాధిపతితో నసత్యమాడలేదా! నీమూలమున గులచ్యుతినిఁ బొందలేదా. అవియన్నియు నెంతన్యాయమో నిదియు నంతేన్యాయము. పూర్వమునఁ బ్రభుకటాక్షమునకుఁ బ్రాఁకులాడినవాఁడనుగాని యిప్పు డనేకకారణములచే విరాగినై యున్నాను. నాయనా! నాకు నీదయయు నక్కఱలేదు. ఆతనిదయయు నక్కఱలేదు. ఎప్పుడువచ్చునాయని వేచియున్న శంకరదేవుని దయ యింతరాలేదు.

(నేపథ్యమున) శత్రుయోధులు దొడ్డిగుమ్మమున గొందఱు ప్రవేశించి పశువుల పాకలను దగులఁ బెట్టుచున్నారు. రండు. రండు.

దేవ—భైరవన్నా!

భైరవుఁడు—(ప్రవేశించి) ఏమి సెలవు?

దేవ— (అప) చూడుభైరవా ! చంద్రశేఖరస్వామిగుహాలో సోమనాథవర్మ యున్నాఁడు. ఆతని నిప్పుడు చంపుటకు వీలులేకున్నది. నీవు గుహాకువెలుపల నే నీ జట్టులోని కొందఱతో గనిపెట్టుకొని యుండుము. వెలుపలికిరాగ నే యాతనిని బట్టుకొనుము. గౌరవపూర్వకముగాఁ గాళికాలయమున నుంచుము. ఆతనిని మీరెవ్వరుచంపదగదు. దుర్భాషలైన నాడఁదగదు. తెలిసినదా!

భైర—(అప) చిత్తము.

దేవ—(తనలో) చంద్రశేఖరస్వామి బుద్ధిపూర్వకముగా నీతనికి శరణమేలయొసగెనో! కాత్యాయనమ్మ నన్నడిగియుండి నాకభయమీయలేదే. ఆమెయిచ్చిన యభ

యమును స్థిరపఱచుట కీతఁ డెంత త్రొక్కులాటయోపడినాఁడు; వెనుకఁ గొలఁది దూరమున సోమనాథుని దఱుముచునే యుంటిమి. అతఁడీగుహ నెప్పుడు ప్రవేశించెనో, యెప్పుడు రక్షింపుమని కోరెనో, యెప్పుడాతఁ డంగీకరించెనో—ఏదీ—తెలిసికొనుటకొఱకే కదా నేనుగూడ గుహలోనికి వచ్చితిని. అప్పటికే శరణార్థిత్వము, సహాయప్రదానము కూడ నైపోయినవి. నాకేమోగాని సందేహముగా నున్నది. అంత ద్రోహము చేసి నను బూర్వప్రభునియందే యభిమాన మీతని కెక్కువగా నున్నది. ఈతఁ డాతనిని వదలకుండిన నేనేమి చేయవలసినది. ఈతఁడు నాకు మహోపకారము నొనర్చినాఁడు. పోయినప్రాణమును దిరుగ నిచ్చినాఁడు. అందులకుఁ గృతజ్ఞుఁడనై యుండవలయును. అట్లుంటిననియే నానమ్మకము. అతని, నాతనిభార్యను గోఁతినుండితీయించి వారి ప్రాణముల రక్షించితినిగాదా! అది నాభటులపనికాని నాపని కాదందురేమో! అట్టిగోతినుండి తొలఁగింపుఁడని నేను నాభటుల కాజ్ఞయిచ్చియుండలేదు. నిజమే. తీసికొని రండని మాత్రమే చెప్పియుంటిని. ఈతఁడిక్కడకు వచ్చినప్పటినుండియు నాయెడల నభిమాన మున్నవాఁడువలెనే గనఁబడలేదు. కాశికో, శ్రీశైలమునకో పోవుదును సెలవిమ్మని యెన్నిమాఱులో కోరినాఁడు. నేను వదలలేక యంగీకరింపలేదను కోపము యాతనికున్నదేమో అంతేకాని నాపై శత్రుత్వమున్నదని నేను చెప్పలేను. పోని భార్యయందైన నభిమానముతోఁ బ్రవర్తించుచున్నాఁడేమోయనఁగ నదియులేదని కాత్యాయనమ్మవలన వినికొంబోలు నారాణి చెప్పుచున్నది. కాత్యాయనమ్మ మాత్రము నాయందు దల్లివలె నిశ్చలకరుణాన్వితయైయున్నది. నాప్రాణముల రక్షించినందుల కీటోగిదియో యెఱుఁగకయో వారిప్రాణములు నేను రక్షించితిని. అంతటితో బగులు తీరిపోవదా? కాని, యాతఁడు నాకొఱ కసత్యమాడితినని మతభ్రష్టతనొందితినని చెప్పినాఁడు. వీనికేమి ప్రత్యుపకృతియున్నది! లేదని యూరకుండవలసినదేనా—శాశ్వతముగా నతనిఋణమునఁ బడియుండవలసినదేనా—సోమనాథవర్మను గుహలోఁబెట్టుకొని యట్టె యున్నినా ఘేన గూర్చుండినయెడల నోరుమూసికొని యుండవలసినదేనా—నాశత్రువునకు దానా శరణప్రదాతయగుట! మంచిమాటలతోఁ జెప్పిన వినకుండనున్నాఁడు. ఈతనిని బట్టినయెడలఁ దనప్రాణము దక్కదని మామూప యిచ్చుటకుఁ జేరినాఁడు. ఇప్పుడేమి చేయవలయును? నాశపథముమాటయేమి ?

(నేపథ్యమున) దేవరాజా ! దేవరాజా ! పశువులపాక యంటుకొన్నది. ఎవ్వరు రాకుండనున్నారు.

దేవ—(తనలో) అంతకంటెఁ బెద్దపశువులపాక (హృదయముఁజూపి) యిచ్చటఁ దగులఁబడుచున్నది. (ప్రకాశముగా—అప) భైరవా ! జాగ్రత్త. (నిష్క్రమించును)

సోమ—బ్రాహ్మణోత్తమా ! నాప్రాణములు రక్షించితివి. మిక్కిలి సంతసించితిని. నీవు నీభార్యతోఁ గుట్రచేసి యామెచేత నుత్తరము వ్రాయించి యామెను మాయూరికిఁ బంపి నాకూఁతు నిచ్చుటకై మోసమునఁ దేకుండునెడల మఱియింత సంతసించి యుందును. నాపుత్రిక యిక్కడకు నీతంత్రమున వచ్చుటచేతనే నేనిక్కడకు రావలసి వచ్చినది. ఈ సైన్యమునంతయుఁ జంపుకొనవలసివచ్చినది. నేనింత భ్రష్టత నొందవలసి

వచ్చినది. నిన్నిట్లు లాశ్రయింపవలసివచ్చినది. ఇప్పటికైనఁ బ్రాణమునుగూర్చి సంక్లేశ పడవలసివచ్చినది. నీకుఁబోయిన దొక్క కౌగిలము; నాకుఁ బోయినవి రెండురాజ్యములు. మానము—కూఁతురు—సైన్యము—ధనము—ఇఁకఁ బోవనున్నది ప్రాణము—అగ్నిపర్వతము, భూకంపము, మహామారియుఁ జేయఁజాలని యపకృతిని మనుష్యమాత్రుఁడవు, బ్రాహ్మణ మాత్రుఁడవు. అందులో భటమాత్రుఁడవు ప్రభుని యెడలఁ జేయఁజాలితివి. నీకు తగులోక మందుఁ దగినశిక్ష యుండవలయునేమోకాని మనుష్యబుద్ధిచేఁ గల్పింపఁజడినశిక్ష యేదియు నీకుఁ జాలియుండదు. నీ విందుల కేమి చెప్పెదవు? మాటలాడవేమి? మాట లాడవేమి ? ఆహా ! యోగసమాధియందున్నాఁడు. తన్నుఁదాఁ జూచుకొనుచున్నాఁడు సెబాస్ !

> గీ. గొంతుకోఁత ప్రాణి ♦ కోటి కొసంగుచు
> ముక్కు మూఁతచేత ♦ బొదలినావు
> మనుజపతిని భ్రష్ట ♦ మానరాష్ట్రునిఁ జేసి
> బ్రహ్మరాజ్యపదవిఁ ♦ బడసినావు.

సోమ—(లేచుచున్నాఁడు) అదియేమి ! మడిబట్ట లారవై చుకొను నూలుత్రాడా! ఇది విప్పెదను. (విప్పును.) ఒకకొస యాస్తంభమునకుఁ గట్టెదను. (కట్టును.) నడుమ నుచ్చువేసెదను (వేయును.) ఈ యుచ్చు వీని మెడకుఁ దగిల్చెదను (తగుల్చును) ఇఁక లాగుటయే తరువాయి ఊఁ. ఊ. (లాగును.)

చంద్ర—ఊఁ. (అని గట్టిగమూల్గి గిజగిజఁ గొట్టుకొని చచ్చును)

సోమ—హా! హా!

> గీ. రజ్జువందున సర్ప వి ♦ భ్రాంతి కలుగు
> ప్రాకృతికునకు మోక్షసం ♦ పత్తిలేదు
> నిశ్చలసమాధిఁ జేరిన ♦ నీదుమోక్ష
> సంపదకు రజ్జువే సత్య ♦ సర్పమయ్యె
> పాపబుద్ధిని రాజును ♦ బాడుసేయు
> బ్రాహ్మణాధము నిల్లె చం ♦ పంగవలయు
> దీనికంటెను సుందర ♦ మైనమార్గ
> మేదొ భావిభూనాథు ♦ లీక్షింత్రుగాక.

ఇదిద్యైనదికదా! ఇంక నే నిక్కడ నెందులకు! అంతిపురికై పునకుఁ బోవుదును. (తొంగిచూచి) ఎవ్వరులేరు. (పైకివచ్చును)

భైర—పట్టుకో పట్టుకో. ఆఁగు ఆఁగు. అదిగో పట్టుకో. దేవరాజా! దేవ రాజా! ఇటురా.

సోమ—(పరుగెత్తుచు నిష్క్రమించును)

భైర—(నిష్క్రమించును)

దేవ—(ప్రవేశించును) పశువులన్నియుఁ బరశురామ ప్రీతినొందినవి. చంద్రశేఖరస్వామియోచనతో సమయమునకుఁ బోలేకపోయితిని.

(నేపథ్యమున) అయ్యయ్యో! చంద్రశేఖరస్వామి చచ్చి పడియున్నాఁడు.

దేవ—హరహరా! హరహరా! ఎంత దుర్వార్త వింటిని. సోమనాథవర్మయే చంపి పాఱిపోయియుండును. ఇట్లు జరుగునని సందేహాలేశమైన మనస్సునకుఁ దగుల లేదుకదా! అట్లే యైనయెడల గుహను గనిపెట్టుకొనియే యుందునే! హరహరా! చంద్రశేఖరస్వామిగారి నిశ్చలయోగ్యతను గూర్చి భ్రమపడితిని. (లెంపలు వైచుకొనును) ఆయనను జంపిన సోమనాథుని వెంటనే చంపుటకంటె నిప్పుడు కర్తవ్యమేమియు లేదు. మాతండ్రిగారిని జంపించినాఁడు. ఇతనిని జంపుదునని యప్పుడే శపథ మొనర్చితిని. ఇప్పుడు గురువుగారిని జంపినాఁడు. అతని పాపమే హెచ్చినదికాని అతని కిందులకు నేను జేయఁబోవుశిక్ష హెచ్చుకాలేదే! రెండుపాపములకు రెండుపర్యాయములు జంపఁ గలిగినయెడల గురుఋణము దీర్చుకొనఁగలను గాని లేనియెడల నెట్లు? అందువలన నీ మహానుభావుని ఋణము నాకుఁ దీరునదికాదు.

(నేపథ్యమున) మహారాజా! సోమనాథవర్మ పట్టుపడినాఁడు.

దేవ—అతని కేమియు హానిఁజేయకుఁడ నిట్లు తీసికొనిరండు.

(భైరవన్న, భీమన్న పట్టుకొనఁగా సోమనాథుఁడు ప్రవేశించును)

దేవ—ఈతఁ డెక్కడ దొఱకినాఁడు?

భైర—అంతిపురి సమీపమున—

దేవ—అయ్యయ్యో! అక్కడనే? సోమనాథవర్మా! నీకూఁతును జంపుటకే యక్కడకుఁ బోయితివా?

సోమ—కాదు. దాని పిల్లలను జంపుటకు—

దేవ—హరహరా! ఎంతపాపాత్ముఁడవు? పిల్లలయెడల నంత క్రూరవృత్తియేల?

సోమ—నీకింకఁ దెలియదు. పిల్లలనే చంపవలయును. పిల్లలు పెద్దవారైన పిమ్మటఁ దల్లిదండ్రులను మోసపెట్టుదురు. పరాభవింతురు. వంశమర్యాదను వల్లకాడు చేయుదురు. నాకొక్కగానొక్క యాఁడుపిల్లది. దానిమూలముననే నేను మొఱఁడనై నా ప్రబలశత్రుఁడవైన నీయెదుట నిలువఁబెట్టబడితిని. దానినిఁ జిన్నతనము లోనే మెత్తని బ్రహ్మరంధ్రస్థానమున రవంత నొక్కిచంపినయెడల నింతరాకయుండును.

దేవ—ఛీ! ఛీ! ఇఁక నట్టి సంభాషణము వలదు. భైరవా! కత్తితేరా.

భైర—చిత్తము. ఇదిగో! (ఇచ్చును)

దేవ—(తీసికొని) భైరవా ॥ వానిని వదలివేయుము.

భైర—(వదలును)

సోమ—(అటునిటు పరుగెత్తఁబోవును)

దేవ—(సోమనాథునిఁ బట్టికొని) క్షత్రియుఁడవు. పాఱిపోయెదవేల ?

సోమ—నీవు మహాశూరుఁడవా ! ఏమి! సంఘమరణకల్యాణములో చచ్చుచున్న దండ్రినోట, రవంత నీరైనఁ బోయకుండ పాఱిపోయిన మహాశూరుఁడవు నీవే కావా ? సమయము వచ్చినప్పు డందఱు పాఱిపోవువారే ! వాఁడు భీరుఁడని వీఁడు శూరుఁడని యెంతమాత్రము భేదములేదు. ధైర్యము తెచ్చుకొన్న గుణము పాఱిపోవుటయే సహజగుణమా.



దేవ—ఛీ. ఛీ. తుచ్ఛప్రస్తావనఁ గట్టిపెట్టుము. ఇదివఱకు నీ వొనర్చిన పాపముల పరిహారమునకై భగవంతునిఁ బ్రార్థింపుము.

సోమ—నే నెవ్వరియెడలను పాపమాచరింపలేదు. పరులు నాయెడలఁజేసిన పాపములకుఁ బ్రతిహతి చేసితిని. అది పాపమని నీ వెట్లుచెప్పఁగలవు ?

దేవ—పోనీ. ఇదిగో ! నఱుకఁబోవుచున్నాను. హర హరా. (నఱుకఁబోవును)

సర్వమంగళ—(తొందరతోఁ బ్రవేశించి, దేవరాజు చేయిబట్టుకొని) ప్రాణనాథా ! రక్షించు. రక్షించు.

దేవ—ఏమి! ఏమి! పిల్లలుసుఖముగా నున్నారుగద?

సర్వ—ఉన్నారు—ఉన్నారు. కాని రక్షించు. రక్షించు.

సోమ—(గట్టిగా తొందరతో) దేవరాజా ! నన్ను శీఘ్రముగాఁజంపు. చంపు. అయ్యయ్యో ! అయ్యయ్యో ! నాపుత్రిక నాకన్నులఁ బడుచున్నది. నేను దానివంక జూడలేను. అయ్యయ్యో ! నాసమీపమున నిల్చినది. అహాయుస్పర్శమైన నాకువలదు. కన్నులు మూసికొన్నను దానికంఠరవము వినఁబడుచున్నది. నేను వినలేను—వినలేను—చంపు—చంపు—శీఘ్రముగాఁజంపు. నాయనా! చంపవా? (అని గట్టిగ నేడ్చును.)

దేవ—సర్వమంగళా! ఎవరిని రక్షింపుమంటివి !

సర్వ—నాతండ్రిని—నాతండ్రిని.

సోమ—వలదు—వలదు. నాయనా ! నీకాళ్లఁబడెదను. పుణ్యముగట్టుకొనుము. అయ్యయ్యో ! తిరుగ దానిమాట వినఁబడుచున్నది.

సర్వ—(అపవారించి) ప్రాణనాథా ! నేను నీతో మాటలాడవలసియున్నది. నాతండ్రినిప్పుడే యీభటులచే నెక్కడకైనఁ బంపుము.

దేవ—(అప) అంతతొందరయేల ?

సర్వ—ఉన్నది. రక్షింపుము.

దేవ—(అప) భైరవా ! వీనిని మీరిద్దఱుఁ గొనిపోయి కారలో నుంపుఁడు.

(భైరవన్న, భీమన్న, సోమనాథునితో నిష్క్రమింతురు)

దేవ—ప్రాణకాంతా ! ఏమిసెలవు ?

సర్వ—నాతండ్రిని రక్షింపుమని ప్రార్థింతును.

దేవ—ఏల ?

సర్వ—ఏలయని యడిగెదవేమి ? సంధ్యావందనము చేయవలదని యెవ్వఁడైన జెప్పినయెడల నేల యని ప్రశ్నింపవచ్చును. అసత్య మాడవలయునని యెవ్వఁడైనబలికిన యెడల నేల యని ప్రశ్నింపవచ్చును. నాతండ్రిని జంపవలయునని నేను గోరినయెడల నట్లు పలికెదవేలయని నీవు ప్రశ్నింపవచ్చును. అంతేకాని వేదశాస్త్రసమ్మతమైనదియు మనుష్యవిధియైనదియు—

దేవ—అయ్యయ్యో! బ్రహ్మహత్య చేసినవానిని, స్త్రీహత్య చేసినవానిని—

సర్వ—అతని కపకృతిగావించినప్పు డాతఁ డూరకుండునా?

దేవ—అయ్యయ్యో మన పిల్లలను జంపవలయునని యంతఃపురములోనికిఁ బోయి తినని యిప్పుడే కంఠోక్తిగా నాతోఁ బలికిన మీతండ్రిని రక్షింపుమనుట న్యాయమా? నీకొడుకులను జంపఁదలఁచిన యాతని నీతండ్రియని యింక ననఁదగునా?

సర్వ—ఎట్లైనను నాకాతఁడు పూజ్యుఁడు. అతనిని మీరేమియుఁ జేయఁ గూడదు. ప్రాణనాథా! మిమ్ము గడ్డము బట్టుకొని ప్రతిమాలుకొనుచున్నాను. నాప్రార్థన నంగీకరింపుఁడు.

దేవ—ప్రాణప్రియా! నీమాటకడుగుదాఁటినవాఁడనుగాను. నిన్ను బ్రాణమునకంటె నెక్కువగాఁజూచుకొనుచున్నాను. నీవేనాగృహలక్ష్మివి. నాబ్రతుకునకంతకు నీసౌభాగ్యమే యాధారము. నిన్నుఁ జూచుకొనుచు మహానందమున నున్నాను. ప్రాణము లఱచేతిలోఁ బెట్టికొని బ్రాహ్మణి పాదములమీఁదఁబడి యడవులపాలై దొంగలకుఁ జిక్కి తుదకుఁ గాళికి వేఁటపోఁతుగాఁ జేయబడిన నావంటి పరమనిర్భాగ్యుని సర్వమంగళస్వరూపవు—సర్వమంగళగుణవు—నైన నీవు ప్రేమించి వరించి తండ్రిని గణింపక రాజ్యమును వదలి సర్వసౌఖ్యములవదలి అయ్యయ్యో! దొంగల కధిపతినై యధముఁడనైన నాయొద్దకు వచ్చి నన్ను సుఖపెట్టి చంద్రబింబములవంటి పిల్లలను నాకుఁ గటాక్షించి నావంశమును నిలువఁ బెట్టితివి. నీవు చేసిన మహోపకార మెన్నఁడైన మఱువఁగలనా! నన్నుగక్షింపుము. రక్షింపుము—ఇవి చేతులుకావు. నీవడిగిన కోరికకు 'లేదు' అని పలుకవలసిన పాపము, కృతఘ్నతయు నాకు రాసియకుండ రక్షింపుము. సర్వమంగళా! నీకువిధేయుఁడను, నాకు మఱియేదైన నాజ్ఞాపింపుము.

సర్వ—ప్రాణనాథా! సంతోషము. మన పిల్లల నిక్కడకుఁ దెచ్చెదను. ఉండుు.

(అని వెడలఁబోవును)

దేవ—ఇక్కడికిఁ బిల్ల లెందుకు?

సర్వ—నాథా! చంటిపిల్లల నొకసారి చూడవలయునను కోరిక మెండుగఁ గలిగినది. మఱియేదైనఁ గోరినయెడల నిచ్చెదనని యంటివి కావున నన్నుఁజంపుము.

దేవ—హరహరా! (చెవులు మూసికొనును.)

సర్వ—సందేహింపకు-సందేహింపకు. తండ్రిని భంగపఱచిన పగము నీచురాలు భర్తను బహుమానించునా? నేను పరమ దుర్మార్గురాలను. వంశమర్యాదను విడిచితిని.

నేను బ్రతుకఁదగదు. నన్నుఁ జంపినతరువాత యీ దిక్కుమాలిన యడవి విడిచిపెట్టి పొమ్ము. ఇద్దఱుపిల్లలను భద్రముగఁ బెంచుకొనుము. అయ్యయ్యో! పిల్లలనుదేవలదని యంటివి ఒక్కసారి చూడవలయునని యున్నది. ప్రాణప్రియా! ఒక్కమాట—పిల్లలకు నీచస్త్రీలచేమాత్రము పాలిప్పింపకుము. బీదవాండ్రైన క్షత్రియకాంతలచే నిప్పింపుము. నేను గుడిచికొనిన దాసీస్తన్యమే నాకీ వంకరబుద్ధి పుట్టించినదని నాసందేహము. లే! నాథా! లే! నమస్కారము. ఊఁ—కత్తియెత్తుము. (తీసి యతనిచేతఁ బెట్టును.) మామగారు పైవాఁడు. నేను నీదానను. స్వంతవస్తువుండగాఁ బైవస్తువేల? ప్రాణప్రియా! కానీ!

దేవ—వలదు. అయ్యయ్యో! నాకంత మహాపాపమువలదు. నేనంత దురాత్ముఁడను గాను. నీతండ్రినైన నేల వధింపవలసివచ్చినదనఁగ నాతఁడు మాయెడ మహాపకారమొనర్చినాఁడు. మాకుఁ బ్రబలశత్రుఁడు. నీకళ్యాణచ్ఛలమున మాకోటకు మమ్మాకర్షించి మాతండ్రిగారిని—హరహరా! ప్రాణప్రయాణకాలమున నాతనితో నేనట్టి శపథమును జేసియుంటిని. శపథమును దీర్చుకొనలేని క్షత్రియుని బ్రతుకెందులకు? నేను మాతండ్రిగారికీ ఋణమును దీర్పకుండినయెడల నాకుత్తమలోకము లుండవు. నా ధర్మపత్నివైన నీవు నాయూర్ధ్వగతికై చూడనక్కఱలేదా!

సర్వ—ప్రాణప్రియా! మరణించి పైలోకమునకుఁబోయిన తండ్రిగారి యాత్మశాంతికై యింతగాఁ దహతహలాడుచున్నావే; నీవంటి ప్రాణమే నాదికూడఁగదా! నీతండ్రి నీకెట్టివాఁడో నాతండ్రి నాకట్టివాఁడుకాఁడా? అతని క్షేమమునకై నీ వెట్లు తొందరపడుచుంటివో యీతని క్షేమమునకై నేనట్లు తొందరపడుట తగదా? ఎటు వచ్చినను నాఁడుదానినై పోయితినని లోకువ చేయవచ్చునా? ఆఁడుదానవై పుట్టుట నాలోపమా! నేను మగవాఁడనైనయెడల నిన్నిట్లు బ్రతిమాలుకొందునా! ఎందులకుఁగాని యాఁడుబ్రతుకువచ్చినది. అస్వతంత్రురాలనుగదా! నాకోరికఁ జెల్లించువాఁడు నాభర్తకంటె మఱియెవ్వఁడు? తండ్రినిజంపిన దారుణస్వభావురాలు నీకు ధర్మపత్నియెట్లగును? ధర్మపత్నియన్నమాట గౌరవముకూడ దగులఁబెట్టనేల? నాప్రార్థనమేమనఁగా నాఘటమునఁ బ్రాణములుండఁగామాత్రము నాతండ్రిని వధింపకుము. నీకాళులపైఁ బడుచున్నాను. రక్షించు. (కాళులపైఁ బడును.)

దేవ—అయ్యయ్యో! నాకాళ్ళువదలుము. వదలుము.

సర్వ—నాకభయమిచ్చినగాని నేను వదలను

దేవ—అట్లే చూచుకొనవచ్చునులే—ముందువదలుము.

సర్వ—ఇదిగో వదలితిని. ఏమిచూచుకొనవచ్చునో చెప్పుము.

దేవ—సర్వమంగళా! నావంకఁజూడు. నీవింత పట్టుపట్టకు. నీతండ్రి పెద్దవాఁడైనాఁడు. దౌహిత్రజననవార్తవినినాఁడు. సర్వసైన్యము చావఁగఁ జూచినాఁడు. కష్టములచే మిగులఁ గాసినొందియున్నాఁడు. అట్టి క్షత్రియవర్యున కింతట మరణము మంచిది కాని, బ్రదుకు మంచిదికాదు. అతనికేమి—సమస్తభోగముల ననుభవించినవాఁడు. అతని కొఱకు నీ వింత పట్టు పట్టవలదు. నామాట వినుము.

సర్వ—అటులైన నాథా ! నేను జెప్పెదను. మీతండ్రి మరణించినాఁడు. రాగద్వేషశూన్యమైనస్థితిలో నున్నాఁడు. బ్రతికియుండఁగా శత్రుత్వముగాని, మరణించిన తరువాత నేమిశత్రుత్వము? మా తండ్రిని జంపినయెడల మీతండ్రియాత్మ శాంతించునని నీవు చెప్పినమాట సమంజసముకాదు. అట్లు శాంతించునని నేను నమ్మను.

దేవ—శాంతింపకపోవచ్చునుగాని, నాశపథమో ! నాశపథమో !

సర్వ—మఱి మాతండ్రియో—మాతండ్రియో.

దేవ—మీతండ్రిని నేనుగావఁజాలనందులకు లజ్జపడున్నాను.

సర్వ—పోనిమ్ము ! సంతోషమే. (కత్తిని దీసికొనును)

దేవ—అయ్యయ్యో ! ప్రేయసీ ! కత్తినిదీసికొంటివేమి? ఆత్మహత్మ జేసికొందువా ! వలదు. వలదు. (చేతులు పట్టుకొనును)

సర్వ—ఆత్మహత్య చేసికొనను. ప్రాణనాథా ! ఒక్కసారి నిన్నుఁ గౌఁగిలించుకొందును. (గట్టిగా గౌఁగిలించుకొని) ఇఁకఁజాలు. నామనసు మిగుల సంతుష్టిజెందినది. ఈ జన్మమున కీపరీరంభము చాలు. కాని నాథా! పిల్లలను దేనిచ్చితివి కాదుకదా. ప్రాణము పీఁకుచున్నది. పోనిమ్ము. పోనిమ్ము. ఇఁక నీవు దూరముగాఁ బొమ్ము.

దేవ—ఏల ? కత్తినేలదీసికొంటివి ?

సర్వ—నీవు మాతండ్రిని గావలేనని పలికితివి. నేనే కాచుకొందును.

దేవ—అదెట్లు ! అదెట్లు !

సర్వ—నాతండ్రికి నేనొక్కతెనే బిడ్డను. అతని యిహపరగతులను జూడవలసిన దానను నేనే. ఆఁడుదాననైననేమి ? మగవారందఱు మగటిమితో నున్నారా ! అంతరాత్మకాఁడుతనమేమి? మగతనమేమి? దేవరాజా! ఇఁక నీవు నన్ను బావగా భావింపుము. భార్యగా నెంచకు ఇదిగో కత్తి—రా—రా—మాతండ్రి నెట్లు చంపెదవో చూచెదను. నడు కారాగృహమునొద్దకు. అతనిని వదలించెదను. చేతనైనయెడల నన్నడ్డుకొనుము.

దేవ—సెబాస్—సెబాస్—వీరకాంతా! ఏమి దివ్యదర్శనమిచ్చుచున్నావు! వేళమున కలంకారమైన నిన్ను భార్యగాఁ బడసిన నాకంటె మహాదృష్టశాలి ప్రపంచమున నెవ్వఁడు? నీకౌఁగిటికంటెఁ ద్రిలోకరాజ్యాధిపత్యమైన నాకెక్కువది కాదు. కత్తిచేతిలో నుండగానే యొక్కసారి కౌఁగిలించుకొననిమ్ము. (అట్లు కౌఁగిలించుకొనును) (గట్టిగ తన తలఁబట్టుకొని) అయ్యయ్యో—అయ్యయ్యో — బ్రహ్మరంధ్రస్థానమునఁ గొట్టినారు. (గడగడ వడఁకుచు గద్గదికతో) అదిగో! నాతండ్రి అదిగో! నాతండ్రి — నాతండ్రి — పెండ్లికొడుకు దుస్తులతోఁ బ్రత్యక్షమైనాఁడు. నోరు తెఱచుకొని యున్నాఁడు. దాహమగుచున్నది కాఁబోలు. ఇదిగో లెంపలు గొట్టుకొనుచున్నాను. ఆలస్యమైనది తండ్రీ! ఇదుగో పోవుచున్నాను. (నిష్క్రమించును)

సర్వ—(కత్తిని బాఱవైచి) అయ్యయ్యో! అదియేమి? అదియేమి? మఱిపోయి నదాయేమి? (కూడఁ బరుగెత్తబోవును)

(నేపథ్యమున) ఆదేమి_ఆ_ఆదేమి_ఆ_మతి నాకొ_నీకొ_పోయినది.

కాత్యాయని—(తొందరతోఁ బ్రవేశించి సర్వమంగళను బట్టుకొనును)

కాత్యా—ఆఁగు ఆఁగు_నాభర్తనుజంపిన కిరాతుని పుణ్యాత్ముఁడైన దేవరాజు నలుకఁబోవుచుండఁగా నీవడ్డుపడి యాతనినిఁ గాచెదవా? నాభర్తను జంపుట నీకభిమత మయ్యెనా? నాభర్త నీకేమి యపకార మొనర్చినాఁడు? నీభర్తకుఁ బ్రాణమిచ్చిన యాతఁడు నీకు మహోపకారి కాఁడా? ఇదియేనా నీవిశ్వాసము? నీభర్తతో నిన్నుఁ గూర్చితినే! ఇదియేనా నీవిశ్వాసము?

సర్వ— నాభర్త తొందరతో నవతలికిఁ బరుగెత్తినాఁడు. అతనిమీఁద నే ప్రాణము లున్నవి. నీతో నిప్పుడు నేను మాటలాడఁజాలను. నన్ను క్షమింపుము. నన్ను వదలుము. లే పొమ్ము.

కాత్యా—నిన్నిటనుండి కదలనిచ్చెదనా. నన్నుఁ ద్రోచికొనిపోవుటకు నాకు న్నంత బలము మూఁడునెలల బాలింతరాలవు నీకేది? నావన్న మనఃక్రౌర్యము సంతాన వతివైన నీకేది? కదలినయెడలఁ గన్నులు పీఁకివైచెదను. జాగ్రత్త.

కాత్యా—నీవారాజాధముని మరణమున కేల యడ్డువచ్చితివి? ఆతని చావును జూడవలయుననియే నేనిక్కడ చేరితిని. ఆతని చావుకొఱకే నిన్నిటకుఁ దెచ్చితిని. దాని కడ్డువచ్చెదవా?

సర్వ—నాతండ్రి పరుగెత్తుకొనుచు నీభర్తగుహాలోఁ ప్రవేశించినప్పుడు నీభర్తయే యాతని కభయమిచ్చి యాతనిమరణమున కడ్డువచ్చినాఁడుకదా. నీభర్తకే యిట్టియాచి త్యముండఁగాఁ గన్నబిడ్డనైన నాకుండకపోవునా?

కాత్యా—నాభర్త నీతండ్రిమృతి కడ్డుపడినందులకు నాభర్త కేమిప్రాయశ్చిత్త మైనది? నీతండ్రి యాతని గొంతుక పరిబెట్టి చంపినాఁడు. అటులే నీవాతనిమృతి కడ్డు పడినందులకు నీకుఁగూడ నట్టిశిక్ష కావలసియున్నది. ఆశిక్ష నేనుజేసెదను. ఇక్కడ నేదియుఁ ద్రాడులేదు. అందుచేత గొంతుబిసికి చంపెదను. రా.

(సర్వమంగళ గొంతుపట్టుకొనును)

సర్వ—(ఆమె చేతులను వదల్చుకొని) నీభర్తమృతివలన నీకుఁ గాత్యాలికోన్మా దమెత్తినట్లున్నది. రవంతశాంతిపడుము.

కాత్యా—మృతినొందిన నాభర్తదేహ మింక వేడిగ నుండగా నన్ను జల్లఁబడు మందువా? ఇద్దఱ మొక్కసారియే శాంతింతము రా.

(సర్వమంగళ గొంతుక పట్టుకొనబోవును.)

సర్వ—హా! దేవరాజా!

(ఒకరినొకరి గొంతుకలు పట్టుకొని లాఁగుకొనుచు నిష్క్రమింతురు)

దేవరాజు—(ప్రవేశించి, రక్తమునఁదడిసిన వస్త్రములతో రక్తపాత్రముతో) హా తండ్రీ!

గీ. "గయను నీవిచ్చు తర్పణో ♦ దకములధార
నాకుఁ బుట్టదంచును నీవు ♦ నమ్మవలయు
నీతనిహృద్రక్త తర్పణ ♦ మిచ్చినపుడె
సుఖముఁ డొందవని నా యాత్మ ♦ మొత్తుకొనును."

అనియంటివి. ఇదిగో ! అతని హృదయరక్తము.

"అస్మత్ పితరం వాసిష్ఠగోత్రం విజయరాజేంద్రవర్మాణం
వసురూపం స్వధానమః తర్పయామి—తర్పయామి.
అస్మత్ పితామహం వాసిష్ఠగోత్రం దేవరాజేంద్రవర్మాణం
రుద్రరూపం స్వధానమః తర్పయామి—తర్పయామి.
అస్మత్ ప్రపితామహం వాసిష్ఠగోత్రంవిజయరాజేంద్రవర్మాణం
ఆదిత్యరూపం స్వధానమః తర్పయామి-తర్పయామి.

తండ్రీ! పూర్ణిమనాఁడె నీవు మరణించితివి. ఈనాఁడు సమగ్రముగాఁ బూర్ణిమయే. మా తల్లిగారు గూడ పూర్ణిమనాఁడే సహగమన మొనర్చినారు. పూర్ణిమకును మా కష్టములకును సంబంధమాయేమి? తండ్రీ! ఇఁక నీవు సంతుష్టినొందుదువా? ఉత్తరక్షణమున నేను మరణించినను నాకు బాధ లేదు.

(నేపథ్యమున) హా! హా! సర్వమంగళయుఁ గాత్యాయనియు నేలబారు పాతాళకూపములోఁబడి మునిఁగిపోవుచున్నారు.

దేవ—అయినదా ? ఇఁక జెప్పవలసిన నాఁగవలసిన పనిలేదు. కాలభైరవా! ఇదిగో పెండ్లిబాకు. ఇదిగో చావు. (పొడుచుకొని క్రిందఁబడును.)

భైరవన్న—(ప్రవేశించి) తన పుత్రులను మాతామహుని కప్పఁజెప్పుమనియు నామె కనులు జబ్బుగనుండుటచేఁ గారులోనున్న (శ్రీ)సింహదాసుని విడిపించి పిల్లలను సంరక్షకునిగా నియమింపవలయుననియు నేనియోగించియుఁగాని దేవరాజాజ్ఞయిచ్చినాఁడు. అందుచే దేవరాజు సెలవుదీసికొనిపోవలయును. (అటుచూచి) హా—హా! ఇదియేమి. దేవరాజే? దేవరాజా! అయ్యయ్యో ప్రాణములు విడిచితివా. (అతనికి ప్రదక్షిణము చేసి సాష్టాంగనమస్కార మొనరించును) ఆహా! పాత్రములన్నియుఁ జచ్చిన యీవిరుద్ధనాటకములోఁ గవిమాత్ర మేల మిగిలెనో, నాకుఁ జూవు లేదు. కావున నేను మిగిలియుంటి.

గీ. ధరణి యీతిబాధలు లేక ♦ తనరుగాక
ప్రజలయన్యోన్యవైరముల్ ♦ పాయుగాక
కవిత రాజపోషణమునఁ ♦ గ్రాలుగాక
నీతిపాలనమున రాజు ♦ నెగడుగాక.

అనెడు భరతవాక్య మిప్పుడు తలపెట్ట వలయుఁగదా.

సప్తమాంకము—సర్వము సంపూర్ణము.

# సరస్వతీ బుక్ డిపోవారి స్టేజీ నాటకములు

పానుగంటి లక్ష్మీ నరసింహారావు గారివి

| | |
|---|---|
| కోకిల | 1-2 |
| సరస్వతి | 1-4 |
| వీరమతి | 1-4 |
| పూర్ణిమ | 1-4 |
| ముద్రిక | 1-0 |
| కృష్ణవివాహము | 1-0 |
| మాలతీమాల | 1-0 |
| బుద్ధబోధసుధ | 1-8 |
| పద్మిని | 1-0 |
| సరోజిని | 1-0 |
| శాంతిస్తంభము | 0-12 |
| విచిత్రవివాహము | 0-12 |
| చూడామణి | 0-12 |

విద్వత్కవి మల్లాది అచ్యుత రామ శాస్త్రి గారివి

| | |
|---|---|
| ద్రౌపదీవస్త్రాపహరణము | రు 1-4 |
| భక్తచోఖామేళా | 1-2 |
| కృష్ణలీల (కొత్తది) | 1-0 |

సోమరాజు రామానుజరావు గారివి

| | |
|---|---|
| రంగూన్ రౌడీ (పతిభక్తి) | రు 1-4 |
| సతీసక్కుబాయి | 1-4 |
| ధరణికోట | 1-4 |
| గంగావతరణము | 1-4 |
| భీష్మబ్రహ్మచారి | 1-2 |
| సతీ అనసూయ | 1-2 |
| శాంతికేతనము | 1-2 |

| | |
|---|---|
| ప్రతాపరుద్రీయము సో॥రా॥ | 1-4 |
| మహాభక్తవిజయము | 1-4 |
| తాజ్ మహల్ (జహనారా) | 1-4 |
| భోజకాళిదాసు | 1-2 |
| సంగీత శశిరేఖ | 1-0 |

చందాల కేశవదాసు గారివి

| | |
|---|---|
| కనకతార | రు 1-4 |
| బలిబంధనము | 1-0 |
| శ్రీకృష్ణ తులాభారంసాంగ్సు | 0-12 |
| రాధాకృష్ణ సాంగ్సు | 0-12 |

జంధ్యాల శివన్నశాస్త్రిగారివి

| | |
|---|---|
| దుర్గాదాసు | రు 1-4 |
| రాణా ప్రతాపసింహ | 1-4 |

ఇచ్ఛాపురపు యజ్ఞనారాయణ శాస్త్రిగారివి.

| | |
|---|---|
| రసపుత్రవిజయము | రు 1 0 |
| రాణాప్రతాప్‌సింగ్ | 1 0 |

ముత్తనేని వెంకట చెన్నకేశవులుగారివి

| | |
|---|---|
| చండిక | రు 1 2 |
| తులసీదేవి (సతీతులసి) | 1 2 |
| శివలీల | 1 0 |
| దక్షాధ్వరం (సతీదేవి) | 1 2 |

శ్రీరాముల సచ్చిదానందశాస్త్రిగారివి

| | |
|---|---|
| సావిత్రి | 1 4 |

నండూరి శివరావుగారివి

| | |
|---|---|
| చంద్రగుప్త | 1 2 |

# సరస్వతీ బుక్ డిపోవారి స్టేజీ నాటకములు

శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి గారివి

| | |
|---|---|
| బొబ్బిలియుద్ధము | రు 1-0 |

అయినాపురపు సుందరరామయ్యగారివి

| | |
|---|---|
| గులేబకావళి | రు 1-0 |
| ఊర్వశీశాపవిమోచనము | 1-0 |
| పసర్ బకావళి | 1-0 |
| బంగార్ బకావళి | 1-0 |
| ప్రతిజ్ఞాపాండవము | 0-12 |
| ప్రతిజ్ఞాయాదవము | 0-12 |
| వాసంతిక (చెంచులక్ష్మి) | 0-12 |
| గరుడగర్వభంగము | 0-12 |
| లాల్ గోహార్ | 0 12 |
| శ్రీకృష్ణవిలాసము | 0-12 |

సూరి పార్థసారథి శర్మగారివి

| | |
|---|---|
| రంగూన్ మెయిల్ | రు 1-2 |
| కటోరి | 1-0 |

కాళ్ళకూరి హనుమంతరావుగారివి

| | |
|---|---|
| కాలేజీ గరల్ | రు 0-12 |
| లేడీడాక్టరు | 0-8 |

కాళ్ళకూరి గోపాలరావుగారివి

| | |
|---|---|
| వాల్మీకి | రు 1-2 |

ఓరుపాటి చిదంబరశాస్త్రిగారివి

| | |
|---|---|
| శ్రీరామాంజనేయము అను హనుమద్రామసంగ్రామము | 1-0 |

ఊటుకూరు సత్యనారాయణగారివి

| | |
|---|---|
| అనార్కలి | రు 0-12 |

వేదాంతకవిగారివి

| | |
|---|---|
| తెలుగుతల్లి | రు 1-2 |

చిలకమర్తి లక్ష్మీనరసింహంగారివి

| | |
|---|---|
| ప్రసన్నయాదవము | రు 0-8 |
| పారిజాతాపహరణము | 0-8 |

యర్రమిల్లి సూర్యప్రకాశరావుగారివి

| | |
|---|---|
| మోడరన్ బి. ఏ. | రు 1-0 |

సోమరాజు అచ్యుతరావుగారివి

| | |
|---|---|
| పత్నీప్రతాప్ (అనసూయ) | రు 1-2 |

కేతవరపు రామకృష్ణశాస్త్రిగారివి

| | |
|---|---|
| భక్తమీరాబాయి | రు 1-2 |

శ్రీపాద రామేశ్వరరావుగారివి

| | |
|---|---|
| ఏకీచ్ ప్యాలా (ఒక పెగ్) | రు 1-0 |
| పునర్వివాహము | 1-0 |
| భారతరమణి | 1-0 |
| చిత్రవృత్తి | 1-0 |
| కళాపహాడ్ | 1-0 |
| మాధవాచార్యవిద్యారణ్య | 1-0 |
| సంభాజీ నిర్యాణము | 1-0 |
| బిల్వమంగళ | 1-0 |
| శివాజీశీలము | 1-0 |
| లీలావతి సులోచనలు | 1-0 |

వలయువారు :— కురుకూరి సుబ్బారావు అండ్ సన్,

ప్రొప్రయిటర్సు : సరస్వతీ బుక్ డిపో, బెజవాడ.